శ్రీః

# శ్రీ హలాయుధ శివ స్తోత్రమ్

డమరుక వ్యాఖ్యానమ్

(ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)

దోర్బల విశ్వనాథ శర్మ



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి

తెనాలి

శ్రీః

# శ్రీ హలాయుధ శివ స్తోత్రమ్

డమరుక వ్యాఖ్యానమ్

(ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)

దోర్బల విశ్వనాథ శర్మ

ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి

తెనాలి

2



**R. MOHANA RAO**, M.Sc.,
H.No.: 4-103, I.L.T.D. Colony (Extn.)
Kothapet, CHIRALA - 523 157
✆ : 08594 - 34054

First Edition : 4-3-2000
శ్రీ ప్రమాథి సంవత్సరము - మాఘమాసము - మహా శివరాత్రి

Price : Rs. 20/-



శ్రీ హలాయుధ శివ స్తోత్రమ్
డమరుక వ్యాఖ్యానమ్ -(ఆంధ్ర ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)
దోర్బల విశ్వనాథ శర్మ - ప్రథమ ముద్రణ - మహాశివరాత్రి, ప్రమాథి సం॥
పేజీలు: 112 ప్రతులు : 1000

D.T.P. by
*MR LASER PRINTS*
CHIRALA - 523 155
☎ : 08594-36074

PRINTED at
Jyothi Off-set Printers
Kothapeta.
Chirala.

# శ్రీ హలాయుధ శివ స్తోత్ర పరిచయము

సంస్కృత వాఙ్మయ(చరిత్ర)మున హలాయుధ నామకులు ఇద్దరు ముగ్గురు కనిపించెదరు. వారిలో ఒకడు నిఘంటుకర్త. ఈతనిని మల్లినాథాది వ్యాఖ్యాతలు పేర్కొనినారు. మరొకడు ప్రస్తుత స్తోత్రకర్త. ఈ ఇద్దఱును అనన్యులు కారనియు చెప్పలేము.

శైవస్తోత్ర వాఙ్మయమున పుష్పదన్త మహాకవిది ఉన్నతమైన స్థానము. శివస్తోత్ర కర్తలలో పెక్కుఱు కొంచెముగనో హెచ్చుగనో పుష్పదన్తు ననుకరించిన వారే. శివస్తోత్ర కర్తలే అననేల? పరమ హంస బ్రహ్మానంద స్వామి రచించిన విష్ణు మహిమ్నః స్తోత్రమునందును పుష్పదన్తుని శివ మహిమ్నః స్తోత్రచ్ఛాయులు కలవు. పుష్పదన్తుని జాడ ననుసరించి బ్రహ్మానన్దస్వామియు శిఖరిణీ వృత్తముననే తన విష్ణు మహిమ్నః స్తోత్రము రచించినాడు. గణేశ మహిమ్నః స్తోత్రమున శిఖరిణీ వృత్తమే ఉపయోగింప బడినది. దేవీ, పరశమ్భు మహిమ్నః స్తోత్రములు (దూర్వాసోముని కృతములు) ఇతర వృత్తములలో రచింపబడినను పుష్పదన్తుని భావముల అనుసరణములు కన్పించును. మహిమ్నః స్తోత్ర శాఖకు ప్రమథ గణాన్తర్గతుడుగా ప్రసిద్ధుడైన పుష్పదన్తుడే ఆద్యుడేమో. ఆతనిని హలాయుధుడు వృత్త విషయమున తప్ప భావములలో అనుకరించియే యున్నాడు. హలాయుధశబ్దము యొక్క రూఢ్యర్థము బలరాముడు. బహుభుజ విష్ణువర్ణనలలో విష్ణువు హలాయుధమును చేత ధరించినట్లున్నది. హలమనగా నాగలి. దాని నాయుధముగా ధరించినవాడు విష్ణువు. ఆయన అవతారమైన బలరాముడు హలాయుధుడుగా సుప్రసిద్ధుడు. సంకర్షణా పరనామధేయుడైన బలరాముడు కోప స్వభావుడు. కోప స్వభావము కల ఆదిశేషుని అవతారమనియు చెప్పబడు చున్నాడు. "సంకర్షణ మూర్తి స్వరూపో యో సా వాదిత్యః పరమపురుష స్స ఏష రుద్రో దేవతా" అను బోధాయన లఘున్యాస వాక్యము ననుసరించి రుద్రుడు సంకర్షణమూర్తి స్వరూపుడగుటచే ఆ సంకర్షణుడు హలము సలాయుధుడగుటచే కోప స్వభావము తన స్వభావము గలవాడును అగుటచే హలాయుధ శబ్దము రుద్రవాచక మనియు చెప్పనగును. వైష్ణవాగములలో కొన్నింట సంకర్షణ నామక విష్ణువు లయకర్తగా చెప్పబడినాడు. విష్ణువు యొక్క చతుర్వ్యూహము లలో సంకర్షణ వ్యూహమొకటిగా చెప్పబడుట ప్రసిద్ధమే. శైవాగమములలోని హరనామక రుద్రునికీ సంకర్షణ నామక విష్ణువు ప్రతిద్వంద్వి. బీజావాపమునకు ముందు చేయబడు సంకర్షణము అంతకు ముందు భూమిలోనున్న పంటయొక్క అవశేషములను నశింప జేయు నట్టిది కావున అది లయముతో సమానమైన పని. అది హలాయుధ కృత్యము. కావున హలాయుధకవి యొక్క శివ స్తవన ముచితమనుట ఈ వివరణముయొక్క సారము. శ్రీమద్రామాయణ చమ్పూ ప్రబన్ధకర్త భోజుడు విఘ్నేశ్వర స్తుతితో తన చమ్పువును ఆరంభించినాడు.

కాళిదాసు పార్వతీ పరమేశ్వరస్తుతితో రఘువంశమహా కావ్యమును, బాణుడు త్రిమూర్తి స్వరూప పరమేశ్వరుని స్తుతితో తన కాదంబరీ మహాగద్య కావ్యమును ఆరంభించినాడు. స్తోత్రకావ్యకర్తలలో తమ ఇతర దేవతా స్తోత్రారంభమున హలాయుధు విఘ్నేశ్వరుని స్తుతించిన వారుగాని ఆ విఘ్నేశ్వరునితో పాటు కుమార స్వామిని స్తుతించినవారుకాని నా దృష్టికి రాలేదు. విఘ్నేశ్వరుని కుమారస్వామిని స్తుతించిన పిమ్మట తన శైవ స్తోత్రమును హలాయుధుడు ఆరంభించినాడు. ఈ పద్ధతి ఈతని ప్రత్యేకత.

పుష్పదన్తునంత అధికముగా కాకున్నను హలాయుధుడు తన స్తోత్రమున కొంత దార్శనికత ప్రకటించినాడు. బ్రహ్మసూత్రములలో (వేదాంత దర్శనము) ప్రతిపాదింపబడిన అక్షి పురుష విద్య ఈ స్తోత్రము యొక్క నలుబది రెండవ శ్లోకమున, ఉపాసకుని మరణానంతరము ఆతివాహిక దేవతలు అర్చిరాది మార్గమున కొనిపోవుట నలుబదియైదవ శ్లోకమున, యోగదర్శనము నందలి ధర్మ(మేఘ) సమాధినలుబది యేడవ శ్లోకమున ప్రస్తావింపబడినవి. వీనిని పుష్పదంతుడు ప్రస్తావించలేదు.

మన్దాక్రాంతా వృత్తమున స్తోత్రకావ్యములు రచించినవారు మిక్కిలి అరుదు. అట్టి వారిలో హలాయుధుడు ప్రముఖుడు. స్తోత్రకావ్యములలో అర్థాంతరన్యాసా లంకారముల ప్రయోగించిన వారిలో ప్రముఖుడు పుష్పదన్తుడు. కాళిదాసు మేఘసన్దేశ కావ్యమున మన్దాక్రాంతా వృత్తముల ప్రయోగించి వానిలో మనోహరములైన అర్థాంతర న్యాసాలంకారముల ప్రయోగించినాడు. స్తోత్ర కావ్యమున మన్దాక్రాంతావృత్తములలో అర్థాంతరన్యాసాలంకార ప్రయోగమున వారిరువురి ననుసరించిన వాడు హలా యుధుడు. మచ్చుకు రెండు ఉదహరింపబడు చున్నవి. "కిం వా కైశ్చి త్కనక కమలై రర్చితమ్ పాదపీఠమ్ భక్త్యా శమ్భోర్ న పునరపరః పూజయ త్యర్కపుష్పైః" (కొందఱు బంగారు పూవులతో నర్చించిన (శివుని) పాదపీఠమును భక్తితో నొకడు జిల్లేడు పూలతో నర్చింపడా) ఇది యొక అర్థాన్తరము. మహాకవులు గొప్పగా శివుని స్తుతించినంత మాత్రమున నేను నాకున్న శక్తి ననుసరించి స్తుతించకూడదా? ఇది యొక అర్థము. ఈ అర్థమును సమర్థించుటకై పై అర్థాంతరమును న్యసించి సమర్థించినాడు. తద్ధి శ్లాఘ్యం స్పృశతి పదవీం కామయన్తే న భృత్యాః ప్రభుస్థానమును కోరక పోవుటయే భృత్యులలో మెచ్చుకొనదగినది (అంశము). ఈ అర్థాంతరమును "భక్తులు శివైక్యమును కోరుకొనరు' అను అర్థమును సమర్థించుటకు ప్రయోగింపబడినది.

మొత్తము మీద ఈ స్తోత్రమున కవితా సౌందర్యము మెచ్చుకొనదగినదిగా నున్నది. కాని ఈతని జీవిత చరిత్ర వివరములు తెలియ రాలేదు.

- దోర్భల విశ్వనాథ శర్మ

శ్రీః

# శ్రీ హలాయుధ శివ స్తోత్రమ్

## డమరుక వ్యాఖ్యానమ్

(ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)

## దోర్బల విశ్వనాథ శర్మ

అవతారిక:- హలాయుధ కవి శివ స్తోత్రము నారంభింపఁబూని నిర్విఘ్న పరిసమాప్తి కొఱకు ద్విరద వదనుని స్తుతించు చున్నాడు.

శ్లో॥ విఘ్నా న్నిఘ్నన్ ద్విరద వదనః ప్రీతయే నో2స్తు నిత్యం
వామే కూటః ప్రకటిత బృహ ద్దక్షిణ స్థూల దన్తః।
యః శ్రీకణ్ఠమ్ పితర ముమయాశ్లిష్ట వామార్ధదేహం
దృష్ట్వా నూనం స్వయమపి దధానోర్ధనారీశ్వరత్వమ్॥ 1

ప్రతిపదార్థము:- యః=ఎవడు, పితరమ్=తండ్రియైన, ఉమయా=పార్వతి చేత, ఆశ్లిష్ట వామార్ధ దేహమ్=కౌగిలించుకొనబడిన ఎడమ సగము శరీరముగల, శ్రీకణ్ఠమ్=శివుని, దృష్ట్వా=చూచి, నూనమ్=నిశ్చయముగా, స్వయమ్ అపి=తాను కూడ, అర్ధనారీశ్వరత్వమ్=అర్ధనారీశ్వరత్వమును, దధానః=ధరించు చున్నాడో యనునట్లున్న, వామేకూటః=ఎడమ భాగమున వక్ర(తుండ)త గల, ప్రకటిత బృహద్దక్షిణ స్థూల దన్తః=ప్రకటింపబడిన పెద్దదైన కుడివైపున నున్న లోతైన దంతముగల, ద్విరద వదనః=గజముఖుడు, విఘ్నాన్ = విఘ్నములను, నిఘ్నన్= నశింప జేయుచు, నిత్యమ్=ఎల్లప్పుడు, నః=మా యొక్క, ప్రీతయే= ప్రీతికొరకు, అస్తు=అగుగాక!

తాత్పర్యము:- ఎడమవైపున వక్ర(తుండ)తను కుడివైపు పెద్దదైన లావైన దంతమును ధరించి తల్లియైన పార్వతీ దేవితో కౌగిలించుకొనబడిన దేహము కల తండ్రియైన శ్రీ కంఠుని వలె అర్ధనారీశ్వరత్వమును ధరించు చున్న గజ ముఖుడు మా విఘ్నముల నశింప జేయుచు మమ్ము సంతోషింపజేయు గాక!

వివరణము:- గజముఖుడు తన ముఖమున ఎడమవైపు తొండము కొంచెము సాగి క్రిందకు వాలియున్నట్లు ధరించి యున్నాడు. తెల్లయేనుగొకటి స్వర్గమున నున్న, నుండిన నుండుగాక. సాధారణముగా ఏనుగులన్ని నల్లనివి. కావున వాని తుండములు నల్లనివి. పార్వతీ దేవి నలుపు వన్నె కలది. కావున స్తన జఘనాదుల గురుత్వము మధ్యాదుల తనుత్వము ఆమె శరీరమున కించిద్వక్రత కలిగించినవి. ఋజుత కన్న వక్రతయే సౌందర్యాపాదకమని ఆలంకారికుల భావన. ఒక ఆలంకారికుడు కుంతకుడు. ఉక్తులలోని వక్రతయే అనగా వక్రోక్తియే కావ్య జీవితమని చెప్పినాడు. అమ్మవా రొయ్యారముగా శివునెడమ భాగమున వాలి యుండుటచే, ఆమె శరీరమున వక్రత కలిగినది. అనగా ఒక సొబగు ఏర్పడినది. శ్లోకమునందలి వామేకూటః అను అలు క్సమాసములోని కూట శబ్దము వక్రతావాచి యగుటచే నీ యర్థ మున్నేయమగు చున్నది. గజముఖుని ముఖమున కుడివైపు పెద్దదైన లావైన దంతమున్నది. అది తెల్లగా నున్నది. శివుడు తెల్లనివాడు. కావున దంతము శివుడా యన్నట్లున్నది. ఎడమ వైపు నందలి నల్లని వక్రతుండము పార్వతియా యన్నట్లున్నది. ఒకే ముఖమున ఎడమ కుడులు నలుపు తెలుపుతో అర్ధనారీశ్వరత్వము గజముఖుని ముఖమున సూచించు చున్నవి. బృహత్ స్థూల శబ్దములు పురుషుని పెద్దతనము లావుగా నుండుటను సూచించు చున్నవి. ముఖము నందలి ఎడమ భాగము కనబడకుండ తొండ మెడమ భాగమున వాలి యున్నది. పార్వతీదేవి శివుని ఎడమ భాగమున వ్యాపించి, శివుని ఎడమ భాగము పార్వతీ దేవియే, ఆతని కెడమ భాగము లేదేమో అన్నట్లు, ఆతని ఎడమ భాగము నాక్రమించి యున్నది. ఆశ్లిష్ట శబ్దము బాగుగా కలసియున్న అను అర్థము నిచ్చును. అందలి భాగమే శివుని ఎడమ భాగము శివునెడమ భాగముతో ఏకమై పోయినదా యన్నట్లు కలిసి యుండుటలో నున్నది. ఈ యర్థము నంతయు కవియే ఉత్తరార్ధములోని ఉత్ప్రేక్షాలంకారము ద్వారమున తెలిపియే యున్నాడు. తల్లిదండ్రులు ఒక శరీరముగా మారి అర్ధనారీశ్వరత్వమును బొందినారు. శివునకే అర్ధనారీశ్వర శబ్దము వాచకముగా నున్నందున తండ్రిని చూచియే కుమారుడు తన ముఖమున అర్ధనారీశ్వరత్వము ను ప్రదర్శింపజేసినాడని మనము గమనింప వలసి యున్నది. శివుని ముఖము శ్రీ ముఖము. శివుని వక్షము శ్రీ వక్షము. శివుని కరములు శ్రీ కరములు. శివుని పాదములు శ్రీ పాదములు. కాని ఈ శ్లోకమున కంఠ మొక్కటే శ్రీ

కంఠమని చెప్పబడినది. శ్రీయను నామముగల పార్వతీ దేవి యొక్క నల్లని బాహువు ఆ శివుని కంఠమును ఎల్లప్పుడు చుట్టుకొనుటచే శివుని శరీరమంతయు తెల్లగా నున్నను కంఠము మాత్రము అమ్మవారి బాహువుతోడి నిత్య సంబంధమువలన నలుపు వన్నె నొంది శ్రీ కంఠమని చెప్పబడిన దేమో యను సంభావనము శ్రీకంఠ శబ్దముచే వ్యంగ్యమగుటచే పూర్వార్థమున ఉత్ప్రేక్షాలంకార ధ్వని యున్నది. వాస్తవమునకు లోకక్షేమ నిమిత్తము శివుడు విషము త్రాగుటచే వికృతిని (నలుపు) పొందిన కంఠము శ్రీకంఠము కాక ఏ మగును. ఇతరా వయవముల కన్న కంఠమీ లోకమును కాలకూట విషదగ్ధము కాకుండ కాపాడినందున ఆ కంఠము శ్రీకంఠమగుటలో విప్రతిపత్తి లేదు. పార్వతీ దేవి నల్లనిది. కాక గౌరియను పక్షమున నల్లని శివుని కంఠమనెడు మేఘమున ఆమె బాహువు మెఱుపు తీగ వలె నున్నది. అని ఉపమించిన యొక కవిని (శూద్రకుని) మనము స్ఫురణకు తెచ్చుకొన వలసి యున్నది. ఆయన 'పాతు వో నీలకంఠస్య కంఠః శ్యామామ్బుదోపమః గౌరీ భుజలతాయత్ర విద్యు లేఖేవ రాజతే' (నీల కంఠుని నల్లని మేఘము వంటి కంఠమున గౌర వర్ణము గల గౌరియొక్క మెఱుపు తీగవంటి బాహులత ప్రకాశించు చున్నది) అని చెప్పినాడు. శ్రీ శబ్దమునకు విషమని యర్థము. కావున శ్రీ కంఠ శబ్దము విషభక్షణముచే శివుని కంఠమున నైల్య మేర్పడినదను పురాణకథను స్మరింపజేయు చున్నది. కూట శబ్దమునకు మాయయను అర్థము కూడ నున్నది. కావున 'వామే కూటః' అను సమాసము 'మాయాం తు ప్రకృతిం విద్యాత్' అను ఉపనిషత్సూక్తి ననుసరించి పార్వతీ దేవి యొక్క మాయాత్వ ప్రకృతిత్వములను సూచించును. అంతేగాక మాయామాయ సంబంధము లేక ప్రకృతి పురుష సంబంధము భార్యాభర్తృ సంబంధము వంటిదని అను 'వామేకూటః' అను సమాసములోని వామే శబ్దము (భార్య యొక్క వామ భాగస్థితి ననుసరించి) సూచించును. శివునకు వామ భాగమున పార్వతి అర్ధాంగియై యున్నను ఆయన తలనెక్కి కూర్చున్న గంగమ్మపై నసూయతో పార్వతీ దేవి యంతటి ఉత్తమ స్త్రీ కూడ వామకాక తప్పలేదు. ఈ అంశము వామార్ధదేహమ్ అను సమాసములోని వామా శబ్దము తెలుపు చున్నది. అయినను శివుడు ఇరువురిని సమానముగానే చూచు దాక్షిణ్యము (దక్షిణ నాయకత్వము) కలవాడని 'ప్రకటిత...దక్షః' అను సమాసములోని దక్షిణ శబ్దము సూచించు చున్నది. పార్వతీదేవి ఈ శ్లోకమున ఉమ అని చెప్పబడినది. ఉమాశబ్దము

అకారోకార మకారములతో కూడిన ఓంకారమునకు సూచకము. పవిత్రమైన ఈ స్తోత్రము యొక్క పఠనము ఓంకార పూర్వకముగా నారంభింప బడవలెనను సూచన మీ శబ్దము నుండి కలుగు చున్నది. అంతేకాక పార్వతీదేవి శబ్దరూపిణి అని, శివుడు అర్థరూపుడు అని వారిద్దఱకు ఒకరినొకరు విడచి యుండలేని అవినాభావ సంబంధము సైతము ఆ శబ్దము సూచించును. విఘ్నాన్నిఘ్నన్, ద్విరదవదన అను పదద్వంద్వములలో వృత్త్యనుప్రాసాలంకార మను శబ్దాలంకార మున్నది.

అవతారిక:- విఘ్ననివారక ద్విరదవదను స్తుతి పిమ్మట ఆతని సోదరుడు అ మంగళ నివారక మంగళమూర్తియగు కుమారస్వామి యొక్క స్తుతి ఈ క్రింది శ్లోకమున చేయబడు చున్నది.

శ్లో॥ శ్లాఘ్యః పుత్ర స్స భవతి కిల స్వస్య వప్తు స్సకాశా
ద్ధత్తే కైశ్చిత్ క్వచిదపి గుణై ర్య స్సముత్కర్ష రేఖామ్।
ఇత్థం వాఞ్ఛన్ పితు రధికతామ్ పఞ్చ వక్త్రస్య నూనం
షష్ఠమ్ బిభ్ర ద్వదన మపరమ్ పాతు విశ్వం విశాఖః॥ 2

ప్రతిపదార్థము:- యః=ఎవడు, స్వస్య=తన(బీజము) యొక్క, వప్తుః=ఊచు (నాటు)వాడైన తండ్రి యొక్క, సకాశాత్=సమీపము నుండి, కైశ్చిత్=కొన్ని, గుణైః =గుణముల చేత, క్వచిత్ అపి=ఎక్కడనైనను, సముత్కర్ష రేఖామ్=ఆధిక్యాంశము ను, ధత్తే=ధరించునో, సః=ఆ, పుత్రః=పుత్రుడు, శ్లాఘ్యః=మెచ్చుకొనదగిన వాడు, భవతి=అగును, ఇత్థమ్=ఇట్లు, పంచవక్త్రస్య=అయిదు ముఖములుగల, పితుః= తండ్రి యొక్క (కన్న), అధికతామ్=ఆధిక్యమును, వాంఛన్=కోరుచు, నూనమ్= నిశ్చయముగా, షష్ఠమ్=ఆరవదైన, అపరమ్=మరొక, వదనమ్=ముఖమును, బిభ్రత్=ధరించుచు, విశాఖః=కుమార స్వామి, విశ్వమ్=విశ్వమును, పాతు= కాపాడుగాక!.

తాత్పర్యము:- తండ్రి లక్షణములను, పోలికలను కొన్ని ఎక్కువగా కుమారు నందు సంక్రమించినచో ఆ కుమారుడు మెచ్చుకొనదగిన కుమారుడు అగును. అందుచేత తండ్రికన్న అధికతను సంపాదించ గోరిన కుమార స్వామి తండ్రికైదు ముఖములుండగా తానొక ముఖము నాతనికన్న అధికముగా ధరించినట్లున్నది.

వివరణము:- తండ్రి తాను (కుమారుడు తప్ప మిగిలిన అందఱికన్న గొప్ప వాడు) సర్వాధికుడు కావలెనని కోరుకొనును. శివునకు సర్వాధికత సహజముగానే ఉన్నది. తండ్రియైన వాడు తన కుమారుడు తనకన్న గొప్పవాడు కావలెనని కోరుకొనును, పుత్రాధిచ్ఛేత్ పరాజయమ్ (పుత్రుని నుండి తండ్రి ఓటమిని కోరుకొనవలెను) అను సూక్తి ఈ యంశమునే చెప్పుచున్నది. పూర్వ శ్లోకమున తండ్రితో సమానత్వమునే కోరుకొన్న వినాయకుడు తన ముఖమున అర్ధనారీశ్వరత్వమును ధరించినట్లుత్ప్రేక్షింపబడినది. ఈ శ్లోకమున ఆ వినాయకుని తమ్ముడైన విశాఖుడు తండ్రి పోలికలతో సమాన లక్షణములతో తృప్తి పడలేదు. తండ్రిని మించవలెనను కోరికతో ఆయనవలె అయిదు ముఖములతో తృప్తి పడక అదనముగా మరొక తలను ధరించి ఆ విషయమున ఆతని (శివుని) మించినాడేమో అను సంభావన మీ శ్లోకమున నుండుటచేత ఈ శ్లోకమున ఉత్తరార్ధమున ఉత్ప్రేక్షాలంకార మేర్పడి యున్నది. శివునకు స్థాణువు అను పేరున్నది. ఆకులు, కొమ్మలు లేని ఎండిన చెట్టు స్థాణువు అని చెప్పబడును. ఆతని భార్య అపర్ణ. ఆకులు లేని తీగవలె ఆ స్థాణువుతో తనను కట్టుకొని సంసార మొనరించినది. ఆ దంపతులకు సంతానమైన వాడు విశాఖుడు (కొమ్మలు లేనివాడు) కాక ఏమగును? విశాఖ శబ్దము ఈ అంశమును వ్యంజించుచున్నది. తండ్రి కోరదగిన పుత్రాధిక్యము లోక ప్రసిద్ధమైనను దానికి భిన్నముగా పుత్రుడే పిత్రాధిక్యమును కోరుట ఈ శ్లోకమున చెప్పబడినది. వినాయకుడు పితృసమత్వము నందుకొనుటకై అర్ధనారీశ్వరత్వమును కోరు కొన్నట్లు పూర్వ శ్లోకమున చెప్పబడగా, ఈ శ్లోకమున వినాయకుని కన్న ఒక అడుగు ముందుకు వేసి విశాఖుడు పంచముఖత్వమును మించిన షణ్ముఖత్వము ను కోరుకొనుట చెప్పబడినది. ఒక తండ్రి సంతానమైనను స్వభావముల వైలక్షణ్యా ముండుట లోక ప్రసిద్ధము.

అవతారిక:- పితృ సంతోష హేతువైన పుత్రస్తుతి పూర్వశ్లోకములలో చేయబడినది. ఈ శ్లోకమున ముఖ్యముగా చేయదలపెట్టిన శివస్తుతి ఆరంభింపబడుచున్నది.

**శ్లో॥ ఏకో దేవ స్స జయతి శివః కేవల జ్ఞాన మూర్తి**
**ర్దేవీ సా చ త్రిభువన మిదం యద్విభూతి ప్రపఞ్చః॥**

**యత్కూటస్థ మ్మిథున మవినాభావ సమ్బన్ధ యోగా**
**న్మిశ్రీ భూతం తదఖిల జగజ్జన్మ బీజం నమామి॥ 3**

ప్రతిపదార్థము:-యత్ కూటస్థమ్=ఏ యిరువురి కలయికలో నేర్పడిన, మిథునమ్=జంట, అవినాభావ సంబంధ యోగాత్=ఒకరినొకరు విడచి యుండ లేకపోవుటచే, మిశ్రీభూతమ్=కలసిపోయినదో, ఇదమ్=ఈ, త్రిభువనమ్= ముజ్జగము, యద్ విభూతి ప్రపంచః=ఏ జంట విభూతి యొక్క విస్తారమో, తత్=ఆ, అఖిల జగజ్జన్మ బీజమ్=అఖిల లోకముల జన్మకు హేతువైన విత్తనము ను, నమామి=నమస్కరించెదను, ఏకః=ఒక, దేవః=దేవుడైన, సః=ఆ, కేవలజ్ఞాన మూర్తిః=జ్ఞానమే స్వరూపముగా గల, శివః=శివుడు, జయతి= సర్వోత్కర్షముగా వర్ధిల్లు చున్నాడు, సా=ఆ, దేవీచ= దేవియు, జయతి= సర్వోత్కర్షముగా వర్ధిల్లు చున్నది.

తాత్పర్యము:- జ్ఞానైక స్వరూప శివ దేవుడు, జ్ఞానైక స్వరూపయగు శివాదేవియు మాయామయ కూటస్థమైన అవినాభావ సంబంధము వలన కలసిపోయిన జంటగా నేర్పడుటచే నా జంట అఖిల జగజ్జన్మహేతుభూత బీజమైనది. అట్టి జంటకు నేను నమస్కరించెదను. ఈ ప్రపంచ మంతయు ఆ జంట మహిమ విస్తారమే. ఆ (శివా) శివ మిథునము సర్వోత్కర్షముగా వర్ధిల్లు చున్నది.

వివరణము:- వినాయకుడు స్థూల శరీర సమష్టి వైశ్వానరునకు సంకేతము, విశాఖుడు సూక్ష్మ శరీర సమష్టి హిరణ్యగర్భునకు సంకేతము. వీరిరువురు కార్య బ్రహ్మ స్వరూపులు. అనగా వీరికి జీవత్వము బ్రహ్మత్వము రెండును ఉండును. కార్యులు కావున వీరిరువురు శివ మిథునము నుండి పుట్టిన వారని చెప్పబడినది. తత్పుత్రులుగా లోకమున ప్రసిద్ధి ఉండనే ఉన్నది. కార్యమునకు ఉపాదాన నిమిత్త కారణ ద్వయ ముండును. పార్వతీదేవి ఉపాదాన కారణమని శివుడు నిమిత్త కారణమని చెప్పవలసి యున్నది. కాని పార్వతీ పరమేశ్వరు లిరువురు కేవల జ్ఞాన మూర్తులుగా శ్లోకమున చెప్పబడుటచే వారిరువురి జంట అభిన్న నిమిత్తోపాదన కారణభూతమని చెప్పబడుటచే బీజశబ్దమున కుపాదాన కారణ మనియే అర్థము. ఐనను అవినాభావ సంబంధ యోగమున మిశ్రీభూతమని చెప్పబడుటచే బీజ శబ్దమున భిన్న నిమిత్తోపాదనముగానే గ్రహింపవలెను. 'యత్ కూటస్థమ్' అను సమాసములోని కూట శబ్దము మాయా వాచక మగుటచే

ఉపాదానమని, కేవలం జ్ఞానమూర్తి స్వరూపుల జంటగా ఆ మిథునము శ్లోకమున పేర్కొనబడుటచే నిమిత్తమనియు తెలియు చున్నది. ఈ జ్ఞానము ప్రకృతి యందు అనగా మాయయందు ప్రతిబింబించుటచే ఆ బీజము అభిన్న నిమిత్తో పాదానముగుటయే గాక కారణబ్రహ్మత్వమును అనగా అవ్యాకృత (కారణ శరీర సమష్టి)త్వమును పొంది యున్నదని చెప్పబడినట్లైనది. మాయా విహీనమైనప్పుడు ఆ బీజమునకు బీజత్వము పోయి కేవల సాక్షిత్వము మిగులును. కేవలజ్ఞాన మూర్తిః అను సమాసములోని కేవల శబ్దమీ యర్థమును సూచించు చున్నది. ఇంతేగాక, దేవీ దేవ శివాశివ వ్యవహారమును మిథున వ్యవహారమును కల్పితమని సూచించు చున్నది: త్రిభువనము ఆ శివాశివుల విభూతియని చెప్పుటకూడ, ఆ త్రిభువనము యొక్క మాయామయత్వమునే సూచించు చున్నది. బీజ శబ్దము అఖిల జగములు సత్యములని విశ్వసించు వారి కొఱకు, విభూతి శబ్దము వాని యొక్క పారమార్థిక సత్తాశూన్యతను బోధించుచు, జ్ఞానుల నుద్దేశించి, ప్రయుక్త మైనవని గ్రహింప వలెను. 'అఖిల జగజ్జన్మ బీజమ్ నమామి', త్రిభువనమిదం యద్విభూతి ప్రపంచః అను వాక్యములు అజ్ఞానము తొలగుట కొఱకు ఆ మిథునము యొక్క నమ్యతను (ఉపాసనీయతను) ఆ మిథునము యొక్క జ్ఞేయతను వ్యంజింపజేయు చున్నది.

అవతారిక:- పై శ్లోకమున శివ మిథునము యొక్క విజ్ఞానమయత్వము జగజ్జన్మహేతుత చెప్పబడినవి. ఈ శ్లోకమున దాని యొక్క అసదృశత చెప్పబడు చున్నది.

శ్లో॥ ఏకః స్రష్టా సకల జగతా మాదిభూతః స్వయమ్భూ<br>
స్త్రాతా తేషాం త్రిభువన గురు ర్వాసుదేవః ప్రసిద్ధః।<br>
య స్తౌ ద్వావప్యతుల మహిమా సంహర త్యన్తకాలే<br>
క స్తస్యాన్యో భవతి సదృశః శ్రీ మహా కాల మూర్తే॥ 4

ప్రతిపదార్థము:- సకల జగతామ్=సర్వలోకముల యొక్క, ఏకః=ఒక, స్రష్టా= సృష్టికర్తయైన, ఆదిభూతః=మొదట పుట్టిన, స్వయమ్భూః=(స్వయముగా పుట్టిన ప్రసిద్ధిగల) బ్రహ్మ, తేషామ్=వాని(లోకముల) యొక్క, త్రాతా=రక్షకుడు, త్రిభువన గురుః=ముజ్జగముల గురువైన, వాసుదేవః=విష్ణువు, ప్రసిద్ధః= ప్రసిద్ధుడు, అతుల మహిమా=సాటిలేని మహిమగల, యః=ఎవడు, అంతకాలే= ప్రలయ

కాలమున, తే=ఆ, ద్వావపి=ఇరువురిని కూడ, సంహరతి=సంహరించునో, తస్య=ఆ, శ్రీ మహా కాల మూర్తేః=శివునకు, అన్యః= ఇతరుడైన, కః=ఎవడు, సదృశః=సమానుడు, భవతి=అగును.

తాత్పర్యము:- సకల జగముల నొకడే సృజించిన వాడుగా స్వయముగా పుట్టిన వాడుగా, బ్రహ్మ ప్రసిద్ధుడు. వాని కొకక రక్షకుడుగా త్రిభువన గురువుగా విష్ణువు ప్రసిద్ధుడు. ప్రలయకాలమున వారిరువుర సంహరించి తన సాటిలేని మహిమను చాటిన ఆ మహా కాలమూర్తి యైన శివున కన్యు డెవడు సదృశుడగును?

వివరణము:- ఉపనిషత్తు ఈ లోకముల నన్నిటిని సృజించు పాలించు సంహరించు నొకే బ్రహ్మను చెప్పినది.అట్లు చేయుట చేతనే ఆతనికి బ్రహ్మత్వము ప్రసిద్ధము. ఈ జగత్ సృష్టి స్థితి సంహారములే బ్రహ్మకు లక్షణములు (ఉపలక్షణములు), తటస్థ లక్షణము, సృష్ట్యాదికృత్యమని అందుచేతనే వేదాంత శాస్త్రజ్ఞుల చేత చెప్పబడినది. కాని పురాణములు సకల జగముల సృష్టించు వాడొకడే స్వయమ్భు వాతని పేరు. ఆతడు చతుర్ముఖుడు. ఆతడు సృష్ట్యాదిలో విష్ణువు నాభి కమలమున జనించిన వాడు అని వైష్ణవ పురాణములు, శివునిచే తన దక్షిణాంగమున సృజింపబడినాడని శైవ పురాణములు చెప్పుచున్నవి. అయినను వాని తాత్పర్యము వారిరువురు కార్యబ్రహ్మలని మాత్రమే. వారు హిరణ్యగర్భ వైశ్వానర నాములు అని ఉపనిషత్తత్త్వవేత్తలు చెప్పిరి. ఆ విషయము శైవ పురాణములలో బ్రహ్మ విష్ణువులు శివునిచే పుట్టింపబడిరని, ప్రలయకాలమున ఆ శివుని చేతనే సంహరింపబడుదురను రీతిలో చెప్పబడినది. విష్ణువు హిరణ్యా గర్భుడని బ్రహ్మ వైశ్వానరుడని ఆ శైవ పురాణముల తాత్పర్యము. ఈ శ్లోకమున సర్వలోకసృష్టి కర్తగా ప్రసిద్ధుడైన బ్రహ్మ స్వయమ్భువుగా, సర్వలోక రక్షకుడుగా ప్రసిద్ధుడైన విష్ణువు వాసుదేవుడుగా పేర్కొనబడి, వారిరువురను ప్రలయకాలమున శివుడు సంహరించునట్లు చెప్పబడుటచే వారిని సృజించి, పాలించు వాడు కూడ శివుడని స్పష్టమగు చున్నది. వైష్ణవ పురాణములలో బ్రహ్మ హిరణ్యగర్భుడుగా రుద్రుడు వైశ్వానరుడుగా కించిద్భేదమున పేర్కొనబడినారు. మొత్తము మీద సృజించు బ్రహ్మను, పాలించు విష్ణువు, సంహరించు రుద్రుని సృజించి, రక్షించి, సంహరించు బ్రహ్మ మొకటే. సర్వలోకములను, వానిని సృజించి, పాలించు, సంహరించు వారితో పాటు సృజించి, రక్షించి, సంహరించుననియే. శైవ వైష్ణవ పురాణముల యొక్క ఉపనిషత్తుల యొక్కయు ప్రక్రియలలో భేదము

స్థూలముగా కనబడునట్టిదే. కాని తాత్పర్యములో భేద మేమాత్రము లేదని గమనింప వలెను. ఉపనిషత్తులలో హిరణ్య గర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్ సదాధార పృథివీంద్యాముతే. మామ్ సృష్ట్యాదిలో హిరణ్య గర్భుడుండెను. ఆతడు సమస్త భూతముల సృజించుటకు జన్మించి యుండెను. ఆతడు పృథివ్యాకాశముల ధరించెను అని చెప్పబడినది. మరొక చోట ఆ హిరణ్య గర్భుడు ప్రథమజుడని చెప్పబడినది. ఆ అర్థమే ఈ శ్లోకమున స్వయమ్భూ శబ్దముచే చెప్పబడినది. కాని ప్రథమజ శబ్దమున మొదట పుట్టిన వాడని స్వయమ్భూశబ్దము తనకు తానుగా పుట్టిన వాడని భిన్నార్థముల బోధించు చున్నవి. మొదట పుట్టిన స్వయమ్భూ నామక బ్రహ్మ పేరునకే స్వయమ్భువని, వాస్తవముగా ఆతడు శివునిచే సృజింపబడి, కాపాడబడి, సంహరింపబడునని పురాణ తాత్పర్యానుసారముగా నీ శ్లోకమున చెప్పబడినది. అట్లే వాసుదేవుడు సర్వ లోకముల వసింపజేయు దేవుడు అను అర్థము గల వాసుదేవ శబ్దము పేరునకు మాత్రమే విష్ణువు నందు వర్తించునని, వాస్తవమున విష్ణువు శివునిచే సృజింపబడి, పాలింపబడి, సంహరింపబడువాడే అని పురాణ తాత్పర్యానుసారముగా చెప్ప బడినది. ఈ అంశము ప్రసిద్ధః అను శబ్దము సృష్టృత్వ పాలకత్వ ప్రసిద్ధి మాత్రమే చతుర్ముఖ కమాలానాధులందున్నది అని అది వాస్తవము కాదని వ్యంజింపజేయు చున్నది. శ్లోకములోని "ఆదిభూతః" అను శబ్దము ఉపనిషత్తులోని ప్రథమజ శబ్దార్థమునే బోధించు చున్నది. అట్లే ఏకశబ్దము సర్వలోకముల నవలీలగా నొక్కడైన చతుర్ముఖుడే సృజించు వాడను అర్థమును వ్యంజించు చున్నది. 'త్రిభువన గురు' శబ్దము స్థూలముగా త్రిభువన పితృత్వమును బోధించును. కాని వానిని సృజించు బ్రహ్మకు పితృత్వము చెల్లుట న్యాయము కావున బ్రహ్మను తన నాభి కమలమున సృజించిన విష్ణువు నందు పితామహత్వమునే గురుశబ్దము బోధించు ననవలెను. బ్రహ్మ విష్ణువు లిరువురు శివుని దక్షిణ వామాంగముల నుండి సృజింపబడినారని శైవ పురాణానుసారము విష్ణువునందలి త్రిభువన పాలకత్వమును బోధించునని యొప్పుకొనవలసి యున్నది. రుద్రునందు సంహారకత్వము పురాణ ప్రసిద్ధము. ఆతడు బ్రహ్మఫాలము నుండి జనించుటచే ఆతనికిని త్రిభువన పితృత్వము బ్రహ్మకు పితామహత్వము ప్రసిద్ధమగుటే సిద్ధమగు చున్నది. బ్రహ్మ విష్ణువుల పితృ పితా మహత్త్వముగాని విష్ణురుద్రుల పితామహ పితృత్వములుగాని వాస్తవముగా వారిలో అంతర్యామియై యున్న

పరమ శివునకు చెందుననుటలో ప్రతిపత్తి యుండ నక్కఱలేదు. అట్లే బ్రహ్మ విష్ణువుల సృష్టృత్వ పాలకత్వములు కూడ పరమ శివునకే చెందుననుట సమంజసము. అయినను ఈ శ్లోకమున ప్రసిద్ధి ననుసరించి బ్రహ్మ విష్ణువుల కవి చెప్పబడినవి. అట్లే తమోగుణి రుద్రుని సంహారకత్వము పరమశివునకు చెప్పబడినది. త్రిగుణేంద్రియాదుల కర్తృత్వ మాత్మయం దారోపింపబడినట్లే ఆత్మరూప శివునందు బ్రహ్మ విష్ణు సంహారకత్వము ఆరోపించి ఈ శ్లోకమున చెప్పబడినదని గమనింపవలెను. నిర్గుణ పరమ శివునందు సర్వాధికత్వమును బోధించు అతుల మహిమత్వము కూడ ఆయన సగుణత్వారోపణమును పురస్కరించు చున్నది. పరమశివుడు సగుణుడు. అనగా సత్త్వరజస్తమో గుణములు కలవాడు. ఆయన మాత్రమే సర్వజగత్సృష్టిస్థితి సంహారముల నొనర్చును. బ్రహ్మ విష్ణువుల సర్వజగత్ సృష్టృత్వత్రాతృత్వకము లీశ్వరాను గ్రహమున వారి యందు తన శక్తుల సంక్రమింపజేయుటచే నేర్పడినవి. ఉజ్జయినీ నగరమున శివునకు మహాకాల నామము ప్రసిద్ధము. కాలమూర్తులైన సూర్య యమాదుల కంటె గొప్పవాడని చెప్పుట కాలమూర్తి శబ్దమునకు మహాశబ్దము చేర్చుటకు ప్రయోజనము.

అవతారిక:- పై శ్లోకమున శివుని మహిమ అతుల మని శివుడసదృశుడని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆయన మహిమ నిరవధియని చెప్పబడు చున్నది.

శ్లో॥ వక్తుం వాఞ్ఛా హర నిరవధి త్వన్మహిమ్నః స్వరూపం
చేత శ్చైత త్కతిపయ పదజ్ఞాన మాత్రావసన్నమ్।
జ్ఞాత్వైవేదం త్రినయన మయా త్వద్గుణ స్తోత్రభక్త్యా
స్వాత్మన్యేవ స్వయ మధికృతో ధృష్టతా పట్టబన్ధః॥ 5

ప్రతిపదార్థము:- హర=ఓ హరుడా!, నిరవధి=అంతములేని, త్వన్మహిమ్నః= నీ మహిమ యొక్క, స్వరూపమ్=స్వరూపమును, వక్తుమ్=చెప్పుటకు, వాంఛా= కోరిక (అస్తి=ఉన్నది), ఏతత్=ఈ, చేతః=మనసును, కతిపయ పదజ్ఞాన మాత్రావసన్నమ్=కొన్ని పదముల జ్ఞానమాత్రమున పరిసమాప్తమైనది, త్రినయన= ఓ ముక్కంటీ, ఇదమ్=దీనిని, జ్ఞాత్వాఏవ=తెలిసికొనియే, త్వద్గుణస్తోత్ర భక్త్యా=నీ గుణముల స్తుతించుట యందలి భక్తితో, మయా=నా చేత, స్వయమ్=

స్వయముగా, స్వాత్మని ఏవ=స్వాత్మయందే, ధృష్టతా పట్టబన్ధః=ధృష్టతను తలకు పట్టుగుడ్డవలె కట్టుకొనుట, అధికృతః=అధికరింప బడినది.

తాత్పర్యము:- హరుని మహిమ అవధి లేనిది. స్తోత్రకర్త యొక్క చిత్తమున కొన్ని పదముల జ్ఞానము మాత్రమే కలదు. ఇది తెలిసియు శివగుణస్తోత్రము చేయవలయునను ఆసక్తి చేత తనకు తానే ధృష్టతను (స్తోత్రకర్తృతను) తలకు చుట్టుకొన్నాడు.

వివరణము:- అంతులేని శివుని మహిమను మాటలలో చెప్పవలెనని కవి కున్నది. కాని ఆతడు తన కున్నది కొన్ని పదముల జ్ఞానము మాత్రమే అని ఎఱుగును. ఈ పరిమితములైన కొన్ని పదముల జ్ఞానము చేత అంతులేని శివ మహిమను చెప్పుటెట్లను సంకోచ మాతని మనస్సున నున్నది. గొప్పపని నేదో విధముగా సాధించగలనను బుద్ధి అల్పున కుండుట ధృష్టత అనబడును. ఇట్లు ధృష్టతకలవారు లోకమున పెక్కురుండ వచ్చును. వారిలో తనంతటి ధృష్టత లేదని పట్టబన్ధ శబ్దముతో కవి వ్యంజింపజేయు చున్నాడు. రాజ్యాభిషేక సమయమున రాజులు శిరసున పట్టుగుడ్డ కట్టుకొనుట పట్టబన్ధ మనబడును. ఈ కవికి అట్టి ధృష్టుల రాజ్యమునకు అధికారిగా వచ్చునప్పుడు పట్టుగుడ్డను వలె దానిని తలకు చుట్టుకొన్నట్లు చెప్పుట తనంతటి ధృష్టత మరెవరికిని లేదని ప్రకటించుటయే. శైవాగమముల ననుసరించి సృష్టిస్థితులను బ్రహ్మ విష్ణువులు చేయరు. శివుడే భవనామమున రజోగుణము నాశ్రయించి లోకముల సృజించును. మృడ నామమున సత్త్వగుణము నాశ్రయించి వానిని కాపాడును. ఆతడే హరనామమున తమోగుణము నాశ్రయించి వానిని సంహరించును. హరుడనగా లోకసంహారకుడని అర్థము. పాపకష్టసంకటాదుల హరించు వాడనుటచేత హర నామ మాతనికి చెల్లును. త్రినయనములోని శివుని ఫాల నేత్ర మీ లోకసంహార కృత్యమునకు సాయబడదగినదిగా నున్నది. ఈ శ్లోకము లోని రెండు హర, త్రినయన సంబోధనములు జగత్సంహార సూచకములగుటచే ఎవరికైనను భయమును కలిగింపక మానవు. కాని భయ నివారణము కొఱకు మనమేమి చేయవలెను? ఆ రెండు నామముల గట్టిగా స్మరించి, కీర్తించు చుండవలెను. గత్యంతర మేమున్నది. అందుచేతనే స్వయముగా తన అశక్తత నెఱిగియు ఇట్టి నామముల స్మరించి కీర్తించుట ద్వారమున తనను సంహరించుట

మానుకొనునా! శివుడు. ఏమో? ఏమైనను చావు తప్పుకున్నను మరల నింకొక మారు చచ్చు దురదృష్టము పట్టకుండ వలెననియే తానీ ధార్ష్ట్యమునకు పూను కొన్నానని కవి చెప్పుకొను చున్నాడు.

అవతారిక:- పై శ్లోకమున శివగుణ స్తోత్రభక్తిలో తన శక్తి శివస్తోత్ర రచన కే మాత్రము సరిపోలేదని తెలిసియు ధార్ష్ట్యముతో దానికి పూనుకొన్నట్లు చెప్ప బడినది. ఈ శ్లోకమున శివున కానందము కలిగించలే దీ స్తోత్రరచనమని తెలిసియు భక్త్యావేశముననే తన ముఖము నుండి వెడలి వచ్చు వాక్కుగాన ఆపలేకున్నానని కవి చెప్పుచున్నాడు.

శ్లో॥ వాగీశ స్త్వం యుగపదఖిల జ్ఞానసమ్పత్తి యుక్తః
కా తే తుష్టిః స్తుతి రచనయా మాదృశస్యాల్పబుద్ధేః।
ఏవం జ్ఞాత్వా హర విరమతి స్తోత్రహేతౌ హఠా న్మే
భక్త్యావేశా త్ప్రసరతి ముఖా ద్భారతీ కిం కరోమి॥ 6

ప్రతిపదార్థము:- హర=ఓ జీవుడా!, త్వమ్=నీవు, వాగీశః=వాగీశ్వరుడవు, యుగ పదఖిలజ్ఞాన సమ్పత్తి యుక్తః=ఒకే సారి సర్వజ్ఞాన సంపదతో కూడియున్న వాడవు, మాదృశస్య=నావంటి, అల్పబుద్ధేః=అల్పబుద్ధి గలవాని యొక్క, స్తుతిరచనయా= స్తోత్రరచనతో, తే=నీకు, కా=ఎట్టి, తుష్టిః=తృప్తి, ఏవమ్=ఇట్లు, జ్ఞాత్వా=తెలిసి, స్తోత్రహేతౌ=స్తోత్రహేతువు (స్తోత్రయత్నము), విరమతి=ఆగిపోగా, హఠాత్= హఠాత్తుగా, భక్త్యా వేశాత్=భక్త్యావేశము వలన, మే=నా, ముఖాత్=ముఖమునుండి, భారతీ=వాక్కు, ప్రసరతి=ప్రసరించు చున్నది, కిమ్=ఏమి, కరోమి=చేయుదును.

తాత్పర్యము:- ఓ హర, ఒకే సారి సర్వవిషయముల నెఱుగు జ్ఞాన సంపత్తికల వాగీశ్వరుడవైన నీకు నావంటి అల్పబుద్ధి యొక్క స్తుతి తృప్తి కలుగదని యెఱిగి, నిన్ను స్తుతించు నా యత్నము ఆగి పోవుచుండగా హఠాత్తుగా భక్త్యావేశము వలన నా ముఖము నుండి వాక్కు ప్రసరించు చున్నది. ఏమి చేయుదును?

వివరణము:- శివుడు సర్వజ్ఞుడు. ఒకే సారి అన్ని విషయముల నెఱుగగల జ్ఞానశక్తి సమ్పన్నుడు. తన జ్ఞానము నంతను ప్రకటింపవలెనను ఇచ్ఛ కలిగిన వెంటనే తదనుగుణముగా ఆయన నుండి వాక్కులు వెలికి వచ్చు చుండును. అట్లు వచ్చినవే వేదములు, ఆగమములు, తంత్రనులు ఇత్యాదులు. అందు

వలననే బ్రహ్మాదులకు వాగీశ నామమున్నను వారినా పేర పిలచుట యుక్తము కాదు. ఆ నామము శివునకు మాత్రమే సర్వాధిక వాక్ప్రసరణ శక్తి యున్నందున చెల్లును. ఇతరులను వాగీశులనుట యత్కించి ద్వాక్ప్రసరణ శక్తి కలిగి యున్నందున లోకమున నున్నది. కాని వారి వాగీశత ఔపచారికము మాత్రమే. వాస్తవమున వారి యత్కించి ద్వాక్ప్రసరణ శక్తి కూడ నీ అనుగ్రహ జనితమైనదే. ఐనందున వారికి వాగీశత్వము చెల్లనే చెల్లదు. బ్రహ్మాదుల బుద్ధి కూడ శివుని కున్న సర్వజ్ఞాన శక్తి దృష్టిలో అల్పమైనదే. ఇక ఈ రచయిత తనకు అల్పబుద్ధి ననుకొనుటలో చెప్పుకొనుటలో తప్పేమున్నది. తనకున్న అల్పబుద్ధితో పాటు అల్పవాక్ప్రసరణ శక్తిని ఎఱిగిన రచయిత స్తుతించు యత్నము నుండి విరమించు కొన్నను హఠాత్తుగా ఆవేశించిన భక్తి వలన అప్రయత్నముగానే ఆయన ముఖము నుండి వాక్కు పొంగి వచ్చు చున్నది. తన యిచ్చా ప్రయత్నముల నుండి జనించిన చో వాక్కు నాపగల్గుట సాధ్యమగును. కాని తనలోని సరస్వతియే భక్త్యావేశముతో బయటకు పొంగి వచ్చు చుండగా తానేమి చేయగలడు. స్తుతించగలడు, మౌనము గా నుండలేడు. శివుడు నిజముగా వాగీశ్వరుడు. బ్రహ్మాదులు గొప్ప శివభక్తులు. కావున వారికి శివుడు తనను తృప్తిపఱచగల వాక్కుల వారి కనుగ్రహించి యుండ వచ్చును. లేదా వారి వాక్కు కూడ తృప్తి పఱచ లేక పోవచ్చును. అట్టితఱి అల్ప భక్తి అల్పబుద్ధిగల తన నుండి వాక్కు వెడలుట వింతయైనను శివుని తృప్తి పఱచలేదని తెలిసియు ఏమి చేయలేని తన పరిస్థితిని కవి వ్యక్తీకరించినాడు.

అవతారిక:- పై శ్లోకమున తన ప్రయత్న వాక్ప్రసారము శివుని స్తుత్యతను (వాక్కుచే చెప్పబడదగి యుండుటను) పురస్కరించుకొని చెప్పబడినది. ఈ శ్లోకమున వాఙ్మనస్సులు శివుని యందు ప్రసరించనే లేవు అని చెప్పబడు చున్నది.

శ్లో॥ యత్తే తత్త్వం నిరవధి పదం వాఙ్మనః పారభూతమ్
బ్రహ్మాదీనామపి హర గిరస్తత్ర భగ్నాః ప్రవేష్టుమ్।
అర్వాచీనం య దపరమిదమ్ పార్వతీవల్లభం తే
రూపమ్ భక్త్యా వరద తదహం వాగ్భి రభ్యర్చయామి॥ 7

ప్రతిపదార్థము:- హర= ఓ హరుడా!, నిరవధి పదమ్= అంతులేని స్థానమైన, తే=నీ యొక్క, యత్=ఏ, తత్త్వమ్=తత్త్వము, వాఙ్మనః పారభూతమ్= వాఙ్మనస్సుల అవతలి యొడ్డైనదో, తత్ర= దానియందు, బ్రహ్మాదీనామ్=

బ్రహ్మాదుల యొక్క, గిరఃఅపి= వాక్కులు కూడ, ప్రవేష్టుమ్= ప్రవేశించుటకు (యత్నించి), భగ్నాః=భగ్నములు (ఐనవి), అపరమ్=మరొక, ఇదమ్=ఈ, పార్వతీ వల్లభమ్=పార్వతీ దేవికి ప్రియమైన, అర్వాచీనమ్=నూతనమైన, రూపమ్= రూపము (కలదో), తత్=దానిని, వరద=ఓ వరముల నొసగువాడా!, అహమ్= నేను, వాగ్భిః=వాక్కులతో, అభ్యర్చయామి=బాగుగా అర్చించెదను.

తాత్పర్యము:- ఓ శివుడా! నీ తత్త్వము అంతులేని స్థానమైనది. దానిలో ప్రవేశించుటకు యత్నించి బ్రహ్మాదులే భగ్నులైనారు. అది వాఙ్మనస్సుల కవతలి యొడ్డైనది గదా. కాని నీ నూతనమైన పార్వతీ వల్లభమైన రూపమును మాత్రము బాగుగా అర్చించెదను.

వివరణము:- శివుని తత్త్వము పరమ పదమని చెప్పబడదగినది. అది శాశ్వతమైనది. అది వాఙ్మనస్సుల కందనిది. సముద్రమున కావలి ఒడ్డు మనకు కనబడనట్లే బ్రహ్మాదుల వాఙ్మనస్సులకును అది అందనట్టిది. వాఙ్మనస్సులు ఓడల వంటివి. అవి ఎట్టి పరిస్థితిలోనను ఆవలిఒడ్డును దాటలేవు. అంతకంటె అసాధ్యమైన శివతత్త్వమును బ్రహ్మాదుల వాఙ్మనస్సులును చేఱలేవు. ఓడలు ఒడ్డెక్కలేవు. కాని చేరగలవు. కాని బ్రహ్మాదుల వాఙ్మనస్సులను ఓడలు ఆవలి ఒడ్డున ఆ శివతత్త్వమును చేరనే లేవు. పారశబ్దము ఒడ్డు అను అర్థము కలిగి యున్నందున పై వివరణము చేయబడినది. కాని ఇక్కడ పారశబ్దము చేరలేనిది అను నర్థమునే బోధించును. సముద్రము ఆవలి ఒడ్డు ఒకప్పుడు చేరరానిదిగాన ఉండుటచే ఇప్పటికి సులభముగా చేరరానిదే అగుటచే చేరరానిది అని చెప్పుట సమంజసమే. పార్వతీ వల్లభ రూపము అర్వాచీనమని చెప్పుటచే నిరాకారమైన శివతత్త్వము ప్రాచీనమని చెప్పినట్లైనది. శివునకు గుణరూపములు లెని మాట వాస్తవము. అనగా పారమార్థిక సత్యము. యథార్థమైన తత్త్వము. దానికి అంతము లేదు (ఆదియును లేదు). ఆయన గుణరూపములు మాయామయములు. మాయలో ఆయన ప్రతిబింబించుటచే ఆయనకు మొదట సగుణత్వ మేర్పడినది. ఈ సగుణత్వము శివుని యొక్క ప్రాచీన రూపము. భార్యాబిడ్డలతో సంసరించు జీవులు అసంసారియైన శివుని గ్రహింపజాలరని వారిచే మనో వాక్కుల ద్వారమున సేవింపదగిన పెక్కు రూపముల నాతడు ధరించినాడు. జీవుల వలె ఆయనయు భార్యను, బిడ్డలను ఏర్పరచు కొన్నాడు. భార్యకాతడు వల్లభుడైనాడు. ఆ భార్యపేరు పార్వతి. ఆమెకు నచ్చిన రూపము నాతడు ధరించినాడు. కావున ఆ రూపము

పార్వతీ వల్లభమని శ్లోకమున పేర్కొనబడినది. ఈ రూపమును కన్నుల ద్వారా మనస్సు చేరుకొనును. లేదా కన్నుల ద్వారా రూపమే మనస్సును చేరుకొనును. దాని అందమును కొంత వఱకు వాక్కులతో చెప్ప వచ్చును. మనస్సుతో స్మరింప వచ్చును. వాక్కులతో స్తుతింప వచ్చును. మనస్సులో నిల్పుకొని ఆనందింప వచ్చును. ఇది వాఙ్మనస్సులకు పారము అనగా చేరరానిది కాదు. చేరదగినదే. అంతే కాదు ఆ రూపము గల శరీరమును లేక శరీరములోని భాగములను పూవులు మొదలగు నుపచారములచే నర్చింపవచ్చును. నేర్పరులైన వారు బాగుగా నర్చించ వచ్చును. అందుచేతనే ఆ అర్వాచీనరూపమును అభ్యర్చయామి అని కవి చెప్పినాడు. అభి అనగా అన్నివైపుల నుండి అన్ని భాగములను అంతట, పూజించెదనని ఆ క్రియా పదము యొక్క అర్థము. ఈ శ్లోకమున అర్వాచీన రూపమని చెప్పబడినదే పుష్పదంతుని చేత శివమహిమ్నః స్తోత్ర ద్వితీయ శ్లోకమున అర్వాచీన పదమని పేర్కొనబడినది. ఆతడు ప్రయోగించిన 'పద' మను పదము బ్రహ్మాదులచే తను వాఙ్మనస్సులతో పొందరాని తత్త్వమునకు విశేషణముగా ప్రయోగింపబడినది. వారి వాక్కు ప్రయత్నించియు విఫలమైనది అను అర్థమున ఈ శ్లోకమున 'భగ్నాః' అను పదము ప్రయోగింపబడగా పుష్పదంతునిచే ప్రథమ శ్లోకమున అవసన్నాః అను పదము ప్రయోగించబడినది. ఆతడు ప్రయోగించిన వరద అను సమ్బోధనమునే ఈ కవియు ప్రయోగించి నాడు. పెక్కుచోట్ల పుష్పదంతునీ కవి అనుకరించినాడు. ఆతడు శిఖరిణీ వృత్తములతో స్తోత్రమును రచింపగా ఈతడు మన్దాక్రాంతావృత్తమున నీ స్తోత్రమును రచించినాడు.

అవతారిక:- పై శ్లోకమున శివుని స్తుత్యత సమర్థింపబడినది. ఈ శ్లోకమున తనవంటి అల్పవాఙ్మనశ్శక్తి గల వానిచేతను శివుడు స్తుతింపదగిన వాడని చెప్పబడు చున్నది.

శ్లో॥ అన్యైః స్తోత్రం రచిత మమృతస్యన్దిభి ర్వాగ్విలాసైః
ఫల్గుప్రాయైః కిమిదమియతా త్యజ్యతే మద్వచోభిః।
కిం వా కైశ్చి త్కనక కమలై రర్చితమ్ పాదపీఠమ్
భక్త్యా శమ్భో న పునరపరః పూజయ త్యర్కపుష్పైః॥ 8

ప్రతిపదార్థము:- అమృతస్యన్దిభిః=అమృతమును చిందు, వాగ్విలాసైః= వాగ్విన్యాసములతో, అన్యైః=అన్యులచేత, స్తోత్రమ్= స్తోత్రము, రచితమ్=

రచింపబడినది, ఫల్గుప్రాయైః=దాదాపు నిస్సారములైన, మద్వచోభిః= నా వాక్కుల చేత, ఇయతా=ఇంత మాత్రము (ఆలోచనము)తో, త్యజ్యతే కిమ్=విడువ బడునా, కైఃచిత్=కొందఱ చేత, కనక కమలైః=కనక కమలములతో, అర్చితమ్ =అర్చింపబడిన, పాదపీఠమ్=పాదపీఠమును, అపరః=మరొకడు, పునః=మరల, అర్కపుష్పైః=జిల్లేడు పూలతో, న పూజయతి కిం వా?=పూజించడా?

తాత్పర్యము:- అమృతమును జిందు వాగ్విలాసములతో నితరులు స్తుతించి నారన్న కారణమున నిస్సారములైనను నా వాక్కులు నిన్ను స్తుతింపక మానునా? కొందఱు బంగారు కమలములతో పూజించిన పాదపీఠమును ఇతరుడు జిల్లేడు పూలతో పూజింపడా?

వివరణము:-అమృతము జిందు వాగ్విలాసములు కలవారు కాళిదాసాది మహా కవులు, వ్యాసవాల్మీక్యాద్యార్ష మహాకవులు. దివ్యలోకవాసులైన బ్రహ్మేంద్రాదులు, వాక్కులమృతము జిందుననగా అమృతము నాలుకపై బడిన ఎంత ఆనందము కలుగునో వాక్కులు చెవులకు సోకిన అంత ఆనందము కలుగును అని అర్థము. అమృతము త్రావిన దేవతల వాక్కులు కూడ అమృతమును చిందవు కాని అవి చెవి కింపుగా నుండును. మరల మరల వినవలె ననిపించును. అట్లనిపించుట వాక్కులతో అమృతము చిందుటగా చెప్పబడును. అట్టి అమృతము జిందు వాక్కులతో శివుని బ్రహ్మాదులు వ్యాస వాల్మీక్యాది మహర్షులు కాళిదాసాదులును శివుని స్తుతించినారనుట యథార్థమే. కాని వారు స్తుతించినందున వారి వలె అటువంటి అమృతస్యన్ది వాక్కులు లేని నేను స్తుతింప కూడ దనుట ఉచితము కాదు. నా వాక్కులు నిస్సారములు కావచ్చును. ఒక్కొక్కపుడు నిస్సారములైన బిడ్డల వాక్కులు తల్లిదండ్రుల కానందము కలిగించుట కలదు గదా! అట్లే నా వాక్కులు స్తుతించ బూను కొన్నవి. నీకు (శివునకు) ఆనందము కలిగించగలవా లేదా అన్నది వేఱు విషయము, అను కవి అభిప్రాయము శ్లోక ప్రథమార్ధమున వ్యక్తమగు చున్నది. ఉత్తరార్ధమున ఆ అభిప్రాయమును సమర్థించు అర్థాంతరము వ్యంజిపబడినందున ఈ శ్లోకమున అర్థాంతర న్యాసాలంకార మేర్పడి యున్నది. శివుని పాదపీఠమున ధనవంతులు, కుబేరాదులు బంగారు కమలములతో పూజించినారు గదా అని ఇతరు లర్క పుష్పములతో (తనకు లభించిన వానితో) పూజింపక మానునా? శివుడు సంతోషింపక మానునా? పైగా భక్తుడైన పేదవాని

జిల్లేడు పూలతోనే అతడదికముగా సంతోషించును. అతనికి కావలసినది భక్తికాని, భక్తుడిచ్చు కనక(పుష్ప)ము కాదు. అతని చేతనే బంగరుకొండ విల్లుగా నున్నది. ఎంత ధనము కలవాడైనను బంగారు కొండ కన్న అధికమైన కనకము నొసగునా? అదికాక శివుడేమి భిక్షుకుడా! భిక్షుకుడని అంగీకరించినను ఆతడు పేద మాత్రము కాదు. యోగియై కనకాది భోగ పదార్థముల వర్జించి యోగుల కాదర్శముగా నున్నవాడు. భక్తిని భిక్షించిన భిక్షించుగాక. అష్టైశ్వర్యముల ననుగ్రహించ గల ఆతనికి నీ కనకమం దిష్ట ముండునా? ఇది ఉత్తరార్ధమున వ్యంగ్యమగు భావము.

అవతారిక:- పై శ్లోకమున శివు డల్పుల చేతను స్తుత్యుడని అల్పోపచారముల తోడను పూజ్యుడని చెప్పబడినది. ఈ శ్లోకమున దృశ్యములైన శివుని అష్టమూర్తులకు కవి నమస్కరించుట చెప్పబడు చున్నది.

శ్లో॥ పథ్యాహారౌ హర జలముచాం యౌ చ యౌ పఙ్కజానామ్
మిత్రామిత్రౌ వరద హవిషాం దాహక గ్రాహకౌ యౌ।
యౌ గన్ధస్య ప్రజన వహనౌ తానహం ద్వౌ స్థ హేతో
రష్టౌ వన్దే త్రిభువన తనో ర్మూర్తి భేదాం స్త్వైతాన్॥ 9

ప్రతిపదార్థము:- హర=ఓ శివుడా!, వరద=వరముల నొసగువాడా!, యౌ=ఏవి, జలముచామ్=మేఘముల యొక్క, పథ్యాహారౌ=మార్గాహారములో, యౌ=ఏవి, పంకజానామ్=కమలముల యొక్క, మిత్రామిత్రౌ=సఖివైరులో, హవిషామ్ =హవిస్సుల యొక్క, దాహక గ్రాహకౌ=దాహక గ్రాహకులో, చ=మరియు, యౌ= ఏవి, గన్ధస్య=గన్ధము యొక్క, ప్రజనవహనౌ=స్రష్టవాహకులో, త్రిభువన తనో:= ముజ్జగము శరీరముగా గల, తవ=నీ యొక్క, ఏతాన్=ఈ, అష్టౌ=ఎనిమిది, మూర్తిభేదాన్=మూర్తి విశేషములను గూర్చి, వందే=నమస్కరించు చున్నాను.

తాత్పర్యము:- మేఘముల మార్గాహారములైన, కమలముల మిత్రశత్రువులైన, హవిస్సుల దాహక గ్రాహకములైన, గన్ధము యొక్క స్రష్టవాహకములైన ముజ్జగములు శరీరముగా గల నీ యొక్క ఈ ఎనిమిది మూర్తులకు నమస్కరించు చున్నాను.

వివరణము:- మేఘముల మార్గాహారములనగా ఆకాశజలములు, మేఘములు.

ఆకాశపు దారిలో నడచునవి. కావున వాని కాకాశము మార్గము. కావున మేఘ మార్గమనగా ఆకాశము. సముద్రాది జలాశయములలోని జలము ఆవిరికాగా దాని నాహరించి మేఘములు మరల లోకములకు వర్షము నొసగును. మేఘము లకు జలమాహారమని లోకులు భావించెదరు. ఆహరించనిచో జలముల నెట్లవి విసర్జించగలవు. ఆహరించని జనులు విసర్జించుట లేదు గదా. మేఘముల ఆహారములు జలమని లోక ప్రసిద్ధి ననుసరించి ఈ శ్లోకమున చెప్పబడినది. పంకజ మిత్రామిత్రములనగా సూర్యచంద్రులు. సూర్యు డుదయించిన కమలములు వికసించును. కావున కమలములకు సూర్యుడు మిత్రుడు. కమలముల వికసింపజేయువాడు కావున సూర్యుడు వానికి మిత్రుడు. మిత్రులలో నొకరి ఉదయము మరొకరికి వికాసమును, ఒకరి వికాసము మరొకరి సంతోషము నకు హేతువు లగును. సంతోషము వలన వికాసము కలుగును. సంతోషింప జేయువాడు మిత్రుడు. దుఃఖింపజేయువాడు, ముకుళింపజేయువాడు అమిత్రుడు. చంద్రుని చూచి ముడుచుకొని పోవు కమలము లాతని కమిత్రములు. తమను ముకుళింపజేయు కమలముల కాచంద్రుడు శత్రువు కావున ఈశ్లోకమున సూర్యచంద్రులు కమల మిత్రామిత్రములుగా చెప్పబడినారు. హవిస్సు యొక్క దాహక గ్రాహకములనగా అగ్ని యజమానులు. హవిస్సు నగ్ని దహించును. కావున ఆయన హవిర్దాహకుడనుటలో సంశయము లేదు. గ్రాహకు డనగా గ్రహించునట్లు చేయువాడు. యజమానుడు యజమాన శబ్దము నేడు అధిపతి అను అర్థమున ప్రయోగింపబడుచున్నను అగ్నిలో హోమము చేయు చున్నవాడు యజ్ఞము చేయుచున్నవాడు అనియే యజమాన శబ్దము యొక్క వ్యుత్పత్త్యర్థము. యజ్ఞము చేయువాడే ఫలమును పొందును. కావున యజమాన శబ్దమధిపతిని బోధించు చున్నది. అదికాక యజ్ఞమొకడు చేయదగిన కర్మ కాదు. కనీసము నలుగురైదుగురు కలసి చేయదగిన కర్మ. అధిపతిగా తాను యజ్ఞము చేయు చున్నప్పుడు తనకు సాయపడువారు కొందఱుందురు. వారాయధిపతి కొఱకు యజ్ఞము చేయుదురు. అట్టివారు ఋత్విక్కు లనబడుదురు. యజ్ఞాంతమున యజమానుడు వారికి దక్షిణ నొసగును. వారు తామాచరించిన కర్మఫలము యజమానుని చేరుగాక అని భావించియే కర్మ చేయుదురు. "యజమాన పంచమా ఇడామ్ భక్ష యన్తి" అను సూక్తి నలుగురు ఋత్విక్కులు, ఒక యజమానుడు చేయు ఇడా భక్షణమును చెప్పుచున్నది. కర్మ యొక్క

ఫలమును ఋత్విక్దక్షిణ ద్వారా పొందు అధిపతి యజమాన శబ్దార్థమని తేలినది. ఆతడే హవిస్సు నగ్ని గ్రహించునట్లు చేయువాడు. కావున ఆతడు గ్రాహక శబ్దముచే నీ శ్లోకమున చెప్పబడినాడు. అట్లే గంధము యొక్క ప్రజన వహనులుగా భూవాయువులు చెప్పబడినారు. గంధము భూగుణము కావున అది గ్రంధ ప్రజనము అనగా గంధోత్పత్తికి కారణము. వాయువునకు గంధవహ శబ్దము ప్రసిద్ధమే. పంచభూతములు పృథివి జలము తేజము (అగ్ని) వాయువు ఆకాశము. సూర్యచంద్రులు (బుద్ధి మనస్సులు) యజమానుడు (అహమర్థమైన ఆత్మ లేక అహంకారము). ఈ ఎనిమిది శివుని అష్టమూర్తులు. ఈ శ్లోకమున శివుని నమస్కరింపదగిన ప్రత్యక్ష మూర్తులు గలవాడు శివుడని, అన్యుడట్లు ప్రత్యక్ష నమస్కార్యుడు కాజాలడని దృష్ట హేతోః అను శబ్దము వ్యంజించును. త్రిభువనము లీ ఎనిమిదింటితో నిండినవే కావున త్రిభువనము శివునకు శరీరము అని త్రిభువనతను శబ్దము తెలుపుచున్నది. శరీరమున నీ యెనిమిది అవయవము లుగా (మూర్తి భేదములుగా) నున్నవి. అవయవి శివుని త్రిభువన తనువు. శివుని తనువునందువలె జీవుని తనువునందును ఈ అష్టమూర్తులే ఉన్నవి. కాని అవి శివుని సమష్ట్యవయవముల వ్యష్టులు. సమష్టి వ్యష్టుల కభేదమే. (కొందఱు అవయవ్యవయములకు సమవాయమే లేక తాదాత్మ్యమే చెప్పెదరు. అందుచేత శరీర విషయమునను జీవేశ్వరోభయైక్యము (అభేదపక్షమున) కలదు. శరీరాతిరిక్తమైన ఆత్మ ఇరువురి (జీవేశ్వరుల) యందొకటే అని అద్వైతులు ఘంటాపథముగా చెప్పుదురు. కావున ఒక వేళ నున్నచో శరీరభేదమే కాని వారి ఆత్మల కెట్టి భేదము లేదు. అట్టి అభేదము యొక్క జ్ఞానము కొఱకు కవిచే నీ శ్లోకమున శివుని అష్టమూర్తులకు వందనము చేయబడు చున్నది. ఈ శ్లోకమున అష్టమూర్తులు భంగ్యంతరముగా (అనగా స్వనామముతో కాక) చెప్పబడినందున పర్యాయోక్తాలంకార మేర్పడియున్నది.

అవతారిక:-పై శ్లోకమున అష్టమూర్తులు గల పరదేవతయైన శివుడే వంద్యుడని చెప్పబడినది. ఈ శ్లోకమున అన్యదేవతా భజన మొనర్చు వాని అధ్యన్యత చెప్పబడు చున్నది.

శ్లో॥ సంసారేఽస్మిన్ ధ్రువ మసులభ మ్మానుషం జన్మలబ్ధ్వా
యుష్మా నేకో భజతి సుకృతీ కశ్చిదన్యం చ దేవమ్।

ఆరూఢోஉపి స్మరహర గిరిం రోహణమ్ భాగ్యయోగా
దేకో రత్నం కలయతి మహత్ కాచ మన్యశ్చ ఫల్గు॥ 10

ప్రతిపదార్థము:- అస్మిన్=ఈ, సంసారే=సంసారమున, ధ్రువమ్= నిశ్చయముగా, అసులభమ్=సుఖముగా లభించని, మానుషమ్=మనుష్య సంబంధియైన, జన్మ=జన్మమును, లబ్ధ్వా=పొంది, కఃచిత్=ఎవడో, ఏకః=ఒక, సుకృతీ= పుణ్యాత్ముడు, యుష్మాన్=మిమ్ములను, భజతి=సేవించును, అన్యః=మరొకడు, అన్యమ్=మరొక, దేవమ్=దేవుని, భజతి=సేవించును, స్మరహర!=ఓ మన్మథ సంహారీ, రోహణమ్=రోహణమను పేరుగల, గిరిమ్=పర్వతమును, ఆరూఢఃఅపి= ఎక్కినవాడైనను, భాగ్యయోగాత్=అదృష్టయోగము వలన, ఏకః=ఒకడు, మహత్=గొప్ప, రత్నమ్=రత్నమును, కలయతి=ఏరుకొనును, అన్యః= మరొకడు, ఫల్గు=నిస్సారమైన, కాచమ్=గాజును, కలయతి=ఏరుకొనును.

తాత్పర్యము:- ఈ సంసారమున నిశ్చయముగా దుర్లభమైన మనుష్య జన్మము పొంది ఒకడు శివుని సేవించును. మరొకడు అన్యదేవుని సేవించును. రోహణగిరి నారోహించినను ఒకడు గొప్ప రత్నమును, మరొకడు నిస్సారమైన గాజును ఏరుకొనును.

వివరణము:- ఎంతో పుణ్యము పూర్వ మనుష్య జన్మలలో నొనరించిన వాడెన్నో పశుపక్ష్యాది జన్మల అనంతరము తిరిగి మనుష్య జన్మము నొందును. ఆ మనుష్య జన్మము అనాయాసమున లభించునది కాదు. ఎన్నో క్లేశము లోర్చుకొనినగాని పాపక్షయము పుణ్యాలాభము సంభవించవు. మనకు తెలియని ఏ పూర్వమనుష్య జన్మయందొనర్చిన పుణ్యము ఫలించినగాని, తిరిగి మనుష్య జన్మలభించదు. అదియు ఎన్నో పశుపక్ష్యాదిజన్మల అనంతరమే లభించును. అట్లు లభించిన మనుష్య జన్మమును పొందినవాడు మిక్కిలి వివేకముతో ప్రవర్తించినగాని ముక్తిని పొందజాలడు. పశుపక్ష్యాదుల వలె భోగము ననుభవించుటకే దాని నుపయోగ పఱచుకొనిన ముక్తిని పొందు నవకాశమును చేజార్చుకొన్న వాడగును. కావున వివేకముతో మహాదేవునే భజింప వలెను. అట్లు చేయువాడు వేలలో నొకడు మాత్రమే ఉండును. మిగిలిన వారందఱు నేదోయొక దేవుని ముక్తి నొసగ నసమర్థుడైన వానిని సేవించును. లేక భోగపరాయణుడై జన్మమును నిరర్థక మొనరించు కొనును. రోహణగిరి యనగా రత్నములు లభించు పర్వతము.

దాని నెక్కియు గాజు నేరుకొని ఒకడు తన ఆరోహణాయానమును వ్యర్థ మొనరించుకొనును. ఎవడో యొకడు మాత్రము మహారత్నము నేరుకొనును. ఈ శ్లోకమున పూర్వార్ధము ఉత్తారార్ధముచే సమర్థింపబడుటచే నర్థాంతర న్యాసాలంకార మేర్పడి యున్నది. మనుష్య జన్మ నెత్తుట రోహణగిరి నెక్కుట వలె ఆయాస సాధ్యమైనది. మహా దేవుని భజించుట రత్నము నేరుకొనుట వంటిది. అన్యదేవుని భజించుట గాజు నేరుకొనుటవంటిది అను ఔపమ్యస్ఫూర్తి యుండుట చే నీ శ్లోకమున నుపమాలంకార ధ్వని ఉన్నది. రత్నము వంటి మహాదేవుడుండగా గాజుల వంటి ఇతర దేవతల భజించువాడు మూర్ఖుడనుట ఈ శ్లోక సారాంశము.

అవతారిక:- పైశ్లోకమున శివుని భజించువాడు సుకృతియని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ శివు నేపేర బిలచినను తప్పు లేదని చెప్పబడు చున్నది.

శ్లో॥ యే త్వా మర్హన్ సుగత ఇతివా భక్తియోగా ద్భజన్తే
తేభ్య: శమ్భో ఫల మభిమతం త్వం దదాసీతి యుక్తమ్।
అధ్వక్లాన్తై: స్వరుచిరచితం నామ కించి ద్గృహీత్వా
శీతమ్ పీతం జలమిహ జనై: కిం న తృప్తిం కరోతి॥ 11

ప్రతిపదార్థము:- అర్హన్=అర్హన్ అనిగాని, సుగత ఇతివా=సుగతుడు అనిగాని, భక్తియోగాత్=భక్తి యోగము వలన, యే=ఎవరు, త్వామ్=నిన్ను, భజన్తే= సేవించెదరో, శమ్భో=ఓ శమ్భో, త్వమ్=నీవు, తేభ్య:=వారి కొఱకు, అభిమతమ్= కోరిన, ఫలమ్=ఫలమును, దదాసి=ఇచ్చెదవు, ఇతి=అనుట, యుక్తమ్= తగినదే, అధ్వక్లాన్తై:=మార్గక్లిన్నులచేత, స్వరుచి రచితమ్=తమ ఇచ్ఛతో పెట్టబడిన, కించిత్ =ఏదోయొక, నామ=పేరును, గృహీత్వా=గ్రహించి, జనై:= జనులచే, పీతమ్= త్రాగబడిన, శీతమ్=చల్లని, జలమ్=జలము, ఇహ= ఇచ్చట, తృప్తిమ్=తృప్తిని, న కరోతి కిమ్=చేయదా?

తాత్పర్యము:- కొందఱు శివుని అర్హన్ అనిగాని, సుగతుడనిగాని మిక్కిలి భక్తితో భజించెదరు. వారికా శివుడు వారు కోరిన ఫలము నొసగును. అట్లు చేయుట యుక్తమే. మార్గమున బోవువారు ఏదో తమకు తోచిన పేరు పెట్టి చల్లని జలమును త్రాగినచో అది వారికి తృప్తిని కలిగింపదా?

వివరణము:- జైన బౌద్ధులు అర్హన్ సుగత నామములతో శివుని భజించు

చున్నారు. ఆ విషయమును గమనింపని శైవులు వీరు శివనామము నుచ్చరించుట లేదని, వారు శివునే భజించుట లేదని, వారు నరకమునకు పోయెదరని జాలిపడు చుందురు. ఇది ఆ శైవుల యొక్క ఆభిజాత్య గర్వమే. అట్లు చేయుట వారికి తగని పని. మార్గములలో భిన్నభిన్నభాషలు మాట్లాడుచు జనులు నడచు చుందురు. వారు దప్పిక యైనప్పుడు తమతమ భాషలలోని శీత జలము యొక్క పేర్ల నుచ్చరించుచు ఆ చల్లని నీరు త్రావెదరు. అది వారికి తృప్తినే యొసగును గదా! అట్లే శివేతర నామమున శివుని భజించు వారికి గూడ శివుడు వారు కోరుకొన్న ఫలితముల నిచ్చుటలో వింతయే మున్నది. అన్ని నామము లాతనివే యని యెఱగక తాము పిలుచు పేరే గొప్పదని భావించుట వారి ఆభిజాత్యగర్వమే. అది వారి కేమాత్రము క్షేమమును గూర్చదు. ఈ శ్లోకమున 'అర్హన్ సుగత' ఇత్యాదికములైన అవైదిక మతములలోని దేవతల పేర్ల నుచ్చరించు వారిని శివు డనుగ్రహించునని చెప్పబడుటచే విష్ణ్వాది వైదికనామముల నుచ్చరించు వారిని ద్వేషించు శైవుల నుచిత మొనరించు చున్నారని వ్యంజింప బడినది. అవైదికులే శివానుగ్రహ పాత్రు లగుచుండగా వైదిక విష్ణ్వాది నామముల నుచ్చరించువారు శివానుగ్రహమునకు పాత్రులగుదురని చెప్పనవసరము లేదనుటకై ముత్య న్యాయము అర్థాపత్తియు వ్యంజింపబడు చున్నది. అల్లా అని ఉచ్చరించు మహమ్మదీయులు, గాడ్ అని ఉచ్చరించు క్రైస్తవులు, దేవుని (శివుని) పేరే ఉచ్చరించు చున్నారు. తదనుగ్రహమును పొందు చున్నారని గమనింప వలెను. వారు హిందువుల నజ్ఞులనుటలో గాని హిందువులు మహమ్మదీయ క్రైస్తవులకు భగవదనుగ్రహము లభింప దనుటలో నౌచిత్య మేమియు లేదు.

అవతారిక:- పై శ్లోకమున ఏ పేరుతో నైనను శివుని భజించు వానిని శివు డనుగ్రహించునని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆదిత్యాది సర్వజీవుల ప్రేరేపించు వాడు శివుడే అని చెప్పబడు చున్నది.

శ్లో॥ ఆదిత్యాదిగ్రహ పరికరో యాతి చాయాతి నిత్యం
కాలశ్చాయం దివస రజనీ పక్ష మాసర్తు చిహ్నః।
ఏత త్సర్వం నను న ఘటతే ప్రేరకత్వం వినా తే
కార్యే చాస్మిన్ న పునరపరస్యాస్తి సామర్థ్య మేతత్॥ 12

ప్రతిపదార్థము:- ఆదిత్యాది గ్రహ పరికరః=సూర్యుడు మొదలగు గ్రహములు

పనిముట్లుగా గల, దివస రజనీ పక్ష మాసర్తు చిహ్నః=దినములు రాత్రులు పక్షములు మాసములు ఋతువులు చిహ్నములుగా గల, అయమ్=ఈ, కాలః=కాలము, నిత్యమ్=ఎల్లప్పుడు, యాతి=పోవు చున్నది, ఆయాతి చ=వచ్చుచున్నది కూడ, ఏతత్=ఇది, సర్వమ్=అంత, తే=నీ యొక్క, ప్రేరకత్వమ్ వినా=ప్రేరకత్వము లేక, న ఘటతే నను=కుదరదుగదా, అస్మిన్=ఈ, కార్యేచ=కార్యమునందును, అపరస్య=ఇతరునకు, ఏతత్=ఈ, సామర్థ్యమ్= సామర్థ్యము, పునః=మాత్రము, న అస్తి=లేదు.

తాత్పర్యము:- సూర్యాది గ్రహములు కాలగమనమున పనిముట్లుగా ప్రతి దినము వచ్చుచు పోవుచున్నవి. అందువలన దినములు, రాత్రులు, పక్షములు, మాసములు, ఋతువులు అను అవయవములతో కూడిన కాలము వచ్చుచు పోవుచున్నది. ఇది యంతయు శివుని ప్రేరకత్వము లేనిదే జరుగదు. ఈ కార్యము నందు మరొకరికి మాత్రమీ సామర్థ్యము లేదు.

వివరణము:- సూర్యుడు వచ్చును, దినము అను కాలభాగ మేర్పడును. సూర్యుడు పోవును, రాత్రి అను కాలభాగ మేర్పడును. చంద్రుడు నెలకొక సారి పూర్ణముగా నుదయించును. అది పూర్ణిమ అనబడును. అసలు కనబడనే కనబడడు. అది అమావాస్య అనబడును. ఒకనాడు సూర్యాస్తమయము మొదలు అర్ధరాత్రి వఱకు కనబడడు. అది కృష్ణపక్షాష్టమి. ఆనాడు అర్ధరాత్రి ఉదయించి తెల్లవాఱు వరకుండును. శుక్లపక్షాష్టమి నాడు సూర్యాస్తమయమున నుదయించి అర్ధరాత్రమున అస్తమించును. అర్ధరాత్రి నుండి తెల్లవారు వరకు కనబడడు. శుక్ల పక్షమున ప్రతి పద నుండి పూర్ణిమ వరకు చంద్రుడు క్రమముగా పెఱుగును. కృష్ణపక్ష ప్రతిపద నుండి అమావాస్యవఱకు తఱుగును. ఈ రెండు పక్షములు కలసి యొక మాస మగును. చంద్రుని గమనము ననుసరించి ఈ పక్షమాసములు ఏర్పడినవి. ఈ మాసము యొక్క కొలత సుమారు 29.5 దినములు. సూర్యుడొకరాశి నుండి మరొక రాశికి పోవుకాలము కూడ మాసమే. దీని కొలత సుమారు 30.5 రోజులు. ఇట్లే అంగారకాది గ్రహములు పన్నెండురాసులు చుట్టి వచ్చుటకు వేఱువేఱు కొలతలుగల కాలము లున్నవి. ఆదిత్యాది గ్రహముల ఈ రాకపోకలు వేఱువేఱుగా నున్నవి. సూర్యుడస్తమించిన పిదపనే చంద్రాది గ్రహములు ఆకసమున కనబడును. సూర్యుడొక సంవత్సరమున పన్నెండు

రాసుల చుట్టి వచ్చును. బృహస్పతి ఒక్క సంవత్సరమున నొక రాశి నుండి మరొక రాశి వఱకు మాత్రమే ప్రయాణించును. శనైశ్చర గ్రహము 2.5 సంగల కొకసారి ఒక రాశి నుండి మరొక రాశి వఱకు మాత్రము ప్రయాణించును. ఈతడు శనైః=మెల్లగా, చరుడు=తిరుగువాడు. కావున శనైశ్చరుడు అని పిలువబడినాడు. ఈ గ్రహముల రాకపోకల వలననే దిన రాత్రి పక్షమాసర్తువుల రాకపోక లేర్పడినవి. కాలమున కివియే చిహ్నములు. ఇవి లేనిచో కాలము తెలియబడు నవకాశము లేదు. ఇవి ఇట్లంత నియమబద్ధముగా తిరుగుచున్నవి. అనగా ఎవరో వారిని తిరుగుటకు ప్రేరేపించు చున్నాడనవలెను. గ్రహములు గోళాకారమునను్న జడ పదార్థములే ఐనను తదధిష్ఠాన దేవతలు చేతనులు. చేతనులకే కర్తృత్వ మొప్పికొనిన ఆ గ్రహదేవతలు తిరుగుట అను క్రియకు కర్తలు అని చెప్పవలెను. కర్తృత్వము చేతనమునకు లేదు అను పక్షమున జడగోళములే తిరుగుట అను క్రియలకు కర్తలు అని చెప్పవలెను. ఏమైనను వానినట్లు తిరుగుటకు ప్రేరేపించిన వాడు శివుడే. అట్లు ప్రేరేపించు సామర్థ్య మితరులకు లేదు.ఆదిత్యాది గ్రహాధిష్ఠాన దేవతలు జీవులు (కర్తృత్వభోక్తృత్వములు జీవులకు పెక్కు దర్శనములలో అంగీకరింపబడినవి) జీవుడనగా ప్రాణేంద్రి యావయవ సంఘాతము నందు ప్రతిబింబించిన చైతన్యము. బింబచైతన్యము శివుడు. ప్రతిబింబ చైతన్యము జీవుడు అని చెప్పబడును. 'ధియో యోనః ప్రచోదయాత్' అని గాయత్రీ మంత్రము యొక్క తృతీయ పాదము శివుని ప్రేరకునిగా చెప్పు చున్నది. కర్త స్వతంత్రుడా కారకుడు (ప్రేరకుడు). స్వతంత్రుడా అనున దొక ప్రశ్నము. కారకత్వ మీశ్వరున కంగీకరించినప్పుడు జీవుని కర్తృత్వము అంగీకరింపబడినను అది అకించిత్కర సదృశమే. కర్తృత్వము జడ లక్షణము. ప్రేరకత్వము చేతన లక్షణము అని అంగీకరించినప్పుడు జీవులకు జడములకు వలె అస్వాతంత్ర్యమే సిద్ధమగును. ఈ ఉభయము చైతన్య ప్రతి బింబిత జడమునం దేర్పడు నట్టివి. తదుభయము చేతనము, బింబ ప్రతిబింబ భావ వర్జిత శుద్ధ చైతన్యము నందున్నది సాక్షిత్వము మాత్రమే.అవిద్య మాయోపాధి ప్రతి బింబనముచే కర్తృత్వ ప్రేరకత్వము లేర్పడుచున్నవి. అవిద్య జీవోపాధి, మాయ ఈశ్వరోపాధి జీవకర్మలకును ప్రేరకుడైన ఈశ్వరుడు (శివుడు) జగత్ సృష్ట్యాది క్రియలకు కర్తయే. దినరాత్రి పక్షమాసర్తు చిహ్నముల (గల కాలము యొక్క) గతి క్రియకు ఈశ్వరుడు ప్రేరకుడు. ఆయన ప్రేరణ వలననే ఆదిత్యాది

గ్రహముల రాకపోకలు, దినరాత్రి పక్షమాసాది కాల చిహ్నముల రాకపోకలు ఇంత నియమబద్ధముగా జరుగుచున్నవనగా అట్లు జరుగుటకు ప్రేరకుడైన శివుని సామర్థ్య మనితర లభ్యము. అనితర దృష్టము. సూర్యుడు నక్షత్రము. చంద్రుడు భూమికి ఉపగ్రహము. అయినను ఆదిత్యాది నవకము యొక్క ప్రభావము గ్రహముల (దయ్యములు మొదలగువాని) కున్నట్లుండుట చేతను ప్రసిద్ధి ననుసరించియు నీ శ్లోకమున గ్రహములుగా పేర్కొనబడినవి.

అవతారిక:- పై శ్లోకము ఫలము చెప్పబడుచున్నది.

శ్లో॥ తస్యాగారే గిరిశ! రమతే ధేనువ త్కామధేను:
క్రీడావాటే విటపి సదృశ: కల్పతే కల్పవృక్ష:।
లాక్షా రక్షామణిరివ కరే తస్య చింతామణి: స్యా
ద్యస్మిన్ సిద్ధ: సకృదపి కృపాదృష్టిపాత ప్రసార:॥ 13

ప్రతిపదార్థము:- గిరిశ=గిరియందు శయనించువో శివా, యస్మిన్=ఎవని యందు, సకృత్ అపి=ఒకసారి యైనను, కృపాదృష్టిపాత ప్రసార:=దయతో కూడిన క్రీగంటి వ్యాపారము, సిద్ధ:=కలిగినదో, తస్య=అతని యొక్క, అగారే=ఇంటి యందు, ధేనువత్=ఆవువలె, కామధేను:=సురభి, రమతే=ఆనందించు చుండును క్రీడావాటే=ఆడుకొను తోట యందు, విటపి సదృశ:= చెట్టువలె, కల్పవృక్ష:=కల్ప వృక్షము, కల్పతే=(సుఖ:భోగములను) కల్పించును, తస్య=అతని యొక్క, కరే= చేతియందు, లాక్షా ఇవ=లత్తుకవలె, రక్షామణి:=రక్షకై కట్టబడు మణివలె, చింతామణి:=చింతామణి, స్యాత్=అగును.

తాత్పర్యము:- గిరిశా! ఎవని యందు నీ కృపాదృష్టి ప్రసరించునో వాని యింట కామధేనువే పాడియావు వలె ఆనందించు చుండును. వాని పెరటిలో చెట్టువలె కల్పవృక్షము సుఖములను కల్పించు చుండును. వాని చేతిలోని లత్తుకవలె రక్షకై కట్టబడిన మణివలె చింతామణి చేరి యుండును.

వివరణము:- దేవరాక్షసు లమృతము కొఱకు పాలసముద్రమును మథించగా కామధేను, కల్పవృక్ష, చింతామణులు ఆ సముద్రము నుండి బుట్టినవి. వాని నింద్రుడు స్వీకరించినాడు. ఈ శ్లోకమున శివకృపాదృష్టి పాతము చేత ఇంద్రత్వ ప్రాప్తి సాధారణ మనుష్యునకు లభించునను నర్థము వ్యంగ్య మగుచున్నది.

ఆవుపాలను పొదుగు నుండి పితుకునట్లు కోరికలను పితుకు ఆవు కామధేనువని చెప్పబడును. ఆకులు పండ్లు పూలు చెట్టు నుండి పొందునట్లు కల్ప వృక్షము నుండి కోరికలను పొందవచ్చును. అట్లే చింతామణి చేతనున్నచో కోరికలను పొంద వచ్చును. ఇవి సాంసారిక భోగములను ఒసగగలవే కాని శివభక్తిని కాని మోక్షమును గాని ప్రసాదింప లేవు. శివకృపాదృష్టి ప్రసరించు భాగ్యమునకు నోచుకొన్నవాడు తనకు కలిగిన భోగములను చూపి ఇతరులకు శివభక్తిని కలిగించు నవకాశమున్నది. ఇంద్రత్వము చచ్చి స్వర్గమునకు పోయిన వానికి లభించును. శివభక్తునకీ లోకముననే ఇంద్రుని కన్న అధికముగా అన్ని భోగములు లభించును. రమతే కల్పతే అను క్రియలు స్వర్గమున ధేనువు నివసించును కాని శివ భక్తునింట ఆనందముతో నివసించును, కల్పవృక్షము ఇంద్రుని ఆజ్ఞతో కోరికల ఫలించునేమో కాని శివభక్తునింట మాత్రము స్వయముగా కల్పించును అను అర్థముల వ్యంజించు చున్నవి.

అవతారిక:- శివభక్తుని గృహాలంకారములు కామధేను కల్పవృక్షమని హస్తాలంకారము చింతామణి అని చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని అలంకారము యోగి కుండవలసిన అలంకారములని చెప్పబడు చున్నది.

శ్లో॥ మౌళౌ లోల త్రిదశతటినీ తోయ శీతే2మృతాంశుం
కణ్ఠే క్రూరం కబలిత విషశ్యామలే వ్యాళరాజమ్।
జ్యోత్స్నాగారే వపుషి విశదమ్ బిభ్రతో భస్మ రాగమ్
జ్ఞాతా సమ్య క్త్రినయన! మయా యోగిభూషా తవైవ॥ 14

ప్రతిపదార్థము:- త్రినయన= ఓ ముక్కంటీ, లోలత్రి దశ తటినీ తోయశీతే= కదలుచున్న గంగానదీ జలముచే చల్లనైన, మౌళౌ=తలయందు, అమృతాంశుమ్ =చంద్రుని, కబలిత విష శ్యామలే=మ్రింగిన విషముచే నల్లనైన, కంఠే=కంఠమున, క్రూరమ్=క్రూరమైన, వ్యాళరాజమ్=సర్పరాజమును, జ్యోత్స్నాగారే=వెన్నెలకు నిలయమైన, భస్మరాగమ్=బూడిద పూతను, వపుషి=శరీరమునందు, బిభ్రతః= ధరించు, తవఏవ=నీకే, మయా=నాచేత, సమ్యక్=బాగుగా, విశదమ్=తెలిసినది, యోగిభూషా=యోగి యొక్క అలంకారము, జ్ఞాతా=తెలియబడినది.

తాత్పర్యము:- గంగాజలముచే చల్లనైన శిరమున చంద్రుడు, విషము

త్రావుటచే నల్లనైన కంఠమున క్రూర సర్పరాజము, వెన్నెలకు నిలయమైన శరీరమున స్వచ్ఛమైన బూడిద, యోగికి వలె నీకు అలంకారములుగా నున్నవి.

వివరణము:- శీతోష్ణ సమీకరణము సాధారణ జనుల కిష్టము, కావున ఎండ కాలమున శైత్యోపచారముల వారు సమకూర్చుకొందురు. చలికాలమున ఉన్ని వస్త్రములు ధరించి చలిని తగ్గించుకొందురు. ఇట్టివే మరికొన్ని వేడి వస్తువులు సమకూర్చుకొందురు. ఎండకాలమున పలుచటి వస్త్రములు గంధపు పూతలు మల్లెపూలు పక్కలలో చల్లుకొనుట మొదలగు శైత్యోపచారములు ఇష్టపడుదురు. యోగులు సామాన్య జనులవలె కాక శీతోష్ణ సహనమునకే పెద్దపీట వేయుదురు. చలికాలమున కూడ దిగంబరులుగా నుందురు. ఎండ కాలమున కూడ తోలు వస్త్రములు ధరించెదరు. గంగానదిని తలదాల్చుటచే ఆయన తల మొదటనే చల్లగా నుండగా ఆ చల్లదనము చాలదన్నట్లు, చంద్రుని శివుడు తలపై ధరించినాడు. అట్లే విషప్రభావముచే నల్లనైన కంఠమున, క్రూరమైన విషజంతువైన సర్పరాజమును కంఠమున ధరించినాడు. శిరోభూషణమైన చంద్రుని వెన్నెలచే తెల్లని శరీరము మరింత తెల్లగా కనబడుచుండగా ఆ తెలుపు చాలదన్నట్లు విభూతి పూత శరీరమున దాల్చినాడు. చంద్ర సర్పవిభూతుల ధరించుట యోగి జనోచితములు కావున తన యోగిత్వమును తెలుపుటకా భూషణముల దాల్చినాడే కాని కాల భేదమున మారు శీతోష్ణముల సమముల నొనర్చు కొనుటకు కాదని గమినింపవలెను. దేవతలలో నితరుల కెవ్వరకు నిట్టి యోగోచితా లంకారములు లేవు. శిరమున చంద్రుని ధరించుట తన శిరము నందలి సహస్రార కమలమున చంద్రుని (స్వాత్మను) యోగ౹బలమున దర్శించుటకు సూచనము. కంఠమున సర్పరాజమును ధరించుట తనలోని కుండలినీ యోగసాధనమునకు సూచనము. అట్లే తన శరీరమున బూడిద పూత ధరించుట తన వైరాగ్యమునకు సూచనము. అందఱును చివఱకు బూడిద కావలసియే యుండగా శరీరమున అంగరాగ భూషణాదుల ధరించుట వ్యర్థమని ఆ బూడిద పూత సూచించును. గంగచే చల్లనైన తల యందు మరల చల్లని చంద్రకళను ధరించుట, విషముచే కమలిన కంఠమున మరల విషమును ధరించుట తన శీతోష్ణ సహనమును చాటుట శీతోష్ణాది ద్వంద్వముల సహనము యోగులలో మాత్రము దర్శనీయము. మిగిలిన దేవతలకు భోగముల ప్రసాదించు శివుడు తాను యోగిగా భోగముల తిరస్కరించి ఇతర దేవతా వైలక్షణ్యమునే గాక ఇతర దేవతలకు తలకు మించిన

వైరాగ్యమును చాటుచు తన మహాదేవత్వమును చాటుచున్నాడు. కంఠములోని విషము యొక్క తాపమును బాపుకొనుటకే శిరమున చంద్ర గంగలను ధరించి నాడని కొందఱు చెప్పుదురు. ఆ తాపమును ధరించ లేకయే శుద్ధమును సైతము విడచి వేసి నాడనియు చెప్పుదురు. వారికి శివుని మహత్త్వమేమియు తెలియదని చెప్పవలెను. ఇంద్రాది దేవతలకు గల భోగ సామగ్రి యంతయు శివుని యను గ్రహమున కలిగినదే. శివున కవి కావలసిన సమకూర్చు కొనలేడా! అవి తనకు స్వాధీనములే. భోగముల వలన పుణ్యక్షయ మేర్పడును. రోగ భయమును కలుగును. భోగే రోగ భయమ్ అని చెప్పబడినది. భోగములందలి వాంఛయే ప్రపంచము నందలి పరస్పర వైరమునకు మూలము. వానిని వీలైనంత వఱకు తగ్గించుకొనుటయే వైరమూలమును పరిహరించుట. ఈ ఆదర్శమును శివుడు తన యోగ భూషాధారణము ద్వారా లోకమునందలి జీవులకు తెలుపు చున్నాడు. ద్వంద్వ సహనము వలన పాపక్షయ మేర్పడును. ఆ ఆదర్శమును కూడ శివుడు లోకములోని జీవులకు తన చంద్ర సర్పధారణము ద్వారా తెలుపు చున్నాడు. అదియే ఈదృశయోగిభూషాధారణ ప్రయోజనము.

అవతారిక:- పై శ్లోకమున గంగా చంద్ర విష సర్ప భస్మధారణములు యోగి భూషలుగా శివుడు ధరించినాడని చెప్పబడినది. ఈ శ్లోకమున అవి శివునందెట్లు ప్రకాశించు చున్నవో చెప్పబడు చున్నవి. పై శ్లోకమున త్రినయన అను సంబోధనమున స్పష్టమైన మూడవ నేత్రమీ శ్లోకమున లలాటమునకు ఎట్టి శోభను కలిగించు చున్నదో చెప్పబడు చున్నది.

శ్లో॥ ధత్తే శోభాం ఘుస్పృణ తిలక స్పర్థి చక్షు ర్లలాటే
మౌళౌ లగ్నా త్రిదశతటినీ మాలతీ మాలికేవ।
క్ష్వేళః క్రీడా మృగ మదమయీ పత్రలేఖేవ కణ్ఠే
శ్లాఘ్యః శమ్భో! స్ఫురతి సహజః కోఽపి భూషావిధి స్తే॥ 15

ప్రతిపదార్థము:- లలాటే=ఫాలమున, ఘుస్పృణ తిలక స్పర్థి=కుంకుమ తిలకము తో పోటీ పడుచున్నదిగా, చక్షుః=కన్ను, శోభామ్=శోభను, ధత్తే=ధరించు చున్నది, మౌళౌ=తలయందు, లగ్నా=కలిసియున్న, త్రిదశతటినీ=గంగ, మాలతీ మాలికా ఇవ=జాజిపూల హారము వలె, (శోభామ్=శోభను, ధత్తే=ధరించు చున్నది), క్ష్వేళః=విషము, మృగమదమయీ=కస్తూరీమయమైన, పత్రలేఖా ఇవ=పత్ర లేఖ

వలె, కంఠే=కంఠమున, శ్లాఘ్యః=మెచ్చదగినదై (ఉన్నది), శమ్భో=ఓ శివా, తే=నీ యొక్క, కః అపి=ఒకానొక, భూషావిధిః=అలంకరించు కొను పద్ధతి, సహజః= సహజమైనది, స్ఫురతి=ప్రకాశించు చున్నది.

తాత్పర్యము:- మూడవ కన్ను లలాటమున కుంకుమ బొట్టు వలె, కంఠమున విషము కస్తూరి పత్రలేఖవలె, తలపై గంగ మల్లెల హారము వలె శోభించు చున్నవి. నీ అలంకరించుకొను పద్ధతి మిక్కిలి సహజముగా నొప్పుచున్నది.

వివరణము:- శివుడు తిలకము ధరించనక్కఱ లేదు. లలాట నేత్రము కుంకుమబొట్టు వలెనే ఉన్నది కదా? శివుడు శిరమున జాజి మల్లెపూదండ చుట్టుకొను నవసరము లేదు. ఆయన తలపై నున్న గంగ జాజుల మల్లెలమాల వలెనే ఉన్నది కదా! ఆయన కంఠమున కస్తూరీ పత్రరచనము చేసికొన నక్కఱ లేదు.విషము వలన నేర్పడిన మచ్చ కస్తూరీ పత్ర లేఖ వలెనే ఉన్నది కదా! నుదుట బొట్టు, తలపై మల్లెల మాలను, కంఠమున కస్తూరి తీగలను రచించు కొనుట వంటి అలంకారములను శరీరమున సహజముగా లేకపోవుటచే లోకులు వానిని సమకూర్చు కొందురు. నీ కట్టి శ్రమ లేకుండ సహజాలంకారములుగా గంగా విష నైల్య లలాట నేత్రము లొప్పి యున్నవి. అవి సహజములని తెలియని వారు సాధారణుల వలె కుంకుమ తిలకమును, మల్లెల మాలను, కస్తూరి పత్రలేఖను ధరించి నావనుకొందురే కాని అవి లలాట నేత్ర గంగా విషనైల్యములని యెఱుగ కుందురు. నీకు సహజమైన లలాట నేత్రము ననుకరించుచు లోకులు కుంకుమ బొట్టును, నీ సహజ గంగ ననుసరించుచు మల్లెల మాలను, విషనైల్యము నను కరించుచు కస్తూరీ పత్ర లేఖారచనము నొనరించుకొను చున్నారేమో? లేకున్న లోకులకీ అలవాట్లెట్లు కలిగినవి?

అ:-పైన లలాట నేత్రము శివుని సహజ కుంకుమతిలకముగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ నేత్రముచే చేయబడిన కామ దహనము చెప్పబడు చున్నది.

శ్లో॥ దగ్ధో యేన త్రిభువన మిదం దేవ దుర్వార ధామ్నా
దగ్ధః సోఽపి త్రినయన భవద్దృష్టిపాతేన కామః।
యుక్తం చైత ద్భవతి పురుషోయః పరస్యోపతాపీ
తస్యావశ్యమ్ పతతి శిరసి క్రోధ దణ్డః ప్రభూణామ్॥ 16

ప్రతిపదార్థము:- దేవ= ఓదేవ!, దుర్వారధామ్నా=వారింపరాని తేజముగల, యేన=ఎవని చేత, ఇదమ్=ఈ, త్రిభువనమ్=ముజ్జగము, దగ్ధమ్=కాల్చబడినదో, సః=ఆ, కామః అపి=కాముడు కూడ, త్రినయన=ఓ ముక్కంటీ, భవత్‌దృష్టి పాతేన=నీ కటాక్షము చేత, దగ్ధః=కాల్చబడినాడు, ఏతత్ చ=ఇదియు, యుక్తమ్= యుక్తముగానే, భవతి=ఉన్నది, యః=ఏ, పురుషః=పురుషుడు, పరస్య= ఇతరునకు, ఉపతాపీ=బాధ కలిగించు వాడగునో, తస్య=అతని యొక్క, శిరసి= శిరమున, ప్రభూణామ్=ప్రభువుల యొక్క, క్రోధ దండః=క్రోధముతో చేయబడు శిక్ష, అవశ్యమ్=తప్పక, పతతి=పడును.

తాత్పర్యము:- వారింపరాని తేజముగల యే కాముని చేత ఈ త్రిలోకము కాల్చబడినదో ఆ కాముడును నీ కడకంట కాల్చబడెను. ఇట్లు జరుగుట తగినదే. ఎవడు ఇతరుల బాధించునో ప్రభువులు వానిని కోపముతో శిక్షింపక మానుదురా!

వివరణము:- పూర్వార్ధముత్తరార్ధముచే సమర్థింపబడుటచే నీ శ్లోకమున అర్థాంతరన్యాసాలంకార మేర్పడి యున్నది. బలవంతునిచే బలహీనుడు పీడింపబడుచుండుట లోకమున విరివిగా కనబడు చుండును. ఆ బలహీనుడు తనను పీడించిన వాని హానిని కోరుకొనును. కాని వాడు బలహీనుడు కావున బలవంతునేమియు చేయలేడు. ఎవడైన బలవంతడు తనను హింసించిన వానిని శిక్షించిన బాగుండ ననుకొనును. ఈ మూగ ప్రార్థనము ఫలించినచో వానికి ప్రభువుచే శిక్ష పడును. లోకమున కామునిచే పీడింపబడని వాడెవడును ఉండడు. వాడు విఱ్ఱవీగి లోకము నంతను కాల్చివేసి నాకెదురు లేరెవ్వరను కొనెను. పీడింపబడిన వారు మాత్రము వాడు శిక్షింపబడిన బాగుండునని తలచిరి. వారి ప్రార్థనము ఫలించి శివు నెదిరించి ఆ శివుని కంటి మంటలో వాడు కాలిపోయెను.

అవతారిక:-పై శ్లోకమున శివుని కంటి మంటలో కామ దహనము చెప్పబడినది. దానికి కారణమా కాముని లోక దహనమని చెప్పబడినది. ఈ శ్లోకమున బలవంతునితో స్పర్థించుట కూడ మరొక కారణమని చెప్పబడు చున్నది.

శ్లో॥ కస్య క్షేమో భవతి బలినా స్పర్థమానస్య సార్థం
యస్త్వ త్కోపా త్త్రినయన! భవ చ్చక్షుషా వంచితో౽భూత్।
ప్రేమ్ణా దష్టే రధర కిసలయే దృష్టవాన్ య స్స కామీ
లీలా నృత్యా చ్చతుర వనితా భ్రూలతా ప్రేక్షణాని॥ 17

ప్రతిపదార్థము:- త్రినయన!= ఓ ముక్కంటీ, ప్రేమ్ణా=ప్రేమతో, అధరకిసలయే =చిగురుటాకు వంటి పెదవి, దష్టే=కొఱకబడగా, యః=ఎవడు, లీలానృత్యా చ్చతుర వనితా ప్రేక్షణాని=విలాసముగా నాడు ప్రౌఢస్త్రీల తీగల వంటి కను బొమ్మల చూపులను, దృష్టవాన్=చూచి యున్నాడో, యః=ఎవడు, త్వత్కోపాత్= నీ కోపము వలన, భవచ్చక్షుషా=నీ కంటితో, వంచితః=వంచింపబడినవాడు, అభూత్=ఆయెనో, సః=వాడు, కామీ=కామము కల, బలినా సార్థమ్=బలవంతుని తో, స్పర్థమానస్య=స్పర్థించుచున్న, కస్య=ఎవనికి, క్షేమః=క్షేమము, భవతి= కలుగును.

తాత్పర్యము:- ఎవడు ప్రేమతో ప్రౌఢస్త్రీ అధరముల కొఱికి వారి విలాసపు చూపులను చూచెనో వాడు శివుని కోపము వలన శివుని కటాక్షము కోల్పోవును. బలవంతునితో స్పర్థించు వానికెవనికి క్షేమము కలుగును.

వివరణము:- నాయకుడు ప్రేమతో ప్రేయసి అధరమును కొఱకి గాయము చేయును. ఆ ప్రౌఢస్త్రీ కోపమును నటించుచు విలాసముగా చూచును. ఆమె ఎదలోని తీయని బాధ నామె వ్యక్తము చేయుచున్నదని ఆ కాముకు డెఱుగును. ఇట్లు స్త్రీల చూపులచే వాడారాధింపబడినను, వాడు శివునకు కోపము కలిగించు వాడగు చున్నాడు. ఈ జన్మము నొసగినది శివుని చేరుటకు. అట్లు చేయక పోవుటచే తనిచ్చిన జన్మమును వ్యర్థ మొనరించుకొను చున్నాడని శివుడు కోపించును. ఆయన అనుగ్రహమును కోల్పోయిన ఆ కాముకుడు నరకాది లోకముల కేగును. వానికి క్షేమము కలుగదు. కాముల నిట్లు పాడుచేసిన వాడు కాముడు. ఆ కాముడు మాత్రమేమి బాము కొన్నాడు. ఆయన శివుని కంటి మంటలో కాలి బూడిదయైనాడు. శివుని కామిని చేయబూని అనగా శివునితో స్పర్థించి అట్లు కాలి బూడిదయైనాడు. శివుడు బలవంతుడు అనగా మనోబలము, ఆత్మబలము కలవాడు. అట్టి వానితో స్పర్థించిన వానికెవనికిని క్షేమము కలుగదు. శివుని కాముకు నొనర్తునని పంతము బూనిన కాముని కాగతి పట్టినది. కావున లోకమున నెవరును బలవంతునితో స్పర్థించ కూడదను నీతి నిరూపింపబడినది.

అవతారిక:- పై శ్లోకమున శివానుగ్రహము కోల్పోయిన వారికి క్షేమము కలుగదని చెప్పబడినది. ఈ శ్లోకమున అట్టి వానికిని శివుడే దిక్కని చెప్పబడు చున్నది.

శ్లో॥ యే దారిద్ర్యోపహత వపుషో యే చ దౌర్భాగ్య తప్తాః
యే వా శత్రు వ్యసన వికలా యే చ మౌర్ఖ్యావ తప్తాః।
యే వా కైశ్చి త్రినయన దృఢమ్ పీడితా దుఃఖశోకై
స్తేషా మేక స్త్వమసి శరణం తర్షితానా మివామ్బుః॥ 18

ప్రతిపదార్థము:-యే=ఎవరు, దారిద్ర్యోపహతవపుషః=పేదరికముచే కొట్టబడిన శరీరము కలవారో, యే=ఎవరు, దౌర్భాగ్య తప్తాః=దౌర్భాగ్యముచే తపించిన వారో, యే=ఎవరు, శత్రువ్యసన వికలాః=శత్రువ్యసనము వలన వైకల్యమునొందిన వారో, యే=ఎవరు, మౌర్ఖ్యావతప్తాః=మూర్ఖముచే తపించిన వారో, యే=ఎవరు, కైఃచిత్=కొన్ని, దుఃఖ శోకైః= దుఃఖముచే శోకముచే, దృఢమ్=గట్టిగా పీడితాః=పీడింపబడినారో, తేషాం=వారికి, తర్షితానామ్=దప్పిగొన్నవారికి, అమ్బుఃఇవ= జలము వలె, త్వమ్=నీవు, ఏకః=ఒకడవు, శరణమ్=దిక్కు, అసి=అగు చున్నావు.

తాత్పర్యము:- ఎవరు పేదరికమున మ్రగ్గు చున్నారో, ఎవరు దౌర్భాగ్యముచే తపించినారో, ఎవరు శత్రుబాధచే పీడింపబడినారో, ఎవరు మూర్ఖతచే తపించి నారో, ఎవరు కొన్ని దుఃఖ శోకములతో పీడింపబడు చున్నారో వారందఱికి, దప్పిక గొన్న వారికి నీరువలె నీ వొక్కడవే దిక్కగు చున్నావు.

వివరణము:- పేదరికము గల వారికి మంచి ఆహారము లభించక పోవుటచే వారి శరిరము కదియబడిపోవును.బక్కచిక్కి ఉండును. అట్టివారు దౌర్భాగ్యోపహత వపుషః అని ఈ శ్లోకమున చెప్పబడినారు. దౌర్భాగ్య మనగా దురదృష్టము. ఈ జన్మమున నే తప్పు చేయక పోయినను ఒప్పునే చేయుచున్నను, వారి సత్కర్మలు ఫలింపక పూర్వజన్మపాపములు ఫలించి బాధ పడువారు. దౌర్భాగ్యోప హత వపుష్కులు,శత్రువులతో యుద్ధము చేసి హస్త పాదాదీంద్రియముల పోగొట్టు కొన్న వారు శత్రువ్యసన వికలులు. తమ మూర్ఖత వలన తామే చెడినవారు. మౌర్ఖ్యావతప్తులు. కొన్ని కొన్ని దుఃఖ శోకములతో కొందఱు పీడింపబడు చుందురు. వారును పెక్కురుందురు. అట్టి వారి కందరకు నీ వొక్కడవే దిక్కు. దప్పిగొన్న వారి కెందఱకైనను ఒక జలమే దిక్కు అయినట్లు నీ వొక్కడవే వారికి దిక్కు అని పోలిక చెప్పబడుటచే ఉపమాలంకార మీ శ్లోకమున నున్నది.

అవతారిక:- పై శ్లోకమున దుఃఖితుల కేకైక శరణము శివుడని చెప్పబడినది. ఈ శ్లోకమున ఎన్ని గొప్పలున్నను శివసేవ లేనిచో వ్యర్థములని చెప్పబడు చున్నది.

శ్లో॥ శ్లాఘ్యం జన్మ శ్రుతి పరిణతిః సత్క్రియాయామ్ ప్రవృత్తిః
ప్రౌఢిః శాస్త్రే లలితా మధురా సంస్కృతా భారతీ చ।
స్ఫీతాలక్ష్మీ ర్వపు రతిదృఢం చన్ద్రరేఖాఙ్కమౌళే
యుష్మ త్సేవాపద విరహితం సర్వ మేత త్పలాలమ్॥ 19

ప్రతిపదార్థము:-శ్లాఘ్యమ్=మెచ్చుకొనదగిన, జన్మ=జన్మము, శ్రుతి పరిణతిః= వేదమునందు పండిపోవుట, సత్క్రియాయామ్=మంచి క్రియలలో, ప్రవృత్తి= పూనిక, శాస్త్రే=శాస్త్రము నందు, ప్రౌఢిః=పాండిత్యము, లలిత మధురా= సుందరము, తీయనిదియు, సంస్కృతా=సంస్కృతమైన, భారతీ చ=భాషయు, స్ఫీతా=చిక్కని, లక్ష్మీః=సంపద, అతిదృఢమ్=మిక్కిలి దృఢమైన, వపుః=శరీరము, ఏతత్=ఇది, సర్వమ్=అంతయు, చంద్రరేఖాంకమౌళే=చంద్రరేఖ చిహ్నముగా గల శిరముగలవాడా, యుష్మ త్సేవాపద విరహితమ్=మీ సేవ యొక్క అవకాశము లేనిదైనచో, పలాలమ్=మాంసము.

తాత్పర్యము:- మెచ్చుకొన దగిన జన్మము, వేదజ్ఞత, సత్కర్మ ప్రవృత్తి, శాస్త్ర పాండిత్యము, సుందరము తీయనిది సంస్కృతమైనదియు నగుభాష, చిక్కని సంపద, మిక్కిలి దృఢమైన శరీరము ఇది యంతయు ఓ శివా! నీ సేవావకాశము లేనిదైనచో మాంసమే.

వివరణము:-శ్లాఘ్య జన్మ అనగా ఆచారవంతులైన బ్రాహ్మణుల వంశమున గాని, పరాక్రమ ప్రాభవముగల చక్రవర్తుల వంశమున గాని కలిగిన జన్మము. అది దుఃఖ బహులమైన జన్మలలోనను మెచ్చుకొన దగినదే. ఉపాసకయోగి వంశములో లభించిన జన్మము మరల జన్మించుట కవకాశములేని మోక్షమును కలిగించు చరమజన్మ మగుటచే అది మెచ్చు కొనదగినదే. ఆ జన్మములోననే వైదిక విజ్ఞాన మబ్బెనేని బంగారమునకు పరిమళ మబ్బినట్లే. వైదిక విజ్ఞాన మబ్బుట మోక్ష హేతువగును. కావున అది మంచి గొప్పతనమే. అట్టి జన్మము వైదిక విజ్ఞానము కలిగించును. సత్కర్మచేయనిచో వ్యర్థమే కావున సత్కర్మ ప్రవృత్తి ఆవశ్యకము. అదియు కలిగినదేని అది ఇంకొక గొప్పతనము. కేవల వేద పఠనము శాస్త్రపాండిత్యము లేనిచో తలబరువు మాత్రమే అగును. శాస్త్ర పాండిత్యము కూడ కలిగినచో అది ఇంకొక గొప్పతనము. ఇన్ని ఉన్నను తన వేదశాస్త్ర జ్ఞానము వెలువరించదగి అందమైన తీయని నిర్దుష్టమైన భాష లేనిచో వ్యర్థమే కావున

అది యేర్పడుట మరొక గొప్ప తనము. ఇన్ని ఉండినను సంపత్తిలేనిచో పాపములు చేసి పొట్టపోసి కొనవలసి వచ్చును. అట్టి దురదృష్టము లేని సంపద ఉన్నచో అదియు గొప్ప తనమే అగును. ఇన్ని ఉన్న శరీరము దృఢమైనది కాదేని రోగముల పాలై ధర్మ సాధనము కాకపోవచ్చును. కావున దృఢ శరీరము కూడ నొక గొప్ప తనమే. ఇన్ని ఉన్నను శివసేవావకాశము భక్తి లేనిచో అవియు అంతయు మాంసము వలె వర్జింపదగినదే అగును. అన్నిటికన్న శివ సేవావకాశము ఆవశ్యక మైన దనుట ఈ శ్లోకసారము.

అవతారిక:- పై శ్లోకమున శివసేవను మించిన దేదియు లేదని చెప్పబడినది. ఈ శ్లోకమున శివ సేవావిశేషమైన శివపూజ యొక్క ఫలము చెప్పబడు చున్నది.

శ్లో॥ త్వత్పూజాయాం కుసుమ హరణే ధావతః పాదయుగ్మం
యత్పాషాణ వ్రజపరికరోద్గీర్ణ రేఖాఙ్క మాసీత్।
తత్తస్యైవం తదనుచరతో రుద్ర లోకం గతస్య
బ్రహ్మాదీనా మ్మకుట కిరణ శ్రేణయః శోణయన్తి॥ 20

ప్రతిపదార్థము:- త్వత్పూజాయామ్=నీ పూజయందు, కుసుమ హరణే= పూలను తెచ్చుట యందు, ధావతః=పరుగెత్తువాని యొక్క, యత్=ఏ, పాద యుగ్మమ్=పాదముల జంట, పాషాణవ్రజపరికరోద్గీర్ణ రేఖాంకమ్=రాళ్ళ గుంపు యొక్క సంబంధము చేత చెక్కబడిన రేఖలు చిహ్నములుగ గలది, ఆసీత్= ఆయెనో, ఏవమ్=ఇట్లు, తప్తస్య=తపించిన, తదనుచరతః=వాని వెంట పోవుచు, రుద్రలోకమ్=రుద్రలోకమును, గతస్య=చేరిన వాని యొక్క, తత్=దానిని (ఆ పాదముల జంటను), బ్రహ్మాదీనామ్=బ్రహ్మాదుల యొక్క, మకుట కిరణశ్రేణయః =కిరీటముల కిరణముల వరుసలు, శోణయన్తి=ఎఱ్ఱబఱచు చున్నవి.

తాత్పర్యము:- నీ పూజకు కావలసిన పూవులను తెచ్చుటకు గుట్టలపైన పరుగిడు చుండగా ఆ రాళ్ళ గుంపుల సంబంధముచే కొంచెము పగిలి ఎఱ్ఱని రేఖలతో చిహ్నితమైన వాని పాదముల జంటను రుద్రలోకమున కేగిన పిమ్మట బ్రహ్మాదుల కిరీటములందలి మణుల కిరణము లెఱ్ఱబఱచు చున్నవి.

వివరణము:- భూలోకమున శివ పూజకై పూవుల కొఱకు గుట్టలపై తిరుగుటచే ఆ గుట్టలలోని రాళ్ళు తగిలి ఎవని పాదములు చీఱుకొనిపోయి రక్తము కొంచెము వెలికి వచ్చుటచే ఎఱ్ఱని రేఖలు పాదములలో నేర్పడినవో వాడా శివపూజా పుణ్యము

చే శివలోకము చేరగా వాని పాదములకు బ్రహ్మాదులు నమస్కరించినపుడు వారి కిరీటములలోని ఎఱ్ఱని మణుల కురులు శివసారూప్య మందిన ఆ భక్తుని తెల్లని పాదముల జంట నెఱ్ఱబఱచు చున్నవని శివపూజ ఫలము కైలాసప్రాప్తి అగుట బ్రహ్మాది వంద్యతయుననీ ఈ శ్లోకము నందలి అర్థముచే వ్యంగ్య మగుట చే అర్థ శక్తి మూల ధ్వని ఈ శ్లోకమున ఏర్పడినది. తప్తస్య అను పదము పూవుల కొఱకై పరువెత్తునపుడు శరీరము కష్టపడినది.అని ఆ కష్టమే తపస్సని వ్యంజింప జేయును. సూర్యోదయ సమయమున విచ్చుకొనుచున్న క్రొత్త పూలనే గైకొన వలెనను ఇచ్ఛ ధావతః అను పదము వలన వ్యంగ్యమగు చున్నది. ఆలస్యమ యినచో పూవులు నేలపై వ్రాలి శివపూజానర్హము లగునను భయము కూడ వ్యంగ్యమగు చున్నది.

అవతారిక:- పై శ్లోకమున శివపూజ ఫలముగా పాదములకు పట్టు గొప్ప దశ చెప్పబడినది. ఈ శ్లోకమున శివ మందిరము నలుకు చేతులకు పట్టు గొప్ప దశ చెప్పబడు చున్నది.

**శ్లో॥ యేషాం యుష్మ త్ప్రతికృతి గృహం లిప్తతామ్ పాణయో యే**
**త్వద్భక్తానాం సలిల లులితై ర్గోమయైః సమ్ప్రలిప్తాః।**
**తేషా మీశ! త్రిదశనగరీ నాయకత్వం గతానాం**
**తే లిప్యన్తే మృగ మదరసైః ఖేచరీణాం కుచేషు॥ 21**

ప్రతిపదార్థము:- ఈశ= ఓ ప్రభో, యుష్మత్ప్రతికృతి గృహమ్= మీ ప్రతి బింబముగల గృహమును, లిప్తతామ్=అలుకు, యేషామ్=ఎవరి యొక్క, యే= ఏ, పాణయః=చేతులు, సలిల లులితైః=నీళ్ళతో పొరలాడిన, గోమయైః=ఆవు పేడల చేత, సమ్ప్రలిప్తాః=పూయబడినవో, తేషామ్=ఆ, త్రిదశనగరీ నాయకత్వమ్ =ఇంద్రత్వమును, గతానామ్=పొందిన, త్వద్భక్తానామ్= నీ భక్తుల యొక్క, తే= అవి(చేతులు), ఖేచరీణామ్= దేవతాస్త్రీల యొక్క, కుచేషు= కుచములందలి, మృగమదరసైః=కస్తూరి రసములచే, లిప్యంతే=బాగుగా పూయబడును.

తాత్పర్యము:- నీ మందిరము నలుకు నపుడు జలముతో కూడిన గోమయ మెవరి చేతుల కంటినదో ఆ శివలోకమున కేగిన ఆ నీ భక్తుల చేతులు దేవతాస్త్రీల కుచములందలి కస్తూరి రసములచే పూయబడును.

వివరణము:- శివమందిరమును గోమయముతో నలుకునప్పుడు గోమయ మంటిన చేతులకు ఇంద్రపదవి నొందిన పిమ్మట దేవతాస్త్రీల కుచముల నంటి నప్పుడా కుచముల యందలి కస్తూరీ రసము అంటుకొనునను వాచ్యార్థము వలన శివమందిర లేపనఫలము స్వర్గప్రాప్తిఅని వ్యంగ్యమగు చున్నది. కామో ద్దీపమునకై స్తనములందు కస్తూరి పూసుకొని దేవతాకామినులు అభిసరిం చెదరు అను వస్తువు కూడ వ్యంగ్యమగు చున్నది. ఇంద్రత్వమని చెప్పక భంగ్యంతరముగా త్రిదశనగరీ నాయకత్వమని చెప్పుటచే పర్యాయోక్తాలంకార మేర్పడి యున్నది.

అవతారిక:- పై శ్లోకమున శివ మందిర లేపన ఫలము చెప్పబడినది. ఈ శ్లోకమున పంచామృతాభిషేక మాలా సమర్పణ ఫలము చెప్పబడు చున్నది.

**శ్లో॥ యస్తే కృత్వా స్నపన మమృతైః పఞ్చభి శ్చన్ద్రమౌళే**
**పశ్చా త్కైశ్చి త్కుసుమ నికరై ర్మూర్ధ్ని బధ్నాతి మాలామ్।**
**తస్యావశ్యం సకల భువనైకాధిపత్యేఽభిషిక్తే**
**బధ్నం త్యన్యే శిరసి పరమైశ్వర్య సామ్రాజ్య పట్టమ్॥ 22**

ప్రతిపదార్థము:- చంద్రమౌళే=ఓ చంద్రమౌళీ, యః=ఎవడు, పంచభిః= అయిదు, అమృతైః=అమృతములతో, తే=నీకు, స్నపనమ్=అభిషేకమును, కృత్వా =చేసి, పశ్చాత్=పిమ్మట, కైఃచిత్=కొన్ని, కుసుమనికరైః=పూవుల సమూహముల తో, మూర్ధ్ని=శిరమున, మాలామ్=మాలను, బధ్నాతి=కట్టునో, తస్య=అతనికి, సకల భువనైకాధిపత్యే=సకలలోకాధిపతిత్వము, అభిషిక్తే=అభిషేకింపబడగా, అన్యే= ఇతరులు, శిరసి=శిరమున, పరమైశ్వర్య సామ్రాజ్య పట్టమ్=పరమేశ్వరత్వ సామ్రాజ్య పట్టమును, బధ్నంతి=కట్టెదరు.

తాత్పర్యము:- ఎవడు శివుని పంచామృతములతో అభిషేకించి ఆయన శిరమునకు పూవుల గుంపుల మాలకట్టునో వాని శిరమున సకల భువనాధిపత్యము సామ్రాజ్యాభిషేకము, వాని లలాటమున పరమేశ్వరత్వ పట్టబంధనము చేయ బడును.

వివరణము:- పంచామృతములనగా, పాలు పెఱుగు నేయి తేనె చక్కెర (ఇక్షురసము). ఈ అయిదింటితో శివున కభిషేకము చేసిన వానికి సకల భువనాధి పతిత్వాభిషేకము జరుగును. శివుని శిరమున వివిధములైన పూవుల గుంపులతో

మాల కట్టి శివుని శిరమును అలంకరించిన వాని ఫాలమున పరమేశ్వరత్వ పట్టము కట్టబడును. ముందుగా ఫాలమున ఆతని పదవి పేరును పట్టుగుడ్డపై వ్రాసి ప్రముఖముగా కనబడునట్లుగా ఫాలమునకు కట్టి, పిదప సర్వతీర్థ సముద్రముల సర్వౌషధముల రసము కలపిన జలముతో అభిషేకము చేయుట పట్టాభిషేకము అనబడును. ఇందు పట్టబన్ధన మొక క్రియ, అభిషేకము మరొక క్రియ.

అవతారిక:- పైశ్లోకమున పుష్పమాల శివుని శిరమున బంధించిన వానికి పరమేశ్వరత్వ పట్టము బంధింపబడును అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఏకపుష్ప సమర్పణఫలము కోటి కామప్రాప్తి రూపమని చెప్పబడినది.

శ్లో॥ ఏతచ్చిత్రం క్వచిదపి మయా నైవ దృష్టం శ్రుతం వా
తద్విస్పష్టం కథయ కిమిదం నాథ కౌతూహల మ్మే।
యత్తే భక్త్యా హర చరణయో రర్పితమ్ పుష్పమేకం
సద్య స్సూతే ఫలమభిమతం కోటిశః కామరూపమ్॥ 23

ప్రతిపదార్థము:- ఏతత్=ఈ, చిత్రమ్=చిత్రము, క్వచిత్ అపి=ఎక్కడను, మయా=నా చేత, న ఏవ దృష్టమ్=చూడబడనే లేదు, న ఏవశ్రుతమ్=వినబడనే లేదు, నాథ=ప్రభూ!, తత్=దానిని, మే=నాకు, విస్పష్టమ్=మిక్కిలి స్పష్టముగా, కథయ=చెప్పుము, మే=నాకు, కౌతూహలమ్=కౌతూహలము (ఉన్నది), యత్= అదేమనగా, భక్త్యా=భక్తితో, తే=నీయొక్క, చరణయోః=పాదములందు, అర్పితమ్ =అర్పింపబడిన, ఏకమ్=ఒక, పుష్పమ్=పూవు, సద్యః=వెంటనే, కోటిశః= కోట్ల కొలదిగా, అభిమతమ్=ఇష్టమైన, కామరూపమ్=కామములు అను రూపము కల, ఫలమ్=ఫలమును, సూతే=ప్రసవించును.

తాత్పర్యము:- ఓ ప్రభూ! నీ చరణములందు భక్తితో సమర్పింపబడిన ఒక పుష్పము వెంటనే కోట్ల కొలది కామములు అను ఫలములను ప్రసవించును. ఇట్టి వింత ఎక్కడను నేను చూచి యుండలేదు. విని యుండలేదు, ఈ వింత ఎట్లు జరుగునో తెలిసికొనుట కుతూహలముగా నాకున్నది. కావున నాకు మిక్కిలి స్పష్టముగా చెప్పుము.

వివరణము:- సాధారణముగా ఒక పూవు ఒక ఫలమునే ఫలించును. శివుని చరణములందు సమర్పింపబడిన ఒక పూవు కోట్ల కొలది కామములు అను

ఫలములను ఫలించుట ఒక వింత. మరొక వింత ఏమనగా పూవు పూచిన కొన్ని దినముల పిమ్మట అది ఫలించును. కాని నీ చరణములందు సమర్పింపబడిన పూవు వెంటనే ఫలించును. ఈ వింత లెక్కడ చూచినవి కాని కనీసము విని నవియు కావు. ఈ రహస్యము శివునకే తెలియును. ఆయనయే దానిని స్పష్టీకరించ వలసి యున్నది. కామ శబ్ద మిక్కడ కోరబడిన వస్తువులను అర్థమున ప్రయోగింపబడినది.

అవతారిక:- పై శ్లోకమున ఏక పుష్ప సమర్పణ ఫలము చెప్పబడినది. ఈ శ్లోకమున ఏక పుష్ప దళ విశేష సమర్పణ ఫలము చెప్పబడు చున్నది.

శ్లో॥ యస్తే భక్త్యా వరద చరణ ద్వన్ద్వ ముద్దిశ్య దద్యా
దేకం నీలోత్పలదళమపి త్వత్ప్రసాదేన నూనమ్।
తత్ప్రత్యంగం నిపతతి పున ర్ధ్ర్యష్టతా లోల తారై
ర్దివ్యస్త్రీణాం కువలయ దళ శ్రేణి దీర్ఘైః కటాక్షైః॥ 24

ప్రతిపదార్థము:- వరద=ఓ వరముల నిచ్చువాడా!, భక్త్యా=భక్తితో, చరణ ద్వంద్వమ్=పాదముల జంటను, ఉద్దిశ్య=ఉద్దేశించి, యః=ఎవడు, ఏకమ్=ఒక, నీలోత్పల దళమ్ అపి=నల్లకలువ రేకునైనను, దద్యాత్= ఇచ్చునో, తత్ ప్రత్యంగమ్ =వాని ప్రతి అవయవము నందు, త్వత్ప్రసాదేన=నీ అనుగ్రహము చేత, లోలతారైః =చలించు గుడ్లుకల, దివ్యస్త్రీణామ్=దేవతాస్త్రీల యొక్క, కువలయ దళ శ్రేణి దీర్ఘైః=కలువరేకు వలముల వరుసవలె పొడవైన,కటాక్షైః=క్రీగంటి చూపుల చేత, దృష్టతా=చూడబడుట, నూనమ్=నిశ్చయముగా, నిపతతి=పడును.

తాత్పర్యము:- ఎవడు శివుని పాదముల జంటపై నొక నల్లకలువ రేకును సమర్పించునో శివునను గ్రహము చేత, వాని ప్రతి యవయమును దివ్యస్త్రీల కలువ రేకుల వరుసవలె పొడవైన క్రీగంటి చూపులు పడును.

వివరణము:- కువలయ మొక పుష్ప విశేషము. అది చంద్రోదయమున వికసించునది అని కవి సమయము. కలువలలో తెల్లనివి, ఎఱ్ఱనివి, నల్లనివి ఉండును. స్త్రీల కన్నులను నల్లని కలువలతో కవులు పోల్చు చుందురు, వాని రేకులతో కూడ పోల్చు చుందురు. చెవుల దాకు నయనములు ఉత్తమ స్త్రీల కుండును. అనగా ఆ కన్నులు మిక్కిలి పొడవైనవి. దేవతాస్త్రీలు ఉత్తమ స్త్రీలు

గదా! వారి క్రీగంటి చూపులు రేకుల వరుసయంత దీర్ఘములుగా నున్నవని ఈ శ్లోకమున చెప్పబడినది. కావున ఈ శ్లోకమున లుప్తోపమాలంకార మున్నది. ఉత్తమ స్త్రీల కన్నులు సహజముగానే సుందరములైనవి. వానిలోని గుడ్లు తిరుగు చున్నచో (అవి లోలతరము లైనచో) వాని అందము ద్విగుణీకృతము అగును. అట్టి చూపుల చేత చూడబడు అదృష్టము ఒక్క నల్లకలువ రేకును సమర్పించిన భక్తునకు కలుగుటలో శివానుగ్రహ మెంత గొప్పదో వ్యంజింపబడు చున్నది.

అవతారిక:- పై శ్లోకము ఒక కువలయ దళ సమర్పణ ఫలము చెప్పబడినది. ఈ శ్లోకమున కదంబ పుష్ప సమర్పణ ఫలము చెప్పబడు చున్నది.

శ్లో॥ కృత్వా మాలాం ఘన పరిమలోద్గారి ధారా కదమ్బై
ర్యస్తే కణ్ఠాభరణ పదవీమ్ ప్రాపయే న్నీలకణ్ఠ।
దివ్యస్త్రీణాం విపుల పులకై ర్బాహుభిః కణ్ఠలగ్నై
స్తస్యాపి త్వం వితరసి చిరం నిర్భరాశ్లేష కణ్ఠమ్॥ 25

ప్రతిపదార్థము:- ఘనపరిమలోద్గారి ధారా కదంబైః=గొప్ప సుగంధమును జిమ్ము ధారా కదంబపుష్పములతో, మాలామ్=హారమును, కృత్వా=చేసి, యః= ఎవడు, తే=నీ యొక్క, కణ్ఠాభరణ పదవీమ్=కంఠాభరణస్థానమును, ప్రాపయేత్= పొందించునో, తస్యఅపి=అతనికిని, నీలకంఠ=ఓ నీల కంఠుడా!, దివ్యస్త్రీణామ్= దేవతా స్త్రీల యొక్క, విపుల పులకైః=అధిక పులకాంకురములుగల, బాహుభిః= బాహువులతో, చిరమ్=చిరకాలము, నిర్భరాశ్లేష కంఠమ్=గాఢమైన కంఠా లింగమును, వితరసి=ఇచ్చెదవు.

తాత్పర్యము:- గొప్ప సుగంధమును విరజిమ్ము కదంబ పుష్పములతో హారమును కట్టి ఎవడు శివుని కంఠము నలంకరించునో వాని కంఠమును దివ్య స్త్రీలు తమ పులకిత బాహువుల గాఢముగా కౌగలించుకొను అదృష్టమును శివుడు కలిగించును.

వివరణము:- శివుడు నీలకంఠుడు. ఆతని కంఠమునకు గౌరీ దేవి నిర్భరాశ్లేష మలంకారము. అయినను భక్తులిచ్చు కదంబ పుష్పముల మాల శివున కెక్కువ ఇష్టము. గౌరీదేవి కదంబ కుసుమ ప్రియ. శివుని అర్ధశరీరము ఆమె కావున భక్తుడిచ్చు కదంబముల మాలపై శివునకు అంతప్రేమ. ఆమె పులకిత బాహువుల

ఆలింగనము యొక్క సౌఖ్యము శివుని కంఠమునకు తెలియునని నీలకంఠ అను సంబోధనముచే వ్యంగ్యమగు చున్నది. గౌరీ బాహువులా శివుని నీలమైన కంఠమున మేఘము నందలి మెఱుపు తీగలవలె మెరియును. లేదా అప్పుడా బాహువులు కదంబ పుష్పముల వన్నె కలిగిన అమ్మవారి అవయవముల కాంతినే వెలార్చును. భక్తుడిచ్చు కదంబ పుష్పముల మాలను ధరించిన శివునకా స్మృతి కలిగి మిక్కిలి ఆనందమును కలిగి భక్తునకును దేవతా స్త్రీల పులకిత బాహువుల స్వయంగ్రహ పరిష్వంగమునకు నోచుకొన్న కంఠమును ప్రసాదించును. ధారా కదంబ శబ్దము కదంబ విశేషమును బోధించు నేమో? లేక కదంబ మాల కదంబ పుష్పముల ధార శివుని కంఠమున పడుచున్నట్లుండ వచ్చును. గౌరీ శరీరము కదంబ పుష్ప పరిమలమును చిమ్ముచుండుటచే శివునకు కదంబ పుష్పమాలా సమర్పణము అంత ప్రియమగునేమో! విపుల పులక అను శబ్దమున ఛేకాను ప్రాసమను శబ్దాలంకార మున్నది.

అవతారిక:- పై శ్లోకమున కదంబ పుష్పమాలా సమర్పణ ఫలము చెప్పబడినది. ఈ శ్లోకమున సాష్టాంగ నమస్కార ఫలము చెప్పబడు చున్నది.

శ్లో॥ కృత్వా పూజాం తవ చరణయో రాదరా దష్టమూర్తే!
యస్సాష్టాఙ్గమ్ ప్రణమతి మహీ పృష్ఠ పీఠే లుఠిత్వా।
ప్రత్యాసన్నం క్షిపతి చ పదమ్ ప్రీతి బన్ధానురాగం
తస్యోత్సఙ్గే లుఠతి ధరణీ రేణు చక్రచ్ఛలేన॥ 26

ప్రతిపదార్థము:- అష్టమూర్తే=అష్టమూర్తులు గలవాడా!, తవ=నీ యొక్క, చరణయోః=చరణములందు, ఆదరాత్=ఆదరము వలన, పూజామ్=పూజను, కృత్వా=చేసి, యః=ఎవడు, మహీపృష్ఠపీఠే=భూమి యొక్క వీపు అను పీఠమున, లుఠిత్వా=పొరలి, సాష్టాంగమ్=ఎనిమిది అవయవములతో, ప్రణమతి= నమస్కరించునో, తస్య=అతనికి, ప్రత్యాసన్నమ్=సమీపముగా, క్షిపతి=ఉంచునో, ప్రీతి బన్ధానురాగమ్=ప్రీతి బన్ధానురాగము కల, పదమ్=అడుగును, తస్య=అతని యొక్క, ఉత్సంగే=తొడపైన, ధరణీ=భూమి, రేణుచక్రచ్ఛలేన=దుమ్ము యొక్క చక్రము అను మిషతో, లుఠతి=పొరలును.

తాత్పర్యము:- అష్టమూర్తి చరణములందు పూజానంతరము భూమి మీద పొరలి ఎవడు సాష్టాంగ నమస్కారము చేసి నిలుచునో వాని దగ్గఱ వాని తొడపై

భూమి రేణు చక్రము అను మిషతో పొరలును.

వివరణము:- ప్రాణులకెన్నో అవయవము లున్నవి, అవి యన్నియు పంచ భూతములతోడనే ఏర్పడినవి. ఆ ప్రాణులలో పంచభూతములు మనో బుద్ధ్య హంకారము లున్నవి. ఒక విధముగా వీనిని జీవుల అష్టమూర్తులని చెప్ప వచ్చును. ఈ పంచభూతములు సూర్యచంద్రులు(బుద్ధిమనస్సులు) అహంకారము లేక ఆత్మ అనునవియే ఆ శివునకు అష్టమూర్తులు. పంచీకృతములైన భూతము లచే జీవుని శరీరము నిర్మితమైనది. అపంచీకృత వాయువులే ప్రాణములు. ఇంద్రియములును అపంచీకృత భూతములనుండియే యేర్పడినవి. అపంచీకృత పంచభూతములు శివుని అష్టమూర్తులలో నున్నవి. వానితోపాటు సూర్య చంద్రులు (బుద్ధి మనస్సులు) అహంకారము లేక ఆత్మ శివుని అష్టమూర్తులు. అష్టమూర్తిని అష్టాంగములతో నమస్కరించుట ఉచితము. ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యామ్ ప్రణమోఽష్టాంగ ఉచ్యతే= ఱొమ్ము, శిరస్సు, చూపు, మనస్సు, వాక్కు, పాదములు, పాణులు, చెవులు వీనితో నమస్క రించుట సాష్టాంగ నమస్కారము అనబడును. ఈ అష్టాంగములు అష్టమూర్తుల లోనివే. సాష్టాంగ నమస్సు నొనరించుట యనగా భూమిపై పడి దొరలుట. అట్లు పూజానంతర మొనరించిన వాని దగ్గఱ భూదేవి ప్రియురాలి వలె సమీపము నందు నిలచును. అనగా ఆ భక్తునకు సార్వభౌమత్వము కలుగును. ఆతని తొడపై భూమి రేణు చక్రము యొక్క మిషతో కూర్చొనుట మప్పుడు జరుగును. ఆతడు బ్రహ్మాండ శరీరుడైనప్పుడు బ్రహ్మాండమున భూమి రేణుతుల్యమే కదా. బ్రహ్మాండ శరీరుడైన భక్తుని తొడపై భూమి రేణు తుల్యమై పొరలాడును ఇది ఒక విధము శివసారూప్యసిద్ధియే.

అవతారిక:- పై శ్లోకమున సాష్టాంగ నమస్కార ఫలము చెప్పబడినది. ఈ శ్లోకమున దీపసమర్పణ ఫలము చెప్పబడు చున్నది.

శ్లో॥ త్వాముద్దిశ్య త్రినయన జనో యః ప్రదీపం దదాతి
జ్యోతి ర్జ్వాలా దళిత తిమిరం ద్యోతితాన్త ర్నికేతమ్।
తస్మై మాయా రజని విలస ద్గాఢ మోహాన్ధకార
చ్ఛేద ప్రౌఢం త్వమపి దిశసి జ్ఞాన మాత్మ ప్రకాశమ్॥ 27

ప్రతిపదార్థము:- త్రినయన=ఓ ముక్కంటీ, యః=ఏ, జనః=జనుడు, త్వామ్=

నిన్ను, ఉద్దిశ్య=ఉద్దేశించి, జ్యోతిర్జ్వాలా దళిత తిమిరమ్=జ్యోతి యొక్క జ్వాలచే చీల్చబడిన చీకటి గల, ద్యోతితాంత ర్నికేతమ్=వెలిగింపబడిన లోపలి గృహము గల, ప్రదీపమ్=మంచి దీపమును, దదాతి=ఇచ్చునో, తస్మై=అతని కొఱకు, త్వమ్ అపి=నీవును, మాయా రజని విలసద్గాఢ మోహాన్ధకారచ్ఛేద ప్రౌఢమ్=మాయ అను రాత్రియందు ప్రకాశించు తీవ్రమైన మోహమను అన్ధకారము యొక్క వినాశమందు ప్రౌఢమైన, ఆత్మ ప్రకాశమ్=ఆత్మ ప్రకాశము అనెడు, జ్ఞానమ్= జ్ఞానమును, దిశసి=ఇచ్చును.

తాత్పర్యము:-చీకటిని చీల్చగల జ్వాలతో లోపలి గర్భ గృహమును వెలిగింపగల దీపము నెవడు శివుని గూర్చి ఇచ్చునో వానికా శివుడు మాయ యను రాత్రి యందు ప్రకాశించుచున్న గొప్ప మోహమను అన్ధకారమును ఛేదించు ప్రౌఢిమ గల ఆత్మ ప్రకాశమనెడి దీపము నిచ్చును.

వివరణము:- మాయయందు రాత్రిత్వారోపము, మోహమందు అన్ధకారత్వా రోపము, ఆత్మ ప్రకాశము నందు దీపత్వారోపము నుండుటచే నిందు రూపకాలం కార మేర్పడి యున్నది. శివుని గర్భాలయమందలి చీకటిని తొలగించుచు దానిని వెలిగించు దీపమువలె, మాయ యందలి మోహమును ఆత్మ ప్రకాశము తొలగించును అను ఔపమ్యము వ్యంగ్యము.

అవతారిక:- పై శ్లోకమున ప్రదీప దాన ఫలము చెప్పబడినది. ఈ శ్లోకము న శివుని స్తుతి ఫలము చెప్పబడు చున్నది.

**శ్లో॥ చిత్రై ర్మాలా రచిత కుసుమై ర్ధూర్జటే పూజయిత్వా**
**యః స్తౌతి త్వాం జయజయ మహాదేవ దేవేతి వాచా।**
**సోఽప్యారోహన్ హర తవపురే మౌళి బద్ధాఞ్జలీనాం**
**శక్రాదీనాం స్తుతి విషయతాం త్వత్ప్రసాదాత్ ప్రయాతి॥28**

ప్రతిపదార్థము:- ధూర్జటే=ఓ ధూర్జటీ (జటా భారముగలవాడా!), హర= ఓ హరా!, చిత్రైః=పలురంగులు కల, మాలారచిత కుసుమైః=మాలగా కూర్చబడిన పూవులచేత, త్వామ్=నిన్ను, పూజయిత్వా=పూజించి, మహాదేవ=మహాదేవుడా, దేవ=దేవా!, జయ=సర్వోత్కర్షముగా వర్ధిల్లుము, జయ=సర్వోత్కర్షముగా వర్ధిల్లుము, ఇతి=అను, వాచా=వాక్కుతో, యః=ఎవడు, స్తౌతి=స్తుతించునో, సః

అపి=వాడును, తవ= నీ యొక్క, పురే=పురమునందు, ఆరోహన్=ఎక్కుచు, మౌళిబద్ధాంజలీనామ్=శిరమున బంధింపబడిన దోసిళ్ళుగల, శక్రాదీనామ్= ఇంద్రాదుల యొక్క, స్తుతి విషయతామ్=స్తోత్రమునకు విషయమగుటను, త్వత్ప్రసాదాత్=నీ అనుగ్రహము వలన, యాతి=పొందును.

తాత్పర్యము:- పలురంగుల మాలలుగా కూర్చబడిన పూలతో శివునెవడు "మహాదేవ దేవ జయ జయ" అను వాక్కులతో స్తుతించునో, వాడు కైలాస పర్వతము నధిరోహించుచు ఇంద్రాదుల స్తోత్రములకు పాత్రుడగును.

వివరణము:- శివుడు ధూర్జటి అనగా బరువైన జడలు కలవాడు. శివుని జడల భారము కపర్దము అని పిలువబడును. ధూర్జటి శబ్దము కపర్ది శబ్దార్థమును బోధించును. దోసిటితో పూల మాలను ధరించి శివుని శిరసుపై నున్న ఆయన జడలతో చుట్టుట అను ఉపచారమును సమర్పించుట అను పూజ చేసి శివుని మహాదేవ దేవ జయజయ అను వాక్కులతో స్తుతించు వానిని ఇంద్రాదులు కూడ ఆ విధముగా శిరముల దోసిళ్లొగ్గి స్తుతించెదరు. ఇట్టి అనుగ్రహమును శివుడు వానిపై వర్షించును. ఇదియే శివుని దేవత్వము మహాదేవత్వము. అది దాదాపు భక్తునకు ప్రసాదింపబడినట్లైనది.

అవతారిక:- పై శ్లోకమున శివస్తుతి ఫలము చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని విచిత్ర చేష్టలు చెప్పబడు చున్నవి.

శ్లో॥ భస్మస్నానం వపుషి శిరసి స్వర్ధునీవారి భారం
శాన్తా మ్మూర్తిం కలయసి కరే కార్ముకం యుక్త మేతత్।
అప్యన్యేషాం కతిపయ పురస్వామినాం చిత్రభూతా
శ్చేష్టా దృష్టా స్త్రి భువన పతేః కిమ్ మహేశస్య న స్యుః॥ 29

ప్రతిపదార్థము:- వపుషి=శరీరమునందు, భస్మస్నానమ్=బూడిదపోతను, శిరసి=శిరమున, స్వర్ధునీ వారి భారమ్=గంగాజలము యొక్క మోతను, శాంతామ్ =శాంతమైన, మూర్తిమ్=ఆకృతిని, కరే=చేతియందు, కార్ముకమ్=వింటిని, కలయసి=ధరించెదవు, ఏతత్=ఇది, యుక్తమ్=తగినదే, అన్యేషామ్=ఇతరులైన, కతిపయ పురస్వామినామ్ అపి=కొన్ని నగరముల ప్రభువుల యొక్కయు, చిత్ర భూతాః=చిత్రములైన, చేష్టాః=చేష్టలు, దృష్టాః=చూడబడినవి, త్రిభువనపతేః=

ముజ్జగమునకు ప్రభుడైన, మహేశస్య=మహేశ్వరునకు, కిమ్=ఏల, న స్యుః= ఉండవు.

తాత్పర్యము:- ఒంటిపై బూడిద పోసికొనుట, శిరమున ఆకాశగంగాజల భారమును ధరించుట, శాంతమైన ఆకృతిని ధరించుట, చేతవింటిని ధరించుట ఇవి శివుని విచిత్ర చేష్టలు. కొన్ని నగరముల కౌలికులైన వారిలో ఇట్టివేయైన వింత చేష్టలు చూడబడినవే కదా! సర్వలోకప్రభుడైన శివున కట్టి వేల ఉండ కుండును.

వివరణము:- చితి బూడిద గాలికి కొట్టుకొని వచ్చి శరీరముపై బడినను శ్రోత్రియులు స్నానము చేయుదురు. శివుడేమో కావలెనని బూడిదను ఒంటి మీద గ్రుమ్మరించు కొన్నాడు. ఇట్లెవరును చేయరు. ఇది ఒక విచిత్ర చేష్ట ఎవరైన అవసరమైనప్పుడు నీటిని మోసికొని వచ్చుట కలదు. రాత్రింబవళ్ళు నీటి కుండను మోయు చుండరు. శివుడు మాత్రము తన శిరసుపైని జల భారమును దింపనే దింపడు. ఇది మరొక విచిత్ర చేష్ట. నెత్తిమీద నీళ్ళు మోయుట లో కొంత కొంత జలము తొణికి ఒంటి మీద పడును. ఆ నీళ్ళుమోసి తెచ్చు కొనుట స్నానము కొఱకే యైనచో వానినే ఒంటి మీద గ్రుమ్మరించుకొని స్నానము చేయవచ్చును. లేక ఒంటి మీద తొలినాటి అంగరాగమేదైన శరీరమున కంటుకొని యున్నచో దానిని తొలగించు కొనుటకు స్నానము చేయవచ్చును. స్నానము చేయలేని వార్ధకమున కొందఱు శ్రోత్రియులు ముందుగా భస్మ స్నాన మొనరించి అనగా భస్మమును తడిపి ఒంటికి పూసికొని కొంచె మెండ మెండయినప్పుడు స్నానము చేయుదురు. శివుడట్లు చేసి యుండ వచ్చును. విచిత్ర చేష్టల చేయవలెనని బూడిద పూసుకొనలేదు అని చెప్పవచ్చును. విచిత్ర చేష్టలు చేసి బిచ్చమెత్తుకొనువారి ఆకృతి ఇంత శాంతముగా నుండదు. ఇంత శాంతమైన ఆకృతిగలవాడు వికృత చేష్టలతో లోకులకు నవ్వు పుట్టించి వారి నుండి బిచ్చము గ్రహించుట కిట్లు చేసినాడనుట సముచిత మనిపించుట లేదు. కొందఱి చేష్టల వికృత చేష్టలని భావించిన భావించెదరు గాక. నడమంత్రపు సిరి బట్టిన కతిపయ నగర ప్రభువులిట్టి వికృత చేష్టల చేయుట లోకమున చూచుచునే యున్నాము. అనాది కాలము నుండి సర్వలోకములకు ప్రభువైన మహేశ్వరుని ఈ చేష్టలు వికృతముగా కొందఱకు తోచునేమో? అవి వికృత చేష్టలని అంగీకరించినను ఆయనకు దోషము నాపాదింప జాలవు. కతిపయ నగరాధీశులే ఇట్లు చేయు

చుండగా సర్వలోక ప్రభువిట్లు చేసిన దోసమేమి. సరే చేత ధనువు దాల్చుట యేమి? అది శాంతాకృతికి గాని, బిచ్చ మెత్తుకొనుటకు వికృత చేష్టల చేయువారికి గాని, ఆధిపత్యగర్వమున వికృత చేష్టల చేయువారికి గాని, ఉచితము కాదు. చేత ధనువు ఉండనక్కఱ లేదు. ఒక వేళ తన నగరముల దురాక్రమణ చేయుట కెవరైన శత్రువులు వత్తురేమో యని భయపడు వారు ఎదిటి వారికి భయము పుట్టించుట కొఱకు ధనుర్ధారణము చేసిన చేయుదురు గాక. సర్వలోకాధిపతి యైన శివున కా ఆవశ్యకత లేదు. ఇది నిజముగా శాంతాకృతికి విరుద్ధముగా నొనర్చిన వింత చేష్టయే. ఆ చేష్టల తాత్పర్యము నెఱుగుట కస్మదాదుల అల్పబుద్ధి చాలదు.

అవతారిక:- పూర్వ శ్లోకమున మహాదేవ అని వాక్కుతో స్తుతించు వారికి ఇంద్రాది స్తుతి పాత్రత కల్గునని చెప్పబడినది. ఈ శ్లోకమున మహాదేవ శబ్దము చేతనే శివుడు ముఖ్యముగా వాచ్యుడని చెప్పబడు చున్నది.

శ్లో॥ త్వామారాధ్య త్రిదశపతయో భుఞ్జతే రాజ్యలక్ష్మీమ్
భిక్షాభు క్త్వం తదపి చ మహాదేవ శబ్దైక వాచ్యః।
నైరాశిష్యం వరద పరమైశ్వర్య కోటి ప్రతిష్ఠం
తచ్చే దస్తి త్వయి కిమపరైః ఫల్గుభిః శ్రీ విలాసైః॥ 30

ప్రతిపదార్థము:- వరద=ఓ వరముల నిచ్చువాడా!, త్వామ్=నిన్ను, ఆరాధ్య=ఆరాధించి, త్రిదశపతయః=దేవతలు, రాజ్యలక్ష్మీమ్=రాజ్యలక్ష్మిని, భుంజతే=అనుభవించెదరు, త్వమ్=నీవు, భిక్షాభుక్=భిక్షము ననుభవించువాడవు, అపిచ=మరియు, తద్=అందువలన, మహాదేవ శబ్దైక వాచ్యః=మహాదేవశబ్దముచే ముఖ్యముగా చెప్పదగిన వాడవు, నైరాశిష్యమ్=కోరిక లేకుండుట, పరమైశ్వర్య కోటి ప్రతిష్ఠమ్=పరమైశ్వర్యకోటిలో చేర్చబడినది, త్వయి=నీ యందు, తత్=అది, అస్తి చేత్=ఉన్నచో, అపరైః=ఇతరములైన, ఫల్గుభిః=నిస్సారములైన, శ్రీ విలాసైః=లక్ష్మి విలాసములతో, కిమ్=ఏమి?

తాత్పర్యము:- దేవేంద్రాదులు నిన్నారాధించి రాజ్యలక్ష్మి ననుభవించెదరు. నీవో భైక్ష్యాన్నము ననుభవించెదవు. అయ్యును అందువలన మహాదేవ అని పిలువబడు చున్నావు. పరమైశ్వర్య మనునది కోరిక లేకుండుటయే అని యున్నచో

ఇతర నిస్సారలక్ష్మీ విలాసముతో నేమి?

వివరణము:- త్రిదశులనగా దేవతలు, వారికి బాల్య యౌవన కౌమారదశలే కాని వార్ధక దశ ఉండదు. అందువలన దేవతలకు త్రిదశనామ మేర్పడినది. త్రి అనగా మూడు, దశ అనగా పది. ముప్పది యేండ్ల వారి వలెనే దేవతలు నిత్య యౌవనులై యుందురు. అందువలన వారు త్రిదశులు. ఈ రెండవ అర్థమే సముచితము. దేవతలందఱకు మనుష్యుల పైన తదితర జీవకోటిపైన ప్రభుత్వ ముండును. అందుచే దేవతలందఱు పతులే. త్రిదశపతులు అను శబ్దమును త్రిదశులు మరియు పతులు అను రీతిగా విగ్రహవాక్యమును చెప్పవలెను. సాధారణముగా త్రిదశపతి శబ్దము ఇంద్రునే బోధించును. ఈ శ్లోకమున అది బహువచనమున నుండుటచే ఆ యర్థము కుదురదు. ఇంద్రుడొక్కడే గదా లేక బ్రహ్మ విష్ణువు ఇంద్రుడను దేవతలకు పతులే కావున త్రిదశపతయ అను శబ్దము బ్రహ్మేంద్రులను బోధించు ననవలెను. ఈ రెండవ పక్షము సముచితము గా నున్నది. ఆ విష్ణు బ్రహ్మేంద్రులకు రాజ్యలక్ష్మ్యనుభవ మున్నను, శివునకు భిక్షాన్నానుభవమే ఉండినను వారును మహాదేవులు కారు. శివుడే మహాదేవుడు. వారు కోరిన రాజ్యలక్ష్మి శివానుగ్రహముననే వారికి కలిగినది. కావున వారు మహాదేవ శబ్దవాచ్యు లెట్లగుదురు. ఆ శబ్దము ముఖ్యముగా శివునే బోధించును. విష్ణు బ్రహ్మేంద్రులు గొప్ప రాజ్యములకు ప్రభువులయినను (రాజ్యలక్ష్మి ననుభవించుట యనగా రాజ్యములకు ప్రభువులగుటయే) వారు భిక్షుకులే. ఇంకను గొప్ప గొప్ప పదవుల కొఱకు వారు నిన్నారాధించుచునే యున్నారు. ఇంద్రుడు స్వర్గాధిపత్యముతో తృప్తి నొందక బ్రహ్మత్వమును, బ్రహ్మ సత్య లోకాధిపత్యముతో తృప్తినొందక విష్ణుత్వమును, విష్ణువు వైకుంఠాధి పత్యముతో తృప్తి నందక కైలాసాధిపత్యమును భిక్షించుచునే ఉన్నారు. నీవు భిక్షాన్నముతో తృప్తి నందినాడవు.ఎట్టి కోరిక లేని వాడవు. కనుక నైరాశిష్యము (కోరిక లేకుండుట) నీ కున్నది. గొప్ప ఐశ్వర్యమున ఉన్నవారు, తమ ఐశ్వర్యములతో తృప్తి నందక అంతకు మించిన ఐశ్వర్యము కోరినచో, అనగా భిక్షించినచో వారు భిక్షుకులే. వారికి పరమేశ్వరత్వము లేదు. కోరిక లేకుండుట (నైరాశిష్యమే) పరమేశ్వరత్వము. పరమేశ్వరత్వకోటిలో ప్రవేశించినది నైరాశిష్యమే. కావున అది కలవాడే పరమేశ్వరుడు. కావున శివుడే పరమేశ్వరుడు. ఎన్ని ఉన్నను ఇంకను కోరుకొను వాడు భిక్షుకుడు. దరిద్రుడు. ఏమి ఉన్నను లేకున్నను కోరిక లేనివాడే

పరమేశ్వరుడు. కోరిన వారికి తనకడ నున్నదేదైన ఇచ్చువాడు శివుడొక్కడే. కైలాసాధిపత్యమును కూడ శివుడు కుబేరున కిచ్చి వైచినాడు. అన్ని లోకాధిపత్యములు తనవే ఐనను స్వర్గాధిపత్యమును ఇంద్రుడు కోరగా నాతనికి, సత్యలోకాధిపత్యమును బ్రహ్మ కోఱగా ఆతనికి, వైకుంఠాధిపత్యమును విష్ణువు కోఱగా ఆతనికి ఇచ్చి వైచితివి. అన్ని ఈయగల నీవు పరమేశ్వరుడవు గాని ఉన్న దానిని కూడ కోరిన వారి కనుగ్రహింపలేని ఇతరుల ఐశ్వర్యము ఉన్నను లేనిదే అగుచున్నది. వారు ఈశ్వరులే కారు. పరమేశ్వరత్వము వారి కెక్కడిది? కోరిన వారి కోరిక తీర్పగలుగుట పరమేశ్వరత్వము. తనకు కోరికలుండి వానికై యత్నించువాడేమి దేవుడు, వాడు భిక్షుకుడే. కోరిక లేని వాడే మహాదేవుడు. బ్రహ్మేంద్రాదులు నెవని నారాధించి తమ కోరిక తీర్చుకొను చుందురో ఎవనికి పరమేశ్వరత్వమని చెప్పదగిన నైరాశిష్యమున్నదో వాడే మహాదేవ శబ్దవాచ్యుడు. కోరికలేని యాతనికి నిస్సారములైన శ్రీ విలాసములతో అనగా సంపదలతో నేమి పని?

అవతారిక:- పూర్వ శ్లోకమున శివుని భస్మస్నానము గంగాధారణము చెప్పబడినది. ఈ శ్లోకమున భస్మాంగరాగము మొదలగు మరికొన్ని విచిత్ర చేష్టలు చెప్పబడు చున్నవి.

శ్లో॥ అస్థిగ్రన్థిః పితృవనభవమ్ భస్మ భూషాఙ్గరాగః
ప్రీతిః ప్రేతై స్సహ సహచరాః ఫేరవః కోఽత్ర దోషః।
యస్యైశ్వర్యమ్ పరమ పదవీమ్ ప్రాప్య విశ్రాన్త ముచ్చై
స్తస్య గ్రావా కనక మథవా సర్వ మేతత్ సమానమ్॥ 31

ప్రతిపదార్థము:- పితృవనభవమ్=శ్మశానములోనున్న, అస్థిగ్రన్థిః=ఎముకల హారము, భస్మ=భస్మము, భూషా=సొమ్ము, అంగరాగః=మైపూత, ప్రేతైఃసహ= ప్రేతములతోడిది, ప్రీతి=ప్రేమ, సహచరాః=కలసితిరుగునవి, ఫేరవః=నక్కలు, అత్ర=ఈ విషయమున, దోషః=దోషము, కః=ఏమి, యస్య=ఎవని యొక్క, ఐశ్వర్యమ్=ఐశ్వర్యము, పరమ పదవీమ్=గొప్ప పదవిని, ప్రాప్య=పొంది, ఉచ్చైః= పైన, విశ్రాంతమ్=విశ్రమించినదో, తస్య=అతనికి, గ్రావా=ఱాయి, అథవా=లేక, కనకమ్=బంగారము, ఏతత్=ఇది, సర్వమ్=అంతయు, సమానమ్=సమానము.

తాత్పర్యము:- ఎముకల హారము నీకు భూషణము. శ్మశానములో నున్న

భస్మము మైపూత. ప్రేతలయందు ప్రీతి, నక్కలతో సాహచర్యము, ఇత్యాదులలో దోష మేమున్నది. ఎవని ఐశ్వర్యము పరమ పదవినొంది దానిపైన విశ్రమించి యున్నదో వానికి ఊయిగాని బంగారము గాని అంతయు సమానమే.

వివరణము:- గ్రన్థియనగా ముడి. కొన్ని ప్రాంతములలో కొన్ని వస్తువుల గుడ్డలో కట్టిన మూటను ముడి అందురు. అట్లే లోనుండి గ్రుచ్చిన దారము ముడి వేయనిదే మణులు గాని పూవులు గాని హారముగా మారవు. అందువలన ఇచట గ్రన్థిశబ్దము హారము అను అర్థము నిచ్చును. ఎముకలు గ్రుచ్చిన పేరు శివునకు అలంకారము. అనగా శివుని కంఠమునకు భూషణము. అట్లే శ్మశానములో దొఱకు బూడిద శివుని ఒంటికి అంగరాగము. మై పూత. శివునకు ప్రేతముల యందు ప్రీతి కావున శివుడు శ్మశానములో తిఱుగు చుండును. శ్మశానములలో శవముల ఎముకలకై తిరుగు నక్కలు శ్మశానమున తిరుగు శివునకు తోడుగా నుండును. శ్మశానమున తిరుగువానికి సహచరు లెవ్వరుందురు. నక్కలు శివునకు సహచరులు లేనిలోటును తీర్చినవి. ఈ అమంగళముల శివుడాదరించుటలో కవి కేదోషము కనబడలేదు. అందుకే అత్ర కఃదోషః ఇందేమి దోషమున్నదని ప్రశ్నించు చున్నాడు? శివుడు పరమ పదనాథుడు. పరమపదమునే పొందిన వారి కింకేమి ఐశ్వర్యము కావలయును. ఐశ్వర్యమే ఆ పదవిని పొంది దానిపైన విశ్రమించి యున్నది. అట్లుండగా ఆతనికి ఊయియు బంగారము అన్నియు సమానముగానే తోచును. కావున అమంగల వైముఖ్య మాతనికి లేదు. ఐశ్వర్య మింకను కావలెనని కోరుకొను వారు అమంగలములైన పితృవన భస్మాదులను స్పృశింపరు. శివునకు కావలసిన మరొక ఐశ్వర్యము లేదు. కావున ఐశ్వర్యము పరమ పదనాథుడైన శివుని పొంది నిలచిపోయినది. అనగా శివుని మించిన పరమేశ్వరుడు మరొకడు లేడు అనుట అట్టి పరమేశ్వరునకు అంతయు మంగలము. ఆ మంగలములు అమంగలములు అన్నియు స్వస్వరూపములే కావున హేయోపాదేయము లాతనికి లేవు. సాధారణ జనులకు మంగల ముపాదేయము. అమంగలము హేయము. ఊయి హేయము, బంగారము ఉపాదేయము. కాని శివునకు తన ఒక చేతనున్న బంగారు కొండను, మరొక చేతనున్న కపాలము(ఎముకలపుఱ్ఱె)ను సమానముగానే చూచును. లోకులు బ్రతికిన వారియందు ప్రీతి కలిగి యుందురు. శివునకు చచ్చిన శవములందు

ప్రీతి యున్నది. గతాసూన్ అగతాసూంశ్చ నాను శోచంతి పండితాః పండితులు తాము ప్రేమించుటకు వీరు చచ్చిన వారా? బ్రతికియున్నవారా? అని ఆలోచించరు. ఆలోచించినను చచ్చిన వారికొఱకై ఏడ్వరు. ఇంకను చావలేదేమి యని బ్రతికియున్న వారి కొఱకును ఏడ్వరు. అన్నిటిని సమానముగా చూచి ఆనందింతురు. సాధారణముగా నక్క లమంగలములని భావించి లోకులు వానికి దూరముగా నుందురు. తెలుగు వారికి నక్కల యందంత అసహ్యత లేదు. పైగా నక్కను తొక్కి వచ్చినావా? అని లాభము పొందిన వాని నడుగుదురు. అది శుభశకునమని వారి అభిప్రాయము. తెలుగు వారు త్రిలింగ దేశభవులు గదా! అందుచేత వారికి శైవాభిమానము (శివునికి వలె నక్కలపై అసహ్యత లేకుండుట) ఉన్నది. నక్కకు శివా అని పేరున్నది. దాని యందలి అభిమానము శైవాభిమానమే. నక్కలు మోసము చేయును. కావున వానిని సాధారణు లసహ్యించు కొందురు. సర్వసముడైన శివుడు మోసము చేయువారిపైనను సమభావమునే కలిగియుండును. మోసము చేయు నక్కలు శివునకేమి మోసము చేయగలవు? మోసము చేసి ఆయన జ్ఞాన స్వరూపము నపహరింపగలవా! ఒక వేళ అట్లవి చేయగలుగునేని శివునికి వారియందు సమభావము పెంపొందును. జ్ఞానస్వరూపుడైన శివున కంతయు జ్ఞానమే. అందఱు జ్ఞాన రూపులే. స్వస్వరూపులే.

అవతారిక:- పై శ్లోకమున శివునకు పితృవన భవ భస్మ అంగరాగమని చెప్పబడినది. ఈ శ్లోకమున పిత ృవనము నివాసమని చెప్పబడు చున్నది.

శ్లో॥ ఆవాస స్తే పితృవన మహిః క్రీడనం యాన ముక్షా
భిక్షాపాత్రం హర! నరశిరః ఖర్పరం నైష దోషః।
ఆరాధ్యో య స్త్రినయన! భవ త్యల్పసంస్థో2పి లోకే
నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః॥ 32

ప్రతిపదార్థము:- హరః=ఓ హరుడా!, త్రినయన!=ఓ ముక్కంటీ!, తే=నీకు, ఆవాసః=నివాసము, పితృవనమ్=శ్మశానము, క్రీడనమ్=ఆట వస్తువు, అహిః= సర్పము, యానమ్=వాహనము, ఉక్షా=ఎద్దు, భిక్షా పాత్రమ్=భిక్షాపాత్రము, నరశిరఃఖర్పరమ్=మనుష్యుని తలపుఱ్ఱె, ఏషః=ఇది, న దోషః=దోషము కాదు, లోకే=లోకమునందు, యః=ఎవడు, అల్పసంస్థః=అల్పస్థితి గలవాడో, సఃఅపి= వాడుకూడ, ఆరాధ్యఃభవతి=పూజనీయు డగును, నిస్త్రైగుణ్యే=త్రిగుణముల

కతీతమైన, పథి=మార్గమునందు, విచరతామ్=తిరుగువారికి, విధిః=విధి, కః=ఏది, . నిషేధః= నిషేధము, కః=ఏది?

తాత్పర్యము:- ఓ ముక్కంటీ!, నీ నివాసము శ్మశానము, నీ ఆట వస్తువు సర్పము, నీ వాహనము ఎద్దు, నీ భిక్షాపాత్రము మనుష్యుని తలపుఱ్ఱె. శివుడీ అల్పవస్తువుల తనవిగా చేసికొనుట దోషము కాదు. అల్పస్థితి గలవాడు లోకమున నొకప్పు డారాధ్యుడగు చుండును. గొప్ప వస్తువుల నాశ్రయించ వలెనను విధిగాని అల్ప వస్తువల నాశ్రయింపకూడ దను నిషేధముకాని నిస్త్రైగుణ్య మార్గమున చరించు వారి కుండవు.

వివరణము:-శ్మశానము దారిలో వచ్చినను స్నానము చేసి గృహమున ప్రవేశింపవలెను, పాములున్న ఇల్లే పరిహరింపవలసియుండగా పాము నాట వస్తువుగా చేసికొనుట మిక్కిలి దోషము. ప్రమాదమునకు హేతువు కూడ. ఎద్దునెక్కుట మిక్కిలి పాపకర్మమని ధర్మశాస్త్రమున చెప్పబడి యున్నది. ఎముకను స్పృశింపనే రాదు. ఏకముగా పుఱ్ఱెను చేత ధరించుట కాపాలిక ధర్మము. అది వేదబాహ్య ధర్మము. కాపాలికులు వేద బాహ్యులు. వైదికులైనవారు శివుని ఆచారములు బాహ్యములని ఎరిగియు ఆతని నారాధించెదరు. శివుని ఆచారములు వేదబాహ్యములని అందుచేత శివదర్శన స్పర్శనములు పూజా ప్రసాద స్వీకరణము నిషద్ధములని వైదికులమనుకొను వైష్ణవులు కొందఱు భావించెదరు. త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున అని శ్రీకృష్ణుడు త్రైగుణ్యము విషయములైన వేదములను వదలి నిస్త్రైగుణ్యుడవు కమ్మని అట్లైననే మోక్షము లభించునని శ్రీకృష్ణుడు చెప్పెను. వైదికమైన నిష్కామ కర్మ చిత్తశుద్ధి కొఱ కనుష్ఠింపదగినదే యైనను గుణాతీతుడు గానిదే ముక్తి లభించదు. త్రిగుణాతీతుడైన తన కే విధినిషేధములు వర్తింపవని తెలుపుటకే శివుని యీ నిషిద్ధాచరణము. లోకమున కాదర్శముగా నుండవలెనను మాట శ్రేష్ఠులకు వర్తించును. శివుని వంటి వారికి వర్తించదు. శివున కసలే వర్తించదు.

శ్లో॥ ప్రేతావాసః శయనమశనమ్ భైక్ష్య మాశాశ్చ వాసః
ఖట్వాఙ్గం చ ధ్వజ ముపహితం త్వస్థి నేపథ్యమఙ్గే।
యద్యప్యేవం తదపి భగవ న్నీశ్వరస్యేతి నామ్నే
నిస్సామాన్య స్త్వమసి విషయో నాపరః కశ్చిదస్తి॥ 33

ప్రతిపదార్థము: ప్రేతావాసః=శ్మశానము, శయనమ్=శయన(స్థాన)ము, అశనమ్=ఆహారము, భైక్ష్యమ్=బిచ్చము (భిక్షాన్నము), ఆశాఃచ=దిక్కులును, వాసః=వస్త్రము, ఖట్వాంగమ్ చ=మంచపుకోడును, ధ్వజమ్=జండాకఱ్ఱగా, ఉపహితమ్=కూర్చబడినది, అంగే=శరీరమున, అస్థినేపథ్యమ్‌చ=ఎముకలతో అలంకార రచనమును, ఉపహితమ్=కూర్చబడినది, ఏవమ్ యది అపి తద్ అపి=ఇట్లైనను, భగవన్=ఓ భగవానుడా, ఈశ్వరస్యేతి=ఈశ్వరుడు అను ఈ, నామ్నః=నామమునకు, నిస్సామాన్యః=సామాన్యముకాని, విషయః=విషయమవు, త్వమ్=నీవు, అసి=అగుచున్నావు, అపరః=ఇతరుడు, కఃచిత్=ఎవడును, న అస్తి=కాడు.

తాత్పర్యము:- ఓ భగవానుడా! నీ శయన స్థానము శ్మశానము, నీ ఆహారము భిక్షాన్నము, వస్త్రము దిక్కులు, మంచపుకోడు జండాకఱ్ఱ, ఎముకలు నీ శరీరమున అలంకారములు అయినను ఈశ్వర అను నామమునకు అసామాన్య విషయమవు. మరొకడు కాజాలడు.

వివరణము:- ఈశ్వరుడు అనగా ప్రభువు ఎవరికి? అను ప్రశ్నము కలుగును. ఈశ్వర శబ్దమునకు ముందు నర అను పదము చేర్చినప్పుడు నరేశ్వరుడు. నరులకు ప్రభువు, రాజు అను అర్థ మేర్పడును. దేవ శబ్దమును చేర్చినప్పుడు దేవేశ్వరుడు అగును. ఆ పదము దేవతలకు ప్రభువు. ఇంద్రుడు అను అర్థ మేర్పడును. ఇట్లే ఏ పదము చేర్చినను ఈశ్వర శబ్దము ఆ చేర్చిన పదము యొక్క అర్థమైన వారికే ప్రభువు అను అర్థము వచ్చుటచే ఈశ్వరత్వము సంకుచిత మగుచుండును. ఏ పదమును చేర్చనిచో ఈశ్వరుడు ఎవరికైనను ఈశ్వరుడు అను అర్థము కల్గించుటచే ఆతనికి సర్వేశ్వరత్వము సిద్ధమగును. నరేశ్వర దేవేశ్వరాదులు ఈశ్వర విశేషులు. వారిలో ఈశ్వరత్వము సామాన్యముగా నుండును. ఈశ్వర అను శబ్దమునకు ముందు ఏ పదమును చేర్చక పోయినను శివుడు అను అర్థము నిచ్చుటచే ఈశ్వర శబ్దము దేవేశ్వరాదులలో సామాన్యముగా నుండు ఈశ్వరత్వమును బోధింపక శివగతమైన సర్వేశ్వరత్వమునే బోధించుటచే ఆ ఈశ్వరత్వము నిస్సామాన్యము అని తెలియును. ఆ శివుడీ విధముగా సర్వేశ్వరుడే అయినను దిక్కులేని దరిద్రునివలె ఎవరును నాది అని చెప్పుకొనని శ్మశానమును శయనస్థానముగా చేసికొన్నాడు. అక్కడికి ఎవడైనను వచ్చి ఇది నాది నీ వేల పడుకొన్నావని అడుగడు కదా! ఎవనికి గాని, దేనికి గాని ప్రభువు

లేనప్పుడు నేను ప్రభువును అని శివుడు వానికి లేక దానికి ప్రభుత్వము వహించును. దేవేశ్వర నరేశ్వరాదులకును ప్రభువైన ఆ శివుడు దిక్కులేని వాని వలె భిక్షాన్నముతో పొట్ట పోసికొనును. ఎంతటి పేదకయినను కనీసము గోచియైన నుండును. శివునకదియు లేక దిగంబరుడు అని పిలువబడినాడు. ఆశలు అనగా దిక్కులు. అవియే ఆయనకు వస్త్రములు. నగ్నుని దేహము చుట్టు వస్త్రము లేకపోయినను దిక్కులు చుట్టును ఉండును కదా, అందుచేత దిక్కులే వస్త్రములు అని చెప్పబడినది. బంగారము వెండి మొదలగు లోహములతో చేయబడిన అలంకారములను ధరించలేని పేదలు గురివింద గింజలు, పూవులు మొదలగు వస్తువుల నలంకరించు కొందురు. అలంకార ప్రీతి పేదలకును ఉండును కావున తమకు లభించిన లేక అందుబాటులో నున్న వస్తువుల నలంకరించు కొనుట తప్పుగాదు, కాని ఎవరో ఆటవికులు తప్ప ఎముకల నలంకరించుకొను వారుండరు. అలంకరించు వస్తువులా కాముకుల నేపథ్యమే. అది శివున కున్నది. అలంకారముల మాట అటుంచి బిచ్చమెత్తుకొను చిప్ప సైతము శివునకు మనుష్యుని పుఱ్ఱెయే అగుట విచిత్రము. అది బ్రహ్మ దేవుని తలపుఱ్ఱె అని అందురు. కాని శ్లోకమున మనుష్యుని తల పుఱ్ఱె నరశిరః ఖర్పరమ్ అనియే యున్నది. నరశబ్దమునకు బ్రహ్మ అని అర్థము చెప్పి ఇతర గ్రంథ విరోధము పరిహరించుకొనవచ్చును. నరశబ్దము పరమాత్మ వాచకము. జీవవాచకముగా, మనుష్యవాచకముగా భిన్న భిన్న అర్థముల కలిగియున్నది. హిరణ్యగర్భుడను నామాంతరము గల కార్యబ్రహ్మకు ఈశ్వరత్వముతోపాటు ప్రథమ జీవత్వమును శాస్త్రసిద్ధము. కావున పై విరోధము పరిహరింపబడినట్లే. కారణ బ్రహ్మమైన పరమాత్మకు నరశబ్దము వాచకముగా గ్రంథములలో ప్రయుక్తమై యున్నది. పై రెండు మూడు శ్లోకములలో శివునకు శ్మశాన సంబంధము చెప్పబడినది. ఒక శ్లోకమున అది ఆవాస స్థానమని చెప్పబడగా మరొక శ్లోకమున శయన స్థానముగా చెప్పబడినది. మరొక శ్లోకమున శ్మశానపు భస్మమే ఆ శివుని కిష్టమని అంగరాగముగా పూసికొన్నట్లు చెప్పబడినది. పరమార్థమున శ్మశానమనగా స్థూల శరీరము. కారణదేహోపాధికుడైన ఆత్మ దానిని విడిచి పెట్టిన దేహము శవము అనబడును. అది కాల్చబడు చోటు కూడ శ్మశానము. అది ఖననము చేయబడు చోటు కూడ శ్మశానము. అచట పెక్కు జనులు భూస్థాపితములో, అగ్ని దగ్ధములో చేయబడు చుండును. ఆ శవములలో శివుడేయైన జీవుడున్నంత వఱకు ఆ

స్థూల శరీరములు శివములే అగును. ఆ శివుడు (జీవుడు) నిష్క్రమించగా ఆ స్థూల శరీరములు శవములై తామున్న చోటునకు శ్మశానమని పేరును కలిగించును. ఆ శివుడిట్టి స్థూల శరీరములలో అనగా శవములలో ప్రవేశించి నిష్క్రమించు చుండుటచే ఈ లోకమంతయు వాస్తవముగా శ్మశానమే అగుచుండును. శవమున్న ఇల్లు కూడ శ్మశానమే. కొన్ని ప్రాంతములవారు తమ ఇండ్లలోనే శవముల దహించు చుందురు. వారికి సామూహిక శ్మశాన ముండదు. అట్టి సందర్భములలో ఆ ఇండ్లు శ్మశానము లగుటలో వింతయేమి? అది లోకమున ఇండ్లలో కూడ చిన్న చిన్న ప్రాణులు పెక్కులు వచ్చి మనకు తెలియకుండగనే కుళ్ళి పోవుచుండును. అందువలన మన ఇండ్లు శ్మశానములే, మన శరీరములో నిత్యము కొన్ని జీవ పదార్థములు చచ్చుచుండును. కావున మన శరీరములును శ్మశానములే గదా! విష్ణు పారమ్యము అంగీకరించినను ఈ స్థూల శరీరములలో ప్రవేశించి నిష్క్రమించుట తప్పదు. కావున ఆ విష్ణువు కూడ శ్మశానవాసియే అని చెప్పక తప్పదు. చచ్చిన శవములు ప్రేతములు అనబడును. వాని ఆవాసము ప్రేతావాసము. చచ్చిన జీవులు ప్రేతములు, వారు కొంత కాలము స్థూల శరీరగ్రహణ పర్యంతము ప్రేత నామకము లగును. శ్రాద్ధాదిక్రియల ద్వారా పితృత్వము నొందుదురు గాన శ్మశానము పితృవన మనియు పిలువబడును.

అవతారికః- పై శ్లోకములలో శ్మశానవాసాదులు శివునకు దోష మాపాదింప లేకపోవుట చెప్పబడినది. ఈ శ్లోకమున మరికొన్ని దోషాభాసములు శివునందు చెప్పబడు చున్నవి.

శ్లో॥ దారూద్యానే ద్విజవర వధూ పప్లవో రేతసాగ్నౌ
హెూమ స్సన్ధ్యానటనమితి తే చేష్టితం నైవ దుష్టమ్।
మిథ్యాజ్ఞానోపహత మనసామ్ మార్గ ముల్లఙ్ఘ్య దూరం
యే నిష్క్రాన్తా స్త్రినయన న తాన్ లోకవాదాః స్పృశన్తి॥ 34

ప్రతిపదార్థము:-త్రినయన= ఓ ముక్కంటీ, దారూద్యానే=దారుకావని యందు, ద్విజవరవధూ పప్లవః= బ్రాహ్మణశ్రేష్ఠ వధువులతో సంభోగించుట, అగ్నౌ=అగ్ని యందు, రేతసా=రేతస్సుతో, హెూమః=హవనము, సన్ధ్యానటనమ్= సంధ్యాకాల మందు నర్తించుట, ఇతి=అను, తే=నీ యొక్క, చేష్టితమ్=చేష్ట, దుష్టమ్=దోషము,

న ఏవ=కానే కాదు, మిథ్యాజ్ఞానోపహత మనసామ్= అసత్యజ్ఞానముచే కొట్టబడిన మనస్సు గలవారి యొక్క, మార్గమ్=మార్గమును, ఉల్లంఘ్య=దాటి, యే=ఎవరు, దూరమ్=దూరముగా, నిష్క్రాంతాః= వెడలిపోయిరో, తాన్=వారిని, లోకవాదాః =లోకవాదములు, న స్పృశన్తి=తాకవు.

తాత్పర్యము:- దారుకావన భూములలో బ్రహ్మణ శ్రేష్ఠవధువుల తోడి సంభోగము కాని, అగ్నిలో రేతస్సు యొక్క హవనముకాని, సంధ్యాకాలమున నర్తించుట కాని నీవు చేసిన ఈ చేష్టితములు దోషములు కావు, మిథ్యా జ్ఞానము చేత గొట్టబడిన మనసుగల వారి మార్గమును దాటి దూరముగా నిష్క్రమించిన వారి నీ లోకవాదములు తాకువు.

వివరణము:-శ్రీకృష్ణుని గోపికా జారత్వము శుకమహర్షిచే శ్రీ మద్భాగవతమున తేజీయసామ్ న దోషాయ అని దోషము కాదని చెప్పబడినది. అట్లే శివుని ఈ బ్రాహ్మణ వధూజారత్వము దోషము కాదు. ఒకే శివుడు బ్రాహ్మణ వధువులుగా తజ్జారుడుగా రూపొంది చేసిన ఈ రమణము స్వాత్మరమణమేకాని అన్యము కాదు. అట్లే కృష్ణుని రమణమును దోషము కాదు. పార్వతీ దేవితో బహుకాలము శివుడు సంభోగించు చుండగా తత్పుత్రోత్పత్తిని కోరిన దేవతలు అగ్నిని ముందిడు కొని పార్వతీ శివులకడకు పోయిరి. శివుడు తన రేతము నగ్నిలో విడచెను. ఇదే శివుడగ్నిలో చేసిన రేతోహోమము. రేతోవిసర్జనము మూత్ర విసర్జనము వలె అగ్నిలో చేయుట సాధారణదృష్టితో దోషమే అయినను లోకాతీతుడయిన శివున కది దోషము కాదు. అట్లే సంధ్యాకాలమున బ్రహ్మోపాసనము చేయవలసి యుండగా నర్తనముతో సంధ్యాకాలమును గడుపుట కూడ సాధారణులకు దోషమే. శివునకది దోషము కాదు. ఈ జగమునందు జరుగు ప్రతిక్రియయు శివుని తాండవమే. అహంకార పూర్వకము గా చేయబడు క్రియయే పాపమునకు హేతువగును. యస్య నాహంకృతో భావః బుద్ధి ర్యస్య న లిప్యతే హత్వాపి స ఇమాన్ లోకాన్ వహంతి న నిబధ్యతే. (ఎవని కహంకృతభావము లేదో నేనీ పుణ్య కర్మ నొనరించితిని తత్ఫలముగా నాకమున కేగుదును ఈ పాప కర్మ నొనరించితిని తత్ఫలముగా నరకమున కేగుదును అని ఎవని బుద్ధి కర్మయందు లిప్తము కాదో వాడు ఈ లోకములను చంపియు చంపలేడు. వాడు కర్మచే బంధింపబడడు) అని భగవద్గీత చెప్పుటచేత అహంకృతి రహితమైన శివుని ఆ

తాండవ నర్తనకర్మ శివునకు దోషము కాదు. శివుని బంధించదు.నేను పాపిని, నేను పుణ్యుడను అని తన పుణ్యాపాపకర్తృభావము సంసారహేతువు. ఇది దోషము ఇది గుణము, ఇది పాపము, ఇది పుణ్యము ఇత్యాది ద్వంద్వ బుద్ధి సంసార హేతువు. అంతయు బ్రహ్మమే అను ఏకత్వ దర్శనము నేను సాక్షిని అను సాక్షిత్వ దర్శనము కలవారికి పుణ్య పాపములు స్వర్గనరకములు లేవు అను జ్ఞానము కలవారి, మిథ్యాజ్ఞానము కలవారి ప్రవర్తనకు దానిని దాటిన వారి ప్రవర్తనమునకు బేధముండును. లోకవ్యవస్థ ఆత్మజ్ఞానులకు వర్తించదు. లోకమున కొన్ని కర్మలు పాపములు అని, కొన్ని కర్మలు పుణ్యములని వ్యవస్థ యున్నది. దానిని లోకులు అజ్ఞానులు తప్పక పాటింపవలసినదే. కొంత వరకు పాటించెదరు కూడ. భేదబుద్ధి, మిథ్యా జ్ఞానము అనబడును. సంసారుల కుండు జ్ఞానము మిథ్యా జ్ఞానము. దానిచే వారి మనస్సు కొట్టబడి యుండును. అందువలన ఏకత్వబుద్ధి గల శివుని వంటి వారి చేష్టలు, దుష్టములు అను దుష్ట బుద్ధి వారికి కలుగును. జ్ఞానులకు మాత్రము శివుని చేష్టలు ఆతని స్వతంత్రతను జ్ఞానమును తెలుపునవిగా భాసించును. సంసారులు చేయు దూషణ భూషణములు, లోకవాదములు వారిని తాకవు. వారు వానిని పట్టించుకొనరు. అజ్ఞ లేమను కొనినను నిందించినను స్తుతించినను వారు క్రుంగరు, పొంగరు. వీరెప్పుడు సర్వసములుగా నుందురు. శరీరమునకే కర్తృత్వముకాని ఆత్మకు లేదని వారి దృఢనిశ్చయము. త్రి విధ శరీరకర్మ ఆత్మకంటదు అనునది వారి నిశ్చయము. మనకు వలె వారికి దోష ద్వేషముండదు. కావున వారి యందు నిషిద్ధాచరణ ముండును. అది మనకు దోషముగా కనిపించును.

అవతారిక:- పై శ్లోకమున లోకాతీతాత్మజ్ఞుడైన శివునకు లోకవిరుద్ధాచరణము దోషము కాదని చెప్పబడినది. ఈ శ్లోకమున వారికి గుణములందును ఆదరముండదని చెప్పబడు చున్నది.

శ్లో॥ దేవా స్సర్వే దధతి వపుషా భూషణం హేమరత్నం
గుఞ్జామాత్రం కనకమపి తే నాస్తి కర్ణే కరే వా।
మార్గాతీతం స్ఫురతి సహజం యస్య సౌన్దర్యమఙ్గే
తస్యాహార్యే ష్వితర జనవ న్నాదరః స్యా ద్గుణేషు॥ 35

ప్రతిపదార్థము:-సర్వే=అందఱు, దేవాః=దేవతలు, భూషణమ్= అలంకారము

గా, హేమరత్నమ్=బంగారమునో, రత్నమునో, వపుషా= శరీరముతో, దధతి= ధరించెదరు, తే=నీ యొక్క, కర్ణే=చెవి యందుగాని, కరేవా=చేతి యందుగాని, గుంజా మాత్రమ్=గుంజెత్తు, కనకమ్=బంగారము, న అస్తి=లేదు, యస్య=ఎవని యొక్క, అంగే=శరీరమున, మార్గాతీతమ్= మార్గమును దాటిన, సహజమ్= సహజమైన, సౌందర్యమ్= సౌందర్యము (ఉన్నదో), తస్య=అతనికి, ఇతర జనవత్ =ఇతర జనునకు వలె, గుణేషు= గుణములైన, ఆహార్యేషు=వేషభాషలందు, ఆదరః =ఆదరము, న స్యాత్=ఉండదు.

తాత్పర్యము:- ఇతర దేవతలు రత్నములను బంగారు వస్తువులను భూషణములుగా ధరించుచుండగా శివుని చేతికికాని, చెవికికాని గుంజెత్తు బంగారము కూడ లేదు. ఎవని శరీరమున సహజమైన సౌందర్య ముండునో వారి కితర జనులకు వలె వేషభూషాదులం దాదరముండదు.

వివరణము:- లోకమున రత్నములు, కనకము, గుణములుగా బావింప బడును. ఎముకలు, బూడిద మొదలగునవి దోషములుగా భావింపబడును. తమ శరీరమున సహజమైన సౌందర్యము కలవారు సొమ్ములు లేకున్నను సుందరముగా నుందురు. వారు నిరాభరణ సుందరులు. కొన్ని ప్రాంతముల వారి భూషణములు, బంగారు రత్నములు వెండి మొదలగు విలువైన వస్తువులతో చేయబడియుండును. కొన్ని ప్రాంతములవారు పూవులతోనే తమ అలంకారముల సరిపెట్టు కొందురు. మరికొందరు విలువ తక్కువైన గురివింద గింజల భూషణములుగా తయారు చేసికొందురు. శరీర శోభాతిశయహేతువులు అలంకారములని వామనుడు చెప్పినాడు.శరీరశోభను పెంచునవి అలంకారములని ఆయన ఉద్దేశము. వాస్తవమునకు గుణములు శోభాహేతువులు. శివునకు శోభాహేతువులైన గుణములందు గాని, శోభాతిశయ హేతువులైన అలంకారము లందు గాని ఆదరము లేదు. ఎముకలు మొదలగువాని యందు నీచభావము కూడ లేదు. కావున వాని నలంకరించుకొనుట దోషము కాదు. కనుక, రత్నాదులందు గుణబుద్ధి లేదు. గావున వాని యందతని కాదరము కూడ లేదు. వానిని ధరించకపోవుట వలన ఆ శివునకు తక్కువదన మేమియు కలుగదు.

అవతారిక:- పై శ్లోకమున శివుని గుణాలంకార వైముఖ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున దానికి కారణమైన ఇతరాపేక్షారాహిత్యము చెప్పబడు చున్నది.

శ్లో॥ త్వమ్ బ్రహ్మాది త్రిదశ గురుభిః పూజితః స్వార్థహేతో
రిత్యామ్నాయో న ఖలు భవతా ప్రార్థితః కశ్చిదన్యః।
ఇచ్ఛామాత్రా త్త్వయి ముపనయం త్యగ్రతో యస్య భావా
స్తస్యాపేక్షా కథమిహ భవే దీశ్వర స్యేతరేషు॥ 36

ప్రతిపదార్థము:-త్వమ్=నీవు, బ్రహ్మాది త్రిదశగురుభిః=బ్రహ్మాదిదేవ గురువుల చేత, స్వార్థహేతోః=స్వార్థమను కారణము వలన, పూజితః= పూజింప బడితివి, ఇతి=అని, కఃచిత్=ఏదో, అన్యః=ఇతరమైన, ఆమ్నాయః=వేదము, భవతా=నీచేత, న ప్రార్థితః ఖలు=ప్రార్థింపబడ లేదు గదా!, ఇచ్ఛామాత్రాత్= ఇచ్ఛవలననే, భావాః=పదార్థములు, యస్య=ఎవని యొక్క, అగ్రతః=ఎదుట, ఉపనయంతి =చేరుచున్నవో, తస్య=ఆ, ఈశ్వరస్య=ఈశ్వరునకు, ఇతరేషు= ఇతరము లందు, అపేక్ష=కోరిక, ఇహ= ఇచట, కథమ్=ఎట్లు, భవేత్=కలుగును.

తాత్పర్యము:- బ్రహ్మాది దేవ గురువులును నిన్ను స్వార్థము వలననే పూజించు చున్నారు, అని తెలిసిన నీ వే యితర వేదమును కోరవు. ఇచ్ఛా మాత్రము చేతనే సర్వ పదార్థములు నీ ఎదుట వచ్చిపడుచుండగా నీ కితరము లందపేక్ష ఎట్లు కలుగును.

వివరణము:- స్వార్థమునగా కామము. దీనిని తీర్చు కొనుటకే బ్రహ్మాదులు నిన్ను పూజించెదరు. పూజించుట కొక విధానముండవలెను. దానిని తెలుపునదే వేదము. మనుష్యులజ్ఞులు గావున వారికి కామములుండుట గాని వానిని తీర్చుకొనుటకు పూజాదుల నొనరించుటగానీ సహజములు. దేవతలకు స్వార్థ ముండుటయే వింత. అందును వారికిని గురుస్థానీయులైన బ్రహ్మాదులును స్వార్థము కలవారై నిన్ను పూజించెదరు అని వేదము చెప్పుచున్నది. ఇది మరింత వింత. స్వార్థము కలవారు కావున వారును అజ్ఞులే అని భావింపవలసి వచ్చు చున్నది. ఇతరుల కోరికల తీర్చు స్థానమున నున్న బ్రహ్మాది దేవగురువులు దేవతలు. అజ్ఞాన జన్యకామము తీర్చుకొనుటలో తామే సతమతమై ఉన్నవా రితరుల కోర్కెల తీర్చుట ఎట్లు సంభవించును. వారు మనుష్యాదుల కోరికలను తీర్చుటలో కూడ వారికి నీచే ప్రసాదింపబడిన శక్తియే పనిచేయుచున్నదని వేదము ననుసరించి ఒప్పుకొనవలసినదే. నీ ఇచ్ఛయే సమస్త పదార్థముల ఉపస్థితికి కారణము అగుచుండగా నీవు నీ ఇచ్ఛను తీర్చుకొనుటకే పూజావిధానమును

గాని దానిని బోధించు నే యితర వేదమునుగాని, ఏ యితర దేవతనుగాని ఆశ్రయింపవు గదా! నీవే వేద స్వరూపుడవు. ప్రార్థనీయుడవును అయి యుంటివి. కావున నీ కితరమైన ఆమ్నాయమును నీవు ప్రార్థింపవు. నీ కపేక్షయే అనగా కోరికయే లేనపుడు నీవు పూజావిధానము కొఱ కన్యమైన ఆమ్నాయము నెట్లు ప్రార్థించెదవు. కావుననే నీవు, వేదబాహ్యాచరణము కలిగి యున్నట్లు కనబడు చున్నావు. ఏ ఆమ్నాయ విధానములకును నీవు కట్టుబడి యున్నట్లు కనబడవు.

అవతారిక:- పై శ్లోకమున ఇతరుల ఇచ్ఛల ఫలింపజేయుటలో శివుని ఇచ్ఛ సంపూర్ణముగ ఫలించునని, శివున కితరాపేక్షయే లేదని చెప్పబడినది. ఈ శ్లోకమున అందఱు శివుని కామసంపూర్ణనిగానే భావించెదరు అని చెప్పబడు చున్నది.

శ్లో॥ ఖణ్డ శ్చన్ద్రః శిరసి పరశుః ఖణ్డ మేవాయుధం తే
భిక్షాపాత్రం ద్రుహిణ శిరసః ఖణ్డ మేకం కపాలమ్।
ఖణ్డప్రాయ స్తవ పరికరో యద్యపీత్థం తథాపి
త్వం సర్వేషాం స్మృతి ముపగతః సర్వ సమ్పూర్ణ హేతుః॥

ప్రతిపదార్థము:- శిరసి=శిరమున, చంద్రః=చంద్రుడు, ఖండః=ముక్క, ఆయుధమ్=అయుధమైన, పరశుః=గండ్రగొడ్డలియు, ఖండమ్=ముక్క, భిక్షాపాత్రమ్=భిక్షాపాత్రము, ద్రుహిణ శిరసః= బ్రహ్మశిరము యొక్క, ఏకమ్= ఒక, ఖండమ్=ముక్క, ఇత్థమ్=ఈ విధముగా, తవ=నీ యొక్క, పరికరః= సంభారము, ఖండప్రాయః=ముక్కలు ముక్కలుగానే యున్నది, తథా అపి=అట్లు అయినను, త్వమ్=నీవు, సర్వసమ్పూర్ణ హేతుః= సర్వ(కామ) మును పూరించు హేతువుగానే, సర్వేషామ్=అందఱి యొక్క, స్మృతిమ్=స్మృతిని, ఉపగతః= పొందియున్నవాడవు.

తాత్పర్యము:-నీ శిరమున చంద్రఖండము, నీ చేత ఆయుధము పరశు ఖండము, భిక్షాపాత్రము బ్రహ్మదేవుని తల ముక్క. ఇట్లు నీ సంభార మంతయు ముక్కలు ముక్కలుగానే ఉన్నది. అయినను నీవు అందరిని పూర్ణుల నొనరించుటకు కారణముగా అందరి చేతను భావింపబడు చున్నావు.

వివరణము:- శివుని తల లోపలి సహస్రారము పూర్ణచంద్రమే ఐనను ఆయన

శిరస్సుపైన ధరించిన చంద్రుడు అర్ధచంద్రుడని చెప్పుదురు. పార్వతీ శివులు అర్ధ నారీశ్వర స్వరూపులు. కావున పార్వతి యొక్క అర్ధమును, శివుడు మరొక అర్ధమును ధరించినా డనుటలోని తాత్పర్యము వారు తమ ఒక అర్ధము శివభాగమున మరొక అర్ధము పార్వతి భాగమున ఉన్నదని తెల్పుటకు చెరొక సగమును శిరముపైన ధరించినారు అనుట వారి భావము. శివుని చంద్ర కలాధరుడని కొందఱందురు. అట్లనుటలోని తాత్పర్యము బ్రహ్మాండములోని ఆకాశము నందలి చంద్రునందు పదునైదుకలలే దర్శనీయములని, పదారవదైన 'సాద' 'అమ' 'అమృత' మొదలగు పేర్లతో పిలవబడు పదారవకల శివుని తలపై (అస్మదాదుల కదృశ్యముగా) నున్నదనుట. పదారవభాగము ఖండమే. అర్ధబాగము ఖండమే. ఉభయ పక్షములందును శివుని తలపై నున్నది చంద్రఖండమే. అర్ధ చంద్రాకృతి గల గొడ్డలిలోని మధ్యభాగమును కొంచెము తొలగి చతుర్థి నాటి చంద్రుని వలె శృంగములు కలిగిన ఆయుధము ఖండపరశువు అని పేర్కొన బడును. దానితో కంఠము నఱకునప్పుడు దాని రెండు శృంగములు మెడకిటు నటు కనబడును. శృంగ మధ్య భాగముతోడనే అది నఱుకబడును. గుఱి కొంచెము తప్పినప్పుడు ఏదో ఒక శృంగము కంఠములోనికి చొచ్చుకొని పోవుట వేఱు విషయము. ఖండిత మధ్య భాగముల ఈ గొడ్డలి ఖండ పరశువు అని చెప్పబడును. యుద్ధమునందు వినాయకుని దంతమొకటి పూర్తిగా పోయినది. మరొక దానిని వినాయకుడే విరిచి శత్రువును చంపినట్లు శివుడెవడినో నఱకినప్పుడు వాని కంఠము గట్టితనము చేత శివుని పరశువు ఖండపరశువై పోయియుండ వచ్చును. ఇది శివుని చేతులలో నొక దాని యందుండును. మరొక చేత శివుడు భిక్షాపాత్రము ధరించును. అది బ్రహ్మాది దేవుని తల రెండు ముక్కలు కాగా పై ముక్క రంధ్రములు లేని దానిని భిక్షాపాత్రముగా శివుడు ధరించినాడు. అది బ్రహ్మదేవుని శిరఃఖండము. ఇట్లు శివుని పరికరములు ఖండ ఖండములుగా నుండగా శివుడు భక్తుల కోర్కెల సంపూర్ణముగా నెఱవేర్చుటచే సంపూర్ణ హేతువైనాడు. జగత్తంతయు ఖండఖండము, భిన్నభిన్నము. జగములోని పదార్థములు ఒక శివునిలోని ముక్కలు. శివుడు సంపూర్ణుడు. ఆతని వలన జనించిన ఆతని కార్యమైన జగము ఆతనిలోని ఖండము సంపూర్ణమును మనము చూడలేము. ఆతనిలోని ముక్కలైన జగత్పదార్థముల కొన్నిటిని మనము చూచు చున్నాము. జగము లనేకములు అను పక్షము నాశ్రయించిన ఒక్కొక్క జగము

లేక ఒక్కొక్క బ్రహ్మాండము ఆయనలోని ఒక్కొక్క ముక్క. జగత్కారణమైన శివుడు మాత్రము సంపూర్ణుడు. కావున శ్లోకమున సంపూర్ణ హేతువు అని చెప్పబడినది. సాధారణముగా హేతువులు హేత్వంతర సహకారముతో కార్యమును సృజించును. అట్టి హేతువులు సహకారి హేతువులు అనబడును. జగన్నిర్మాణమున శివున కే సహకారము అక్కఅలేదు అని తెలుపుటకు శివుడీ శ్లోకమున విజ్ఞులచే సర్వసమ్పూర్ణ హేతువుగా తలచబడునని చెప్పబడినది. శివుని ఖండములన దగిన శివ పరికరభూతులైన జీవులు **శివో౽హమ్** అను జ్ఞానముతో సంపూర్ణత నందగలరు.

అవతారిక:- పురుష విధముగా ఉపాసింపదగిన శివుని పరికరము పూర్వ శ్లోకములలో వివరింపబడినది. ఈ శ్లోకమున బ్రహ్మాండాకారముగా ఉపాసింప దగిన దీర్ఘవృత్తఘనమైన శివుని లింగము యొక్క ఒక విధమైన భావనము చెప్పబడు చున్నది.

శ్లో॥ పృథ్వీపీఠీకృతపద మధః స్వచ్ఛ మాకాశలిఙ్గం
తారాపుష్పైః శిరసి రచితాభ్యర్చనం చన్ద్రచూడ।
ఇత్థమ్ భావా దవహిత ధియో యే భవన్తమ్ భజన్తే
తే లీయన్తే త్వయి జలనిధౌ నిమ్నగానా మివౌఘాః॥ 38

ప్రతిపదార్థము:- చంద్ర చూడ=ఓ చంద్రశేఖరా!, అధః=క్రింద, పృథ్వీ పీఠీకృత పదమ్=భూమి పీఠముగా చేయబడిన స్థానముగా గల, స్వచ్ఛమ్=స్వచ్ఛమైన ఆకాశలింగమ్=ఆకాశమనెడి లింగము, తారాపుష్పైః=చుక్కలు అనెడి పూలచే, శిరసి=శిరమున, రచితాభ్యర్చనమ్=చేయబడిన పూజ గలది, ఇత్థమ్ భావాత్= ఇట్లగుట వలన అవహితధియః= ఏకాగ్రమనస్కులై, యే=ఎవరు, భవన్తమ్=నిన్ను, భజంతే=సేవించెదరో, తే=వారు, జలనిధౌ=సముద్రునియందు, నిమ్నగానామ్= నదుల యొక్క, ఓఘాఇవ= ప్రవాహముల వలె, త్వయి=నీ యందు, లీయన్తే = లీనమగుదురు.

తాత్పర్యము:- భూమి అను పీఠము (పానవట్టము) పై నున్నదియు,చుక్కలను పూలచే శిరమున పూజింపబడిన ఆకాశ లింగమునందు బుద్ధిని నిలిపి నిన్ను సేవించిన వారు సముద్రమున నదీ ప్రవాహముల వలె లీనమగుదురు.

వివరణము:-భూమిని పీఠముగా, చుక్కలను పూలుగా, ఆకాశమును లింగము గా రూపించుట రూపకాలంకారమును ఘటింప జేయును. అంత మాత్రము చేత ప్రయోజనము పూర్తికాదు. అది కేవలము ఆహార్య(కాల్పించుకొనిన) అభేదము మాత్రమే అగును. అట్లు కాకుండ నిరంతర మట్లు భావించుట అనగా ఉపాసించుట చేత శివునందు లీనమగుట అను మహాఫలము (గొప్ప ప్రయోజనం) చేకూరును. సముద్రము యొక్క జలము సూర్యకిరణములచే ఆవిరియై వర్ష రూపమున. పర్వతాదులపై పడి ప్రవహించుచు చివఱకు సముద్రము అనగా స్వస్థానము చేరి చిరకాల విశ్రాంతి నొందును. ఆ విధముగా సముద్రము వంటి శివు నుండి వేఱుపడిన జీవులు పెక్కు కర్మల నొనరించి తత్ఫల సుఖదుఃఖముల నొంది ఆకాశ లింగోపాసనము చేత చివఱకు సముద్రము వంటి ఆ శివునందే లీనమగుదురు. మరల తిరిగి జన్మజరామరణాది దుఃఖముల నొందరు. లింగమునకు కూడ పై భాగము శిరసని, క్రింది భాగము పాదమని భావించుటకు పురుష విధత్వ సంస్కారము తొలగక పోవుటయే హేతువు.

అవతారిక:- పై శ్లోకమున ఆకాశ లింగోపాసనముచే శివైక్యము చెప్పబడినది. ఈ శ్లోకమున వారణాసి యందలి అవిముక్త శైవజ్యోతిః స్థానమున శరీరమును సన్న్యసించిన శివైక్యము కలుగునని చెప్పబడు చున్నది.

శ్లో॥ వారాణస్యాం స్ఫురతి యదిదం దేవ దేవావిముక్తమ్
శైవం జ్యోతిః సకల భువనాలోకనాదర్శ భూతమ్॥
కృత్వా తస్మిన్ ప్రమహసి పదే క్షేత్ర సన్న్యాసయోగం
త్వయ్యైకత్వం వ్రజతి పురుష స్తేజసీవ ప్రదీపః॥ 39

ప్రతిపదార్థము:- దేవదేవ=దేవదేవా, వారాణస్యామ్=వరుణ అసి అను నదుల మధ్య భూమి యందు, సకల భువనాలోకనాదర్శభూతమ్= సకల లోకములను చూచుటకు అద్దము అయి నటువంటి, శైవమ్=శివసంబంధమైన, జ్యోతిః= వెలుగు(అనదగిన) యత్=ఏ, ఇదమ్=ఈ, అవిముక్తమ్=అవిముక్తము (కలదో), ప్రమహసి=గొప్ప వెలుగుగల, తస్మిన్=ఆ, పదే=స్థానమున, క్షేత్ర సన్న్యాస యోగమ్ =శరీరత్యాగమను యోగమును, కృత్వా= చేసి, పురుషః= పురుషుడు, తేజసి= తేజమును, ప్రదీప ఇవ=గొప్ప దీపము వలె, త్వయి=నీయందు, ఏకత్వము= ఐక్యమును, వ్రజతి= పొందును.

తాత్పర్యము:- దేవదేవా! సకల లోకముల దర్శనమునకు అద్దమైన వరుణ అసి అను నదుల మధ్య భూమి యందుగల, అవిముక్తమను ఏ క్షేత్రము శైవజ్యోతిగా స్ఫురించు చున్నదో ఆ గొప్ప తేజము గల స్థానమందు శరీర త్యాగ మొనర్చిన పురుషుడు దీపము తేజమున వలె ఏకత్వము నొందును.

వివరణము:- వారాణసి అనగా వరుణ అసి నదుల మధ్య భూమి. ఆధ్యాత్మిక కముగా ఇడా పింగళ నదుల మధ్య మనదగిన భ్రూమధ్యము. అచట శివజ్యోతి స్ఫురించును అనగా కనబడును. ఆ శివజ్యోతిలో చూడ దలచిన వారికి సమస్త లోకములు కనబడును. అందువలన భ్రూమధ్యము సకల భువనాలోకమునకు అద్దము వంటిది. అచట ప్రాణవాయువును కొంతకాలము నిలిపి శరీర త్యాగము చేసినచో దివ్యపురుషుని జీవుడు పొందునని భగవద్గీత చెప్పుచున్నది. కాశీ నగరమునకు అవిముక్తము (శివునిచే విడువబడనిది) అనగా ఎప్పుడు శివుడుండు చోటు అనగా శివజ్యోతి యొక్క పదము. అచట కాశి వున్నది. కాశి అనగా ప్రకాశించునది. సుషుమ్నానాడి సహస్రారము చేరుటకు ముందు కుండలిని కొంచెము సేపు ఆగవలసిన చోటు వారాణసి. అచట వరుణ అసి గంగ అను మూడు నదులు (త్రివేణి) ఉన్నవి. కాశీనగరము నందు మరణించు వారికి ముక్తి కలుగునని కాశీ ఖండాది గ్రంథములందు పెక్కుచోట్ల చెప్పబడినది. శివజ్యోతి గొప్ప తేజము. దాని యందు ప్రదీపము వలె జీవుడు కలియును. అప్పుడు జీవజ్యోతి విడిగా ఉండక శివజ్యోతి యందేకీ భావము నందును.

అవతారిక:- పై శ్లోకమున కాశి యందు మరణించుట వలన శివైక్యము కలుగునని చెప్పబడినది. ఈ శ్లోకమున శ్రీశైల జ్యోతిర్లింగ దర్శనము వలన గణపద ప్రాప్తి చెప్పబడు చున్నది.

శ్లో॥ తత్ర ప్రత్యక్షం సకల భువనాశ్చర్య భూతం విభాతి
జ్యోతిర్లిఙ్గం కనక కపిలం శ్రీ గిరౌ వ్యోమ్ని దివ్యమ్।
తత్పశ్యన్తః శివ సుకృతినః కృత్త సంసార బన్ధా
స్తత్కారుణ్యా చ్చిరగణ పదప్రాప్తి భాజో భవన్తి॥ 40

ప్రతిపదార్థము:- శ్రీగిరౌ=శ్రీశైలమునందు, వ్యోమ్ని=ఆకాశమున, సకల భువనాశ్చర్య భూతమ్=సకల లోకాశ్చర్య భూతమైన, కనక కపిలమ్= బంగారము

వలె కపిల వర్ణముగల, తత్=ఆ (ప్రసిద్ధమైన), జ్యోతిర్లిఙ్గమ్=జ్యోతిర్లిఙ్గము, ప్రత్యక్షమ్ = ప్రత్యక్షముగా, విభాతి=ప్రకాశించును, శివ=ఓ శివా, సుకృతినః= పుణ్యాత్ములు, తత్=దానిని, పశ్యన్తః=చూచుచున్నవారు, కృత్త సంసారబన్ధాః= ఛేదించఁబడిన సంసారబన్ధము కలవారై, త్వత్కారుణ్యాత్= నీ కరుణ వలన, చిరగణ పదప్రాప్తి భాజః=శాశ్వతమైన గణపద ప్రాప్తిని పొందువారు, భవన్తి= అగుదురు.

తాత్పర్యము:- శ్రీశైలముపైన ఆకాశమున సకల లోకాశ్చర్య భూతమైన బంగారము వలె కపిలవర్ణముగల జ్యోతిర్లిఙ్గము ప్రత్యక్షముగా ప్రకాశించు చున్నది. దానిని చూచు పుణ్యాత్ములు నీ దయ వలన సంసార బన్ధమును భేదించుకొన్న వారై శాశ్వతమైన గణపదమును పొందెదరు.

వివరణము:- శ్రీశైలముపైన ఆకాశమున బంగారు రంగుగల జ్యోతిర్లిఙ్గము ప్రత్యక్షముగా ప్రకాశించు చుండును. అనగా భక్తుల కాప్రాంతము చేరగానే ఆలయము లోనికి వెళ్ళకున్నను ఆకాశము నందు జ్యోతిర్లిఙ్గ దర్శనము కలుగును. అక్కడి వెలుగు లింగాకృతిలో కన్పించును.భారతదేశమున పన్నెండు జ్యోతిర్లిఙ్గము లున్నవి. కాశీ జ్యోతిర్లింగ ప్రదేశమున మరణించు వారికి ముక్తి కలుగుచుండగా శ్రీశైలమున మల్లికార్జున (జ్యోతిర్) లింగమును చూచిన వారికి ముక్తి కలుగునని పురాణములలో చెప్పబడినది. జ్యోతిర్లింగ దర్శనము కూడ అక్కఱ లేదు. ఆయాసముతో ఎక్కుచు పోవు వారాలయము దాక పోవు వఱకు బ్రతికెదరో లేదో, దూరము నుండి ఆ జ్యోతిర్లింగమున్న శ్రీశైల శిఖర దర్శనముననే ముక్తి కలుగుననియు చెప్పబడినది. ***శ్రీ శైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే*** (శ్రీశైల శిఖరమును చూచినవారు జన్మనొందరు, అని పురాణోక్తి కలదు. ఈ శ్లోకమున (మల్లికార్జున నామక) జ్యోతిర్లింగ దర్శనమున సంసార బన్ధ నివృత్తి రూపముక్తి కలుగుటయే కాక శివలోకమున గణపదము లభించును. గణనామక భక్తులు శివలోకమున నుందురు. వారి నాయకుడు గణనాథుడు (వినాయకుడు). శివ లోకము లభించుట సాలోక్యముక్తి. అంతకన్నను గొప్పదైన సామీప్య ముక్తి వంటిదీ గణపద ప్రాప్తి. వారు శివునకు మిక్కిలి అంతరంగికులు, దగ్గఱగానుండు వారు.

అవతారిక:-పై శ్లోకమున శ్రీశైలజ్యోతిర్లింగదర్శనమున సాలోక్య సామీప్య

ముక్తులు కలుగునని చెప్పబడినది. ఈ శ్లోకమున వాచాధీశుడైన శివుని ధ్యానము వలన గంగాసదృశ వాక్ప్రవాహము కలుగునని చెప్పబడు చున్నది.

శ్లో॥ వాచాధీశం హుతవహ తనుం శక్తి పాణిమ్ భవన్తం
యే ధ్యాయన్తి త్రినయన! తమ స్తేజసా నిర్దహన్తమ్।
గఙ్గా స్రోత స్సదృశ విలస ద్గద్య పద్యప్రవాహైః
సద్య స్తేషామ్ ప్రసరతి ముఖా ద్భారతీ నాత్ర చిత్రమ్॥ 41

ప్రతిపదార్థము:- త్రినయన=ఓ ముక్కంటీ, వాచాధీశమ్=వాక్కునకధీశుడవైన, హుతవహతనుమ్=అగ్ని శరీరము గల, శక్తి పాణిమ్=శక్తి చేతగల, తమః=చీకటిని, తేజసా=తేజస్సుతో, నిర్దహన్తమ్=కాల్చుచున్న, భవన్తమ్=నిన్ను, యే=ఎవరు, ధ్యాయన్తి=ధ్యానించెదరో, తేషామ్=వారి యొక్క, ముఖాత్=ముఖము నుండి, గంగాస్రోతస్సదృశ విలసద్గద్య పద్య ప్రవాహైః=గంగాప్రవాహముల వలె ప్రకాశించు గద్యపద్య ప్రవాహములతో, సద్యః=అప్పటికప్పుడు, భారతీ=వాక్కు, ప్రసరతి= ప్రసరించును, అత్ర=ఈ విషయమున, చిత్రమ్= వింత, న=లేదు.

తాత్పర్యము:- అగ్ని శరీరముగల, శక్తి చేతగల, చీకటిని వెలుగుతో కాల్చుచున్న వాగీశ్వరుడవైన నిన్ను ధ్యానించు వారికి ముఖము నుండి గంగా ప్రవాహముల వంటి గద్యపద్య ప్రవాహములు కల వాక్కు ప్రసరించును.

వివరణము:- శివున కష్టమూర్తులు కలవు. వానిలో అగ్నిమూర్తి ఒకటి. అగ్ని శక్తి అను ఆయుధము ధరించినవాడు అని శ్లోకమున వేదానుసారముగా చెప్ప బడినది. తమస్సును అనగా చీకటిని, తేజస్సుతో కాల్చువాడు వేదమున కూడ "తేజసా బాధతే తమః" తేజస్సుతో తమము బాధ నొందును అని యున్నది. అగ్ని వాగధిష్ఠాన దేవత కావున అగ్ని తనువైన శివుని ధ్యేయ రూపమును వర్ణించు నీ శ్లోకము "వాచాధీశమ్" అను పదముతో ఆరంభింపబడినది. శివుని యొక్క ఈ అగ్నిమూర్తిని ధ్యానించు వాని ముఖము నుండి అగ్ని శక్తియైన వాక్కు గద్యపద్య ప్రవాహములు గలదై ప్రవాహములతో కూడిన గంగవలె ప్రవహించును. వాగధీశుని ధ్యానముతో వాక్కు ప్రసరించుటలో వింతయేమి లేదని శ్లోకమున చెప్పబడినది. నమకమున చెప్పబడిన రుద్రుని బభ్రువర్ణము అగ్ని వర్ణమే. తామ్రాయచ అని చెప్పబడిన తామ్ర వర్ణము కూడ అగ్ని వర్ణమే. అరుణాయ చ

అని చెప్పబడిన అరుణ వర్ణము కూడ అగ్ని వర్ణమే. 'ఉగ్రభీమ' మొదలగు నమకములోని పెక్కు పదములు రుద్రుని అగ్ని తత్త్వమును వివరించునట్టివే.

అవతారిక:- శివుని అగ్ని తనువును ధ్యానించిన నిరర్గల వాక్శక్తి కలుగునని పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున కుడి కంటిలోని శివుని ఆదిత్య జ్యోతిర్లింగ మూర్తి పురుషరూప దర్శన మొనరించిన వారికి సూర్యుని వరకు గల లోకము యొక్క దర్శనము కలుగునని చెప్పబడు చున్నది.

శ్లో॥ భాస్వజ్జ్యోతిః కిరణ మరుణం దక్షిణేఽక్ష్ణి స్థితం త్వాం
యే వీక్షన్తే పురుష ముదితం ఖ్యాత మాదిత్య మూర్తిమ్।
తే సర్వత్రాప్రతిహత దృశః సూర్య పర్యన్త లోకమ్
పశ్యన్త్యగ్రే కరతల లుఠ త్కన్దుక స్పష్ట రూపమ్॥ 42

ప్రతిపదార్థము:- భాస్వజ్జ్యోతిఃకిరణమ్=ప్రకాశించుకాంతిని విరజిమ్మే, అరుణమ్=ఎఱ్ఱనైన, దక్షిణే=కుడిదైన, అక్ష్ణి=కంటి యందు, స్థితమ్=వున్న, ఉదితమ్=ఉదయించిన, ఖ్యాతమ్=ప్రసిద్ధమైన, ఆదిత్యమూర్తిమ్=సూర్యమూర్తి వైన, త్వామ్=నిన్ను, యే=ఎవరు, వీక్షన్తే=చూచెదరో, తే=వారు, సర్వత్ర=అంతటి, అప్రతిహత దృశః=అడ్డులేని దృష్టికలవాడై, సూర్యపర్యంత లోకమ్=సూర్యుని వరకు ఉన్న లోకమును, అగ్రే=ఎదుట(నున్న), కరతల లుఠత్కందుక స్పష్ట రూపమ్=అరచేత పొరలాడుచున్న బంతివంటి స్పష్టమైన రూపు కలదిగా, పశ్యంతి =చూచెదరు.

తాత్పర్యము:- ప్రకాశించు వెలుగును విరజిమ్మే కుడికంటిలో నున్న ఉదయించిన ప్రసిద్ధమైన ఆదిత్యమూర్తి పురుష రూపునిగా నిన్ను చూచువారు, అరచేతిలో తిరుగుచున్న బంతిని చూచినంత స్పష్టముగా సూర్యపర్యంత లోకమును అడ్డులేని దృష్టి గలవారై చూచెదరు.

వివరణము:- ఉపనిషత్తులో అక్షి పురుష విద్య యున్నది. కుడికంటిలోని పురుష రూపముగా పరమాత్మ నుపాసించు విధానమున్నది. కన్ను తేజస్(సూర్య) సంబంధి ఇంద్రియము. అందు శివుని ఆదిత్యమూర్తి పురుషు నుపాసించుటకు ఫలము సూర్యపర్యంత లోకమును కరతలామలకము వలె దర్శించు సామర్థ్యము కలుగుట, మహాన్యాసమున 'సంకర్షణమూర్తి స్వరూపో యోసావాదిత్యః పరమ

పురుష స్స ఏష రుద్రో దేవతా' అను దేవతగా చెప్పబడిన సూర్యమూర్తి అరుణమే. 'ఖ్యాతమ్' అను పదము ఉపనిషత్ప్రసిద్ధము అను అర్థమును సూచించును.

అవతారిక:- పై శ్లోకమున శివుని ఆదిత్యమూర్తిని ధ్యానించువారికి సూర్య పర్యంతలోక దర్శనము ఫలముగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఆత్మరూపముగా శివుని హృదయమున ధ్యానించు వారికి సర్వజ్ఞత్వము కలుగునని చెప్పబడు చున్నది.

శ్లో॥ యే ధ్యాయన్తే స్వహృది విమలం చిత్త్వమాత్మైక రూపం
విశ్వాదర్శమ్ ప్రసర దభితో భూర్భువః స్వ స్త్రిలోకీమ్।
ఇత్థం గత్యాగతి పరిచయా త్తే తవైన ప్రసాదా
త్సర్వజ్ఞత్వం కలవికరణం శీలయన్తో లభన్తే॥ 43

ప్రతిపదార్థము:- అభితః=అంతట, విశ్వాదర్శమ్=విశ్వమునకు అద్దము అగు, ఆత్మైకరూపమ్=ఏకాత్మరూపమైన, విమలమ్=స్వచ్ఛమైన, చిత్తమ్=జ్ఞాన స్వరూపమును, భూర్భువః స్వస్త్రిలోకీమ్=భూః భువః సువః అను మూడు లోకము లను, ప్రసరత్=ప్రసరించు దానినిగా, యే=ఎవరు, ధ్యాయన్తే= ధ్యానించెదరో, తే=వారు, ఇత్థమ్=ఇట్లు, గత్యాగతి పరిచయాత్=రాకపోకల పరిచయము వలన, తవ=నీయొక్క, ప్రసాదాత్ ఏవ= అనుగ్రహము వలననే, కలవికరణమ్=అవ్యక్త మాధుర్యమును విరజిమ్మురూపమును, శీలయన్తః=ధ్యానించువారై, సర్వజ్ఞత్వమ్= సర్వజ్ఞతను, లభన్తే=పొందెదరు.

తాత్పర్యము:-శివుని అష్టమూర్తులలోని ఆత్మరూపము (యజమాన రూపము) స్వచ్ఛమైన జ్ఞాన స్వరూపము. విశ్వమును చూచుట కది అద్దము వంటిది. భూః భువః సువః అను మూడు లోకములం దదియే ప్రసరించును. లోన చూచిన జ్ఞానము బయట చూచిన త్రిలోకిగా కనబడునదియు జ్ఞానమే. త్రిలోకి యొక్క ఈ గత్యాగతుల (రాకపోకల) వలన అవ్యక్త మాధుర్యము విరజిమ్మ బడును. ఆత్మరూప తనువును ధ్యానించువారు సర్వజ్ఞతను పొందుదురు.

వివరణము:- ఆత్మ చిద్రూపము కావుననే త్రైలోక్యము కూడ దానిలోనే దృశ్యమగును. దృశ్య వస్తువు జ్ఞానాకారమును బొందకున్న ఎవడును దానిని తెలిసికొనలేడు. ఇంద్రియ ద్వారమున అది జ్ఞానాకృతిని పొందును. కావున బయట

త్రిలోకమును లోని ఆత్మను చిద్రూపముగానే దర్శించినప్పుడు అవ్యక్త మాధుర్యానుభవము కలుగును. ఈ స్వభావముగా ఆత్మయొక్క చిద్రూపము శివుని కలవికరణత్వము శివుని ఈ చిద్రూపమును ధ్యానించు వారికి సర్వజ్ఞత్వము అను ఫలము కలుగును. ఈ జగత్తును కంటితో చూచునప్పు డది కాంతి రూపమున కంటిలోనికి, జ్ఞాన రూపమున మనస్సులోనికి ప్రవేశించును. లోని ఆత్మ బయట అవ్యక్త ద్వారమున త్రిజగదాకారమై తిరిగి జ్ఞానిని చేరుచున్నది. నిద్రా సమయమున త్రిజగదాకారము కోలుపోయి అవ్యక్తముగానే ఆత్మకు దృశ్యమగును. చిత్తే జ్ఞానమై జ్ఞేయమై జ్ఞాతయై ఉన్నది కావున త్రిపుటి అగుచు తిరిగి చిత్తమగు చున్నది. ఇవియే గత్యాగతులు. వీని పరిచయము కూడ నీ అనుగ్రహముననే కలుగును.

అవతారిక:-పై శ్లోకమున శివుని చిత్స్వరూపాత్మైక రూపదర్శనము వలన సర్వజ్ఞత్వము కలుగునని చెప్పబడినది. ఈ శ్లోకమున హృదయములోని సూక్ష్మ జ్ఞాన జ్యోతిర్దర్శనము వలన శివత్వము కలుగునని చెప్పబడు చున్నది.

శ్లో॥ యే త్వాం శమ్భో! హృదయకుహరాంభోరుహాభ్యన్తరస్థం
జ్ఞానం జ్యోతి స్తదుపరి వశాద్ వ్రీహిశూకాగ్ర సూక్ష్మమ్।
ఉద్వీక్షన్తే దృఢతర లయా త్తే 2ప్యుపాధి ప్రణాశా
త్త్వయ్యైకత్వం నభసి కలశాకాశవ న్నిర్విశన్తి॥ 44

ప్రతిపదార్థము:- శమ్భో=ఓ శివా!, హృదయ కుహరాంభోరుహాభ్యంతరస్థమ్ =కమలము లోపలి భాగము వంటి హృదయ గుహ యందున్న, తదుపరి వశాత్ =దాని పైభాగము కారణముగా, వ్రీహిశూకాగ్ర సూక్ష్మమ్=వరిముల్లు చివటి భాగము వలె సూక్ష్మమైన, జ్ఞానమ్=జ్ఞానమను, జ్యోతిః=వెలుగును, ఉద్వీక్షన్తే= చూచెదరో, తే+అపి=వారు కూడ, దృఢతర లయాత్=దృఢతరముగా లయించుట వలన, ఉపాధి ప్రణాశాత్=ఉపాధినాశము వలన, నభసి=ఆకాశము నందు, కలశా కాశవత్=ఘటాకాశమువలె, త్వయి=నీ యందు, ఏకత్వమ్=ఐక్యమును, నిర్విశన్తి =ప్రవేశించెదరు.

తాత్పర్యము:- కమలాంతర్భాగము వంటి హృదయకుహరమున వరిముల్లు వలె సూక్ష్మమైన తేజోరేఖా మధ్యమున (నాభికి) పై భాగమున నున్న

పరమాత్మయందు జీవులు మనస్సు లయము చేయుటచే ఉపాధులు నశించి ఘటాకాశము మహాకాశమున లీనమైనట్లు జీవులు పరమాత్మయందు లీన మగుదురు.

వివరణము:- ఎదకు సమానాంతరముగా శరీరము లోపలి భాగమున హృదయ కమల మొకటి అధోముఖమై వున్నది. యోగ బలమున దాని నూర్ధ్వముఖముగా చేసి అక్కడ జ్ఞానజ్యోతిరూపమున నున్న పరమేశ్వరుని దర్శింపవలెను. బొడ్డుకు జిట్టెడు పై భాగము వఱకు ఒక దీపశిఖ వంటి సూక్ష్మమైన తేజోరేఖ ఒకటి ఉన్నది. దాని చివఱి భాగము వరిగింజ ముల్లంత సూక్ష్మమైన దీపజ్వాలయై యున్నది. దాని మధ్యన మిక్కిలి సూక్ష్మరూపమున జ్ఞానజ్యోతి రూపమున పరమాత్మ ఉన్నాడు. ఆ పరమాత్మ జ్యోతిని దర్శించుచు మనస్సుల నా పరమాత్మ యందు లీన మొనరించ వలెను. జీవులు ఘటాకాశము వంటివారు. పరమాత్మ మహాకాశము వలె సర్వవ్యాపి. జ్యోతిర్దర్శనము చేసి ఉపాధులైన మనస్సుల నందు లీనముల నొనరింపగా చంచల స్వభావ మనస్సు చంచలతతో పాటు స్వరూపము ను గోలుపోగా మనస్సు లుపాధులుగా గల జీవులు మాయోపాధికుడైన పరమాత్మ యందు మనస్సు లయమును చేయగా మనస్సులు మాయ అను ఉపాధులు నశించి ఘటాకాశము నశించి మహాకాశమున లీనమైనట్లు లీనులగుదురు. అంత సూక్ష్మజ్యోతిస్సు నందున్నను పరమాత్మ సర్వవ్యాపియే. హృదయ కమల ముపలబ్ధి స్థానమే పరమాత్మను సంకోచింపజేయకయే తనలో నిలుపుకొని యుండును. కఠోపనిషత్తులోనను "మధ్యేవా మన మాసీనం విశ్వేదేవా ఉపాసతే" (మధ్యన కూర్చొనిన వామనుని (చిన్నవానిని) విశ్వేదేవతలు అనగా దేవతులంద ఱుపా సించెదరు) అని చెప్పబడి యున్నది.

అవతారక:- పై శ్లోకమున హృదయకుహరము అను ఉపలబ్ధి స్థానమున జ్ఞానజ్యోతి స్స్వరూప సూక్ష్మ శివోపాసనా ఫలము జీవులకు పరమాత్మ ప్రవేశమని చెప్పబడినది. ఈ శ్లోకమున మరణానంతరము సాలోక్యాది ముక్తుల వలన లభించు బ్రహ్మ (శివ) లోక సుఖభోగము తదా నంతరము శివానుగ్రహమున లభించు కైవల్యాలాభము చెప్పబడు చున్నవి.

శ్లో॥ అర్చిర్విద్యుత్ప్రభృతిభి రలమ్ మార్గవిశ్రామ హేతో
ర్యే గచ్ఛన్తి త్రినయన! పథా దేవయానేన కేచిత్,

భక్త్యా భోగా ననుపమ రసాన్ స్వేచ్ఛయా బ్రహ్మలోకే
తే తస్యాన్తే పునరపి శివ త్వన్మయత్వమ్ భజన్తే॥ 45

ప్రతిపదార్థము:-త్రినయన= ఓ ముక్కంటీ, శివ= ఓ శివుడా!, మార్గవిశ్రామ హేతో=మార్గమందలి విశ్రాంతి కొఱకు, అర్చిర్విద్యుత్ప్రభృతిభిః=అర్చిస్సు విద్యుత్తు మొదలైన వానితో, అలమ్=చాలును, యే=ఎవరో, కేచిత్=కొందరు, దేవయానేన=దేవయానము అను పేరుగల, పథా=మార్గమున, గచ్ఛంతి= పోవుదురో, భక్త్యా=భక్తితో, అనుపమ రసాన్=సాటిలేని ఆనందముగల, భోగాన్= భోగములను, స్వేచ్ఛయా=స్వేచ్ఛతో, బ్రహ్మలోకే=బ్రహ్మలోకమున, భజన్తే= పొందుదురు, తస్య=దాని యొక్క, అంతే=అంతమున, తే=వారు, పునః= మరల, తన్మయత్వమ్ అపి=నీ ఐక్యమును కూడ, భజన్తే=పొందెదరు.

తాత్పర్యము:- ఓ మూడుకన్నులు గల శివుడా! దేవయానము అను మార్గమున ఎవరు బ్రహ్మలోకమునకు పోవుచుందురో వారు మార్గమున అర్చిస్సు విద్యుత్తు మొదలగు ఆతివాహిక దేవతల ద్వారా చూపబడు విశ్రాంతి స్థానములలో విశ్రమించు నిచ్ఛ లేకపోయినచో విశ్రమించకుండగనే బ్రహ్మ (శివ) లోకమునకు చేరుదురు. అచట సాటిలేని ఆనందము నిచ్చు భోగములను స్వేచ్ఛతో అనుభవించి ఆ లోకము ముగిసిన పిమ్మట భక్తితో శివైక్యమును బొందుదురు.

వివరణము:- భగవద్గీతలో శుక్లమార్గము చెప్పబడినది. అది దేవయాన మార్గమే. అగ్ని జ్యోతిస్సు పగలు శుక్లపక్షము ఉత్తరాయణము అను ఆతివాహిక దేవతలు చూపు మార్గమున పోవువారు బ్రహ్మలోకమును చేరుదురని చెప్పబడినది. ఉపనిషత్తులో అర్చి విద్యుత్తుయని కొంచెము భిన్నముగా నీ మార్గమే చెప్పబడినది. ఓంకారము నుచ్చరించుచు భ్రూమధ్య జ్యోతిర్దర్శనము చేయుచు ప్రాణముల విడచిన వారీ మార్గమున బ్రహ్మలోకమును జేరుదురు. అని భగవద్గీతలో చెప్పబడినది. హృదయపుండరీకమున జ్యోతిర్దర్శనము చేయుచు నీ మార్గమున శివలోకమున తత్త్వమసి అను ఉపదేశమును పొంది సగుణశివలోకాంతమున నిర్గుణ శివైక్యమును పొందెదరు అని ఈ శ్లోకమున చెప్పబడినది. నిష్కామ కర్మోపాసనలద్వారా మరణానంతరము దేవయానము అను దారి లభించును. దాని ద్వారమున సగుణ బ్రహ్మలోకప్రాప్తి ఉపనిషద్గీతాదులలో చెప్పబడినది. ఉపాసన మనగా శ్రీ శంకరులచే అభిధ్యానమని చెప్పబడినది. ఇది పిపీలికా

మార్గమనియు పెక్కు గ్రంథములలో చెప్పబడినది. ఈ జన్మముననే సద్గురువు ద్వారా తత్త్వమసియను ఉపదేశము లభించిన అధికారియైన శిష్యునకు బ్రహ్మాస్మి అను జ్ఞానము కలిగి లోకాంతర ప్రయాణము (దేవయానము) లేకుండగనే అత్ర బ్రహ్మ సముశ్నుతే న తస్య ప్రాణాత్ ఉత్క్రామన్తి అను శ్రుతి వాక్యముల ననుసరించి నిర్గుణ బ్రహ్మప్రాప్తి రూప కైవల్యము లభించును. ఈ మార్గము విహంగ మార్గమని చెప్పబడినది. ఈ శ్లోకమున చెప్పబడిన భక్తి ఈ రెంటిలో దేనిలో చేరును అను ప్రశ్నము కలుగును. కొందఱు దీనిని ఉపాసనామార్గమునకు దాదాపు సమాంతరముగా చెప్పిరి. ఉపాసనమునకు వలె భక్తిని ఏక (విషయక) ప్రత్యయ ప్రవాహమని నిర్వచించిరి. నారదశాండిల్యులు భక్తిని, శాండిల్యుడు సాపరానురక్తి రీశ్వరే "అని, నారదుడు సాత్వస్మిన్ పరమప్రేమ రూపా అని అనురక్తి ప్రేమలు భక్తి స్వరూపములని చెప్పిరి. శబ్దములు వేరైనను ఒక విధమైన మహాభావమునే భక్తి అని చెప్పిరి. శ్రీ శంకరులు స్వస్వరూపానుసన్ధానమ్ భక్తి రిత్యభిధీయతే అని జ్ఞాన మార్గసాధనముగా చెప్పిరి. భక్తి పరా అపర అని రెండు విధములు అని వానిలో పరాభక్తి (అనన్యభక్తి) భేదములేని జ్ఞానముతో దాదాపు అభిన్నమని చెప్పిరి. అందువలన భక్తి జ్ఞాన రూపమే అగుటచే సాధనేత రాపేక్ష లేకుండ ముక్తి హేతువని చెప్పిరి. సాలోక్యాది ముక్తుల నొందిన వారికి కూడ అపరాభక్తి ఉండుననిరి. బ్రహ్మలోక భోగానంతరము బ్రహ్మలోకేశ్వరుని (బ్రహ్మలోకాంతమున) తత్త్వమసి అను నుపదేశవాక్యమునకు అర్థమైన జ్ఞానమున కిది అభిన్నము. ఆ సాలోక్యాది దేవయాన గమ్యలోకముల నుండువారు గురు స్వరూప సగుణబ్రహ్మ యొక్క తత్త్వమసి అను ఉపదేశము చేత జ్ఞానులై కైవల్యము నొందుదురని చెప్పబడినది. కావున అపరాభక్తి నిష్కామ కర్మోపాసనా సమకక్షమని, పరాభక్తి జ్ఞాన సమకక్షమని గమనింప వలసియున్నది. భక్తి అనునది పంచమ పురుషార్థమని అది సాధ్యభక్తి అని దానికి అపరాభక్తి సాధనమనియు చెప్పిరి. ఈ శ్లోకమున జ్ఞానము ప్రత్యేకముగా ప్రస్తావింపబడకున్నను పైన చెప్పిన విధముగా భక్తి ద్వైవిధ్యము ననుసరించి అపరాభక్తి దేవయానము ద్వారా సాలోక్యాది సగుణముక్తులను కలిగించియు సాధకులను విడువక ఉండి బ్రహ్మ లోకాంతమున బ్రహ్మోపదేశము చేయవలయునను అనుగ్రహమును ఈశ్వరు నకు కలిగించి నివృత్తమగును. భక్త్యాలభ్య స్త్వనన్యయా అను గీతాశాస్త్రము నను సరించి జీవైశ్వరైక్య జ్ఞానరూపమైన అనన్యభక్తిచే శివకైవల్య ప్రాప్తి నా శివభక్తులు

పొందెదరనుట ఈ శ్లోకము యొక్క సారము.

అవతారిక:- పై శ్లోకమున దేవయానము అనబడు సగుణముక్తి బ్రహ్మ (శివ) లోకము కలుగునని ఆ లోకము యొక్క అంతమున శివైక్యరూప నిర్గుణ కైవల్య ముక్తియు శివభక్తి వలన కలుగునని చెప్పబడినది. ఈ శ్లోకమున వైరాజ్యము అనబడు పంచమార్థ్వ ప్రసిద్ధమైన పదము శివానుగ్రహమున కలుగునని చెప్పబడు చున్నది.

**శ్లో॥ యత్రానన్దః స్ఫురతి పరమ జ్యోతి రాలోక జన్మా**
**భుజ్యన్తే చ స్వయ ముపనతా యత్ర దివ్యాః సుభోగాః।**
**యత్రావృత్తి ర్న భవతి పునః పఞ్చమార్ధ్వ ప్రసిద్ధం**
**తద్వైరాజ్యమ్ పదమపి శివ ప్రాప్యతే త్వత్ప్రసాదాత్॥ 46**

ప్రతిపదార్థము:- శివ= ఓ శివా!, యత్ర=ఎచట, పరమజ్యోతిరాలోక జన్మా= పరమమైన వెలుగును చూచుట వలన కలుగు, ఆనన్దః=ఆనన్దము, స్ఫురతి= స్ఫురించునో, యత్ర=ఎచట, దివ్యాః=దివ్యములైన, సుభోగాః= మంచి భోగములు, స్వయమ్=స్వయముగా, ఉపనతాః=ప్రాప్తములు, (భవంతి=అగునో) యత్ర= ఎచట(నుండి), పునః=మరల, ఆవృత్తిః=మరలుట, న భవతి=కలుగదో, పంచ మార్థ్వ ప్రసిద్ధమ్=అయిదవ అధ్వమున ప్రసిద్ధమైన, తద్=ఆ, వైరాజ్యమ్= వైరాజ్యము అనబడు, పదమ్ అపి=స్థానము కూడ, త్వత్ప్రసాదాత్=నీ అనుగ్రహమున, ప్రాప్యతే=లభించును.

తాత్పర్యము:- ఎచట పరమజ్యోతిని దర్శించుటచే కలుగు ఆనందము ప్రకాశించునో, ఎచట దివ్యలోకములోని గొప్ప భోగములు స్వయముగా ప్రాప్తము లగునో ఎచటికి పోయిన వారు తిరిగి అధోలోకములకు మరలుట జరుగదో, ఆ వైరాజ్యము అనబడు స్థానము ఓ శివా! నీ అనుగ్రహమున లభించును.

వివరణము:- విశేషముగా ప్రకాశించు వాడు (శివుడు), విరాట్టు. విరాట్ఛబ్దము బ్రహ్మాండ దేహము అను అర్థమును కూడ ఇచ్చును. ఈ దేహము నభిమానించు ఈశ్వరుడు వైశ్వానరుడు అని చెప్పబడును. జాగ్రదవస్థాభిమాని విశ్వాఖ్యనరు లలో అనగా జాగ్రదవస్థాభిమాని జీవులందఱిలో నుండువాడు వైశ్వానరుడు. అగ్ని స్వరూప వైశ్వానరుడు. భగవద్గీతలో అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం

దేహ మాశ్రితః ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ప్రాణుల దేహము నాశ్రయించి వైశ్వానరుడై ఆ ప్రాణులు భుజించిన చతుర్విధాన్నమును ప్రాణాపానములతో కూడిన వాడనై జీర్ణింపజేయుదును) అని వైశ్వానర శబ్దము జఠరాగ్ని వాచకముగా చెప్పబడినది. అగ్ని స్వరూపుడైన ఈ రుద్రుడు నమకము 'తామ్రః' (ఎఱుపు వన్నెగల వాడని) చెప్పబడినాడు. బ్రహ్మాండము ఈశ్వరుని స్థూలదేహము. స్థూలదేహమున కాహారము ఆవశ్యకము. ఆది జీర్ణమగుటయు ఆవశ్యకము. దానిని జీర్ణింపజేయుటకు ఆయనకు జాఠర (అగ్ని). త్వము ఆవశ్యకము. రుద్రుడు ప్రలయంకరమైన తృతీయ ఫాలలోచనము కలిగి యుండుట ఆయన అగ్ని (ప్రధాన) త్వమును చెప్పు చున్నది. సూర్యచంద్రులును (సూర్యుడు + ఉష్ణోగ్రత) చంద్రుడు - ఉష్ణోగ్రత అగ్ని రూపులే. అగ్ని (తేజము) సర్వసృష్టి హేతువు. కావున బ్రహ్మ అనియు చెప్పబడును. ఆయనయు నెఱుపు వన్నె కలవాడనియే పురాణములు చెప్పుచున్నవి. బ్రహ్మాండ దేహము సమష్టి స్థూల దేహము పాంచభౌతికము. అనగా పంచీకృత పంచ భూతమయము. వెనుక సృష్టి హేతువుగా చెప్పబడిన వైశ్వానరాగ్ని, శివుని అష్టమూర్తులలో నొకటి అగుటయే గాక మిక్కలి ప్రధానము. ఇది శివుని యొక్క రౌద్రాంశము. అగ్ని యందు హెూమము చేయుటద్వారా శివుడు ఆరాధింప బడును. మరియు అగ్ని ప్రతీకముగా శివోపాసనము చేయుట సంప్రదాయ సిద్ధము. అగ్ని ఉన్నంత వఱకు ప్రాణుల ప్రాణము నిలిచి యుండును. అనగా జీవుల పాలన కృత్యము నదియే నిర్వహించు చున్నది. వాయువు కూడ శివుని అష్టమూర్తులలో నొకటియే. ఉపనిషత్తులలో వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి అని చెప్పబడినది. కావున పై అగ్నికి చెప్పబడిన ప్రాధాన్యము వాయువునందు కూడ ఉపాదింపబడ వచ్చును. కాని ఇచ్చట వైరాజ్య(వైశ్వానర) పదమున పరమ జ్యోతిరాలోక(తేజముఅగ్ని) ము వలన ఆనందము కలుగును. అని శ్లోకమున చెప్పబడుటచే ఇంతగా అగ్ని (తేజము) ప్రాధాన్యము ఉపాదింపబడినది. సామ్రాజ్య భౌజ్య స్వారాజ్య వైరాజ్య పారమేష్ఠ్య రాజ్య మహారాజాధిపత్య సార్వభౌమత్వ సార్వాయుష సముద్ర పర్యంత భూమ్యేకరాట్త్వాదు లన్నియు శివ పదములే. వానిలో వైరాజ్యమనునది పంచమాధ్వ ప్రసిద్ధమని చెప్పబడినది. వర్ణపద మంత్ర కలా భువన తత్త్వాధ్వలలో పంచమాధ్వ మైన భూవనాధ్వములో చేరినది వైరాజ్యపదము. తత్త్వాధ్వము పంచమాధ్వముగా భావింపబడినపుడు వైరాజ్యపదము తత్త్వాధ్వములలో చేరినదిగా భావింప

బడవలెను. ఏమైనను వైరాజ్య పదమున సకలాసదృశా నందమయ దివ్యసుభోగము లచట తమంత తామే ఆ పదమును పొందిన వారి కుపస్థితము లగును. ఆ వైరాజ్యపదమును చేరుకొన్న వారికి పునరావృత్తి లేదు. న సపునరావర్తతే అని బ్రహ్మ సూత్రాంత సూచనముగా ఆమ్రేడితమైన సూత్రమున పునరావృత్తి ఏ లోకమున నిషేధింపబడినదో ఆ లోకమే ఈ వైరాజ్య పదము అని శ్లోకమున యత్రావృత్తి ర్నభవతి అని చెప్పబడుటచే నిర్ణయించు కొనవలసి యున్నది. కాని పూర్వశ్లోకమున బ్రహ్మలోకే అని చెప్పబడినందున ఈ శ్లోకమున వైరాజ్యమ్ పదమపి అని అపి శబ్దము యొక్క ప్రయోగమువలన ఆ బ్రహ్మలోకమునకన్న ఈ వైరాజ్యపదము వేఱని తెలియు చున్నది.

అవతారిక:- పై శ్లోకములో మర్త్యలోకమును (మరణము ద్వారా) విడచిన శివ భక్తోపాసకులకు దివ్య భోగ సమన్వితమైన బ్రహ్మలోక వైరాజ్య పదముల ప్రాప్తి చెప్పబడినది. ఈ శ్లోకమున మరణమునకు పూర్వమే శివవిహితాత్మ దర్శనము చేయు మనోవాంఛితార్థము లన్నింటిని కలిగించు ధర్మ(మేఘ) సమాధి కలుగునని చెప్పబడు చున్నది.

శ్లో॥ త్వయ్యాత్మానం నిహిత మఖిలై స్త్వద్గుణైః సమ్ప్రయుక్తం
స్వచ్ఛాదర్శే ముఖమివ చిరం చేతసా నిశ్చలేన।
యే పశ్యన్తి త్రినయన! మనోవాఞ్ఛితార్థ ప్రసూతి
స్తేషా మావిర్భవతి సుధియా మేవ ధర్మ స్సమాధిః॥ 47

ప్రతిపదార్థము: త్రినయన!= ఓ ముక్కంటీ, అఖిలైః=సమస్తములైన, త్వద్గుణైః =నీ గుణములతో, సమ్ప్రయుక్తమ్=కూడిన, త్వయి=నీయందు, నిహితమ్= ఉంచబడిన, ఆత్మానమ్=స్వాత్మను, స్వచ్ఛాదర్శే=స్వచ్ఛమైన అద్దము నందు, ముఖమ్ ఇవ= ముఖమును వలె, చిరమ్=చాలసేపు, నిశ్చలేన=చలించని, చేతసా =మనస్సుతో, యే=ఎవరు, పశ్యంతి=చూచెదరో, తేషామ్=ఆ, సుధియామ్ ఏవ =మంచి బుద్ధిగల (పండితులైన) వారికే, మనోవాంఛితార్థ ప్రసూతిః= మనస్సుచే కోరబడిన అర్థముల కలిగించు, ధర్మః=ధర్మ (మేఘ) మనుపేరుగల, సమాధిః= సమాధి, భవతి=కలుగును.

తాత్పర్యము:- ఓ ముక్కంటీ! అన్ని గుణములతో కూడిన నీ యందు నిలపిన స్వాత్మను అద్దము నందు ముఖమును వలె చాలాసేపెవరు నిశ్చల మనస్సుతో

చూచెదరో ఆ బుద్ధి మంతులకే (పండితులకే) సకలమనోవాంఛితముల కలిగించు ధర్మ(మేఘ)మను పేరుగల సమాధి కలుగును.

వివరణము:- సకల కళ్యాణగుణ పూర్ణుడు శివుడు. సర్వవ్యాపకుడునైన ఆతనిలో స్వాత్మను చూడవలెను. ఇచట చూచుట అనగా ధ్యానించుట అని గ్రహింపవలెను. సకల కల్యాణ గుణపూర్ణుడైన శివునిలో స్వాత్మను చేర్చినపుడు ఆ కల్యాణ గుణము లన్నియు తనకును కలిగినట్లగును. ఈ శ్లోకమున 'అఖిలైఃత్వద్గుణైః సమ్ప్రయుక్తమ్' అని శివుని కల్యాణ గుణములుగల అను అర్థమిచ్చు విశేషణ మాత్మకు కూర్చబడుటచే పై యర్థ మేర్పడినది. శివునకు స్వచ్ఛమైన ఆదర్శము (అద్దము) ఉపమానముగా చెప్పబడినది. అందువలన ఉపమాలంకార మేర్పడి యున్నది. అద్దమున ముఖమును చాలాసేపు మనము చూచుకొనుట కిష్ట పడుదుము. కారణమేమి? ఆ అద్దములోని ప్రతి బింబము మన దగుటచేతనే. అనగా ఆత్మ ప్రేమ ప్రతి బింబము నందు చూపించు చున్నాము. ఆ ప్రతి బింబము నేనే అని గాని, నాది అని గాని భావించుటచే నా ప్రేమ యేర్పడినది. శివునిలో నున్నది నేనే అని భావించుటచే నన్ను నాకు చూపు ఆ శివునందును ప్రేమ యేర్పడును. ఆ ప్రేమ వలన మనస్సు నిశ్చలమై ఎక్కువగా రమించును. (ఆనందించును) అట్లు శివునందు సకల రజోగుణములతో కూడిన స్వాత్మను దర్శించు వారికి సకల మనోవాంఛల నీడేర్చు ధర్మ (మేఘ)మను పేరుగల సమాధి కలుగును. మేఘము వృష్టిని వలె ధర్మము (శివునందుంచబడిన ఆత్మ) ఆనందము వర్షించుటచే ఆ సమాధి కాపేరు సార్థకము.

అవతారిక:- పై శ్లోకమున సగుణ శివునందు సంక్రామిత తద్గుణ స్వాత్మ నిధానము చెప్పబడినది. తత్ఫల ధర్మ (మేఘ) సమాధి చెప్పబడినది. ఈ శ్లోకమున గుణ స్పర్శలేని స్వాత్మ శివునందు బుద్ధ్యవధానము చేయు యోగదృష్టి గల వారికి కలుగు విశ్వ మిథ్యాభావము తోచునని చెప్పబడు చున్నది.

శ్లో॥ జ్ఞాన జ్యోతి స్సకల జగతాం యత్ప్రకాశ స్వరూపం
త్వామాత్మానమ్ పరిహృత గుణం స్పర్శ మీశానమౌళే,
తత్రైకస్మి న్నవహితధియాం యోగ దృష్టి స్థితానాం
స్వచ్ఛాదర్శే ప్రతిఫలితవ ద్విశ్వ మేతద్ విభాతి॥ 48

ప్రతిపదార్థము:- ఈశానమౌళే=ఈశానమను పేరుగల శిరము గలవాడా!, సకల జగతామ్=అన్ని లోకముల యొక్క, జ్ఞానజ్యోతిః=జ్ఞానము అను వెలుగు, యత్ప్రకాశ స్వరూపమ్=ఎవని ప్రకాశము స్వరూపముగా గలదో (తమ్=అట్టి), పరిహృత గుణస్పర్శమ్=వదలివేసిన గుణములు సంబంధముగల, త్వామ్=నిన్ను, ఆత్మానమ్=ఆత్మగా, యే పశ్యంతి=ఎవరు చూచెదరో, తత్ర=అప్పుడు, ఏకస్మిన్=ఆ ఒకని యందు, అవహితధియామ్=ఏకాగ్రమైన బుద్ధిగల, యోగదృష్టి స్థితానామ్= యోగదృష్టి యందున్న వారికి, స్వచ్ఛాదర్శే=స్వచ్ఛమైన అద్దము నందు, ప్రతిఫలితవత్=ప్రతిఫలించినట్లు, ఏతత్=ఈ, విశ్వమ్=విశ్వము, విభాతి= ప్రకాశించును.

తాత్పర్యము:- సర్వలోక జ్ఞానము అను వెలుగు ఎవని ప్రకాశ స్వరూపమో అట్టి గుణస్పర్శ లేని నిన్ను స్వాత్మగా భావించు వారికా జీవాత్మైక్య స్వరూపము నందు బుద్ధిని నిలుపు యోగదృష్టికల వారి కద్దము నందు ప్రతిఫలించినట్లు అనగా మిథ్యగా ఈ విశ్వము ప్రకాశించును.

వివరణము:- సగుణమాయలో ప్రతిబింబించిన వాడీశ్వరుడు. తదంశమైన సగుణావిద్యతో ప్రతిబింబించినవాడు జీవుడు. ఇరువురు నిర్గుణ' శుద్ధాత్మ స్వరూపులే యైనను, అనగా ఆత్మ ఏకమే అయినను, ఉపాధి వశమున జీవేశ్వర భేదము నందినది. మాయ పరిణమించి విశ్వముగా మారినది. ఈశ్వరోపాధియైన మాయ జీవోపాధియైన అవిద్యతో తత్పరిణామములైన పిండబ్రహ్మాండములు వానికి మూలమైన మాయతో పాటు మిథ్యలే. కావున తత్ప్రతిబింబములైన జీవేశ్వరులును మిథ్యాభూతములే అని ఒక పక్షము అద్వైతములో నున్నది. ఈశ్వరుడు బింబస్వరూపుడు. కావున సత్యస్వరూపుడు. జీవుడు ప్రతిబింబ స్వరూపుడు కావున మిథ్యాభూతుడు అని మరొక పక్షము. ఉభయ పక్షములలోను మాయా గుణములు ఈశ్వరునియం దారోపింపబడినవే కావున వాస్తవముగా ఈశ్వరుడు నిర్గుణుడే యైనను సకల కల్యాణ గుణములు కలవాడు అని ఆరోపింపబడి ఉపాస్యుడగుచున్నాడు. అట్టి ఈశ్వరునిలో అంశభూతుడైన జీవుడు, ఈశ్వరునిలోనే ఉన్నట్లు చూడదగిన వాడు. ఉపాధి ప్రణాశముకాగా జీవేశ్వరైక్యము సిద్ధించును. విశేషణాంశములైన కించిత్‌జ్ఞత్వ సర్వజ్ఞత్వములు తొలగిపోయినపుడు జీవేశ్వరు లిరువురు నిర్గుణులే అగుదురు. మిథ్యా ప్రతిబింబ భూతుడైన జీవుడు యథార్థముగా ఈశ్వరుడే. లేక శుద్ధాత్ముడే కావున గుణస్పర్శలేనివాడే. కావున

ఈశ్వరుని ఆత్మను గుణస్పర్శలేని వానినిగానే త్వమాత్మానమ్ అని ఈ శ్లోకము చెప్పినది. అట్టి నిర్గుణైకాత్మ యందే సకల విశ్వము దృశ్యమై యున్నది. ఆ నిర్గుణైకాత్మ స్వచ్ఛాదర్శము వంటివాడు. ఆతని యందు ప్రతిబింబముగా గోచరించు విశ్వము అద్దములో ప్రతిబింబించుట వలననే మిథ్యయనియే ఆ అద్దము నందు దృశ్యమైన విశ్వమును యోగ దృష్టి కలవారు భావించెదరు. ఈ శ్లోకమున శివుడు ఈశానమౌళే అని సంబోధింప బడినాడు. శివుడు పంచశిరుడు. సద్యోజాతము, తత్పురుషము, వామదేవము, అఘోరము, ఈశానము అని అయిదు శిరముల పేర్లు. ఈశానము ఆ పంచ శిరములలో నొకటి. కావున శివుడు ఈశానమౌళియని సంబోధింప బడినాడు. మరొక విధముగా మంత్ర మూర్తియైన శివునకు సద్యోజాత మంత్రము పాదయుగము, వామదేవ మంత్రము గుహ్యము, అఘోర మంత్రము హృదయము, తత్పురుష మంత్రము ముఖము, ఈశాన మంత్రము శిరము కావున శివుడు ఈశానమౌళి అని చెప్పబడినాడు. ఒకడు నరేశానుడు, ఒకడు దేవేశానుడు, ఇత్యాదులెందఱో ఈశానులని పేర్కొనబడు చున్నారు. వారిలో శివుడు ఉత్తమాంగమైన మౌళి వంటివాడు అనగా ఈశానులందఱిలో శ్రేష్ఠుడు. కావున ఈశానమౌళి అని శివుడు చెప్పబడినాడు.

అవతారిక:-పై శ్లోకమున నిర్గుణ శివధ్యాన యోగదృష్టి కలవారికి జగమంతయు మిథ్యగా భాసించునని చెప్పబడినది. ఈ శ్లోకమున సంసార భయమును పోగొట్టు శివసేవను బుద్ధిహీను లాదరింపరని చెప్పబడు చున్నది.

**శ్లో॥ భూతమ్ భూతమ్ స్మరణ విషయమ్ భావితా త్వన్తకాలే**
**సూక్ష్మమ్మధ్యే క్షణమివ తయో ర్వర్తమానం వలన్తే!**
**యస్మిన్ సౌఖ్యం కియ దమతయో యేన మత్తా మనుష్యా**
**యుష్మ త్సేవామ్ భవభయ ధ్వంసినీం నాద్రియన్తే॥ 49**

ప్రతిపదార్థము:- భూతమ్=భూతకాలము, స్మరణ విషయమ్=స్మృతికి విషయము, భూతమ్=అయినది, భావితా=భవిష్యత్త్వము,తు=అయితే, అంతకాలే =చివఱి సమయమున, అస్తి=కలదు, తయోః=వానియొక్క, మధ్యే=నడుమ, క్షణమివ=క్షణమువలె, సూక్ష్మమ్=చిన్నదైన, వర్తమానమ్=వర్తమాన కాలమును, వలంతే=పొందుచున్నారు, యస్మిన్= దేనియందు (వర్తమాన కాలమందు) యేన= దేనితో, అమతయః=బుద్ధిహీనులైన, మనుష్యాః=మనుష్యులు, మత్తాః=మత్తులై,

భవభయ ధ్వంసినీమ్=సంసారభయమును పోగొట్టు, యుష్మత్సేవామ్=మీ సేవను, న ఆద్రియన్తే=ఆదరించుట లేదో, (తత్=ఆ), సౌఖ్యమ్=సౌఖ్యము, కియత్=ఎంత?

తాత్పర్యము:-భూతకాలము స్మృతి విషయమై పోయినది. భవిష్యత్తనగా అంతకాలమే. వాని మధ్యలోని వర్తమాన కాలము క్షణకాలమంత చిన్నది. అంత తక్కువ కాలమున పొందకలిగిన సౌఖ్యమెంతో కాని దాని కొఱకు బుద్ధిహీనులు సంసార భయమును బోగొట్టు మీసేవ నాదరించుట లేదు.

వివరణము:- భూతకాలము అనుభవ విషయము కాదు. స్మరణ విషయము. అనుభవము, స్మరణము ఈ రెండు జ్ఞాన భేదములు. వీనిలో అనుభవము వర్తమాన కాలికము. స్మరణము భూతకాలికము. అనుభవము కలిగిన ఉత్తర క్షణమున ఆ అనుభవము స్మరణముగా మారిపోవును. కావున భూతకాలము స్మరణ విషయమే. భవిష్యత్కాలము అనగా రాబోవు కాలము. అది మనకు వర్తమానముగా మారునో లేదో చెప్పజాలము. మరణమెప్పుడు కలుగునో మనము చెప్పజాలము. కావున జీవించి యుండగా భవిష్యత్కాలమనగా దాదాపు అంతకాలమే. అనగా మరణ సమయమే. అందుచే శ్లోకమున భావిత (భవిష్యత్తు) అంత కాలమున ఉన్నది అని చెప్పబడినది. రాబోవు కాలము మరణ సమయమని మనము గుర్తుంచుకొన వలెను. అంతకాలము దాక రాబోవు కాల మనుకొనినను వర్తమానకాలము క్షణికమనుటలో సంశయింప నక్కఱ లేదు. అది క్షణము వలె సూక్ష్మమైనదని శ్లోకమున స్పష్టము చేయబడినది. సందిగ్ధమైనది భవిష్యత్కాలము. భూతకాల మనుభూతకాలమే. ఆ రెండు కాలము లందును మనము చేయ గలిగినది దాదాపు శూన్యమే. సందిగ్ధ భవిష్యకాలమున నేమైన చేయగల మేమో అను ఆశ లోకులకు సహజము. కావున ముఖ్యముగా ఆధ్యాత్మిక సాధనమును వాయిదా వేయు చుందురు. అది వివేక వంతమైన పని కాదు. కావున అల్ప బుద్ధులని యెఱుగ వలెను. శ్లోకమున ఈ అర్థమున అమతిశబ్దము ప్రయోగింప బడినది. అసలు బుద్ధియే లేని మనుష్యు లుండరు. కావున అమతులనగా అల్ప బుద్ధులే. వర్తమాన కాలము క్షణికము. దాని నెట్లు గడుపవలెను? భవిష్య త్కాలమున భోగమనుభవించుట సంభవించునో లేదో వర్తమానముననే అనుభవించెదము గాక! మరణించినచో అనుభవించకుండ నుండగనే వర్తమాన కాలమును వ్యర్థము చేసికొన్న వారమగుదుము. అని లౌకికులు భావించి అల్ప

వర్తమాన కాల సుఖమునందే దృష్టిని కేంద్రీకరించి యుందురు. అంత అల్ప కాలమున వారు పొందు సౌఖ్యము ఎంత అల్పమో వారెఱుగరు.ఆ అల్పకాలమును శాశ్వత సౌఖ్యము కొఱకుపయోగించుటయు వారెఱుగరు. సత్పురుషులు చెప్పినను, శాస్త్రములు చెప్పినను విశ్వసింపరు. శాస్త్రోక్త కర్మ చేసినచో స్వర్గాదులు కలుగునని విశ్వసింపరు. నిష్కామ కర్మాదులు శాశ్వత సౌఖ్యరూపమోక్ష సాధనములని చెప్పినను విశ్వసింపరు. అది తాత్కాలిక భోగము వలె అల్ప సుఖదము కాక శాశ్వత సౌఖ్యదమగునని అసలే విశ్వసింపరు. క్షణికమైన అల్ప సౌఖ్యము కొఱకే వర్తమాన కాలము నుపయోగించెదరు. మృత్యువు వాతబడి జీవితమునే వ్యర్థము చేసికొందురు. శివసేవ భవభయధ్వంసిని అని దాని నాదరింప వలసియుండగా శాస్త్రము లట్లు చెప్పినను పట్టించు కొనరు. ఉపేక్షించెదరు. ఎవరామాట నాదరించి శివసేవ చేయుదురో వారు భవభయ దూరులగుదురు. వర్తమాన కాలమున భోగముల ననుభవించుచునే శివస్మరణము చేయవచ్చును. శివస్మరణము కూడ శివసేవ (భక్తి) భేదములలో చేరినదే. లోకక్షేమకర కార్యముల నొనర్చుటయు శివసేవయే, అవియు చేయరు. అల్పసౌఖ్యముననే మత్తులైనవారు రాబోవు ప్రమాదమును గమనింపరు. వర్తమాన కాలమున మత్తులై ఉండుట కూడ ప్రమాదమని వారెఱుగరు. మత్తులై ఉండుటయే ప్రమాదము. మత్త శబ్దము (సంస్కృతాంధ్రభాషలోని ప్రమాద శబ్దము యొక్క అర్థము నిచ్చును.) భవిష్య దనర్థమును వర్తమానానర్థమును గమనింపనీయని మత్తతను బోధించుచు అంత కాలము వచ్చినను గమనింపక భోగముల ననుభవించుచునే యుందురు. తన యెదుటి చీమను భక్షించు భోగాభిలాషతో తాను సర్పము యొక్క నోటనున్న విషయమును మఱచిన కప్పవలె మనుష్యుడు తాను మృత్యువను సర్పము నోటనున్నట్లు గమనింపక భోగములను చీమల పైననే దృష్టిని కేంద్రీకరించి మృత్యు సర్పగ్రస్తు డగుచున్నాడు.

అవతారిక:- భూతార్థ విషయక స్మృతి వర్తమానార్థ విషయకానుభవములు అను జ్ఞానభేదములు పై శ్లోకమున పేర్కొన బడినవి. ఈ శ్లోకమున జ్ఞాన మేదయినను జ్ఞేయసంబంధ శూన్యముగా నుండదని చెప్పబడు చున్నది.

**శ్లో॥ జ్ఞానం న స్యా త్క్వచిదపి కిల జ్ఞేయ సమ్బన్ధ శూన్యం**
**జ్ఞేయం సత్తామపి న లభతే జ్ఞాన బాహ్యం కదాచిత్।**

ఇత్యన్యోన్య గ్రథిత ముభయో ర్వ్యాపకం యత్స్వరూపం
తత్తే ప్రాహుః ప్రకృతి పురుష స్యార్ధనారీశ్వరత్వమ్॥ 50

ప్రతిపదార్థము:- క్వచిద్ అపి=ఎక్కడనైనను, జ్ఞానమ్=జ్ఞానము, జ్ఞేయ సమ్బన్ధ శూన్యమ్=జ్ఞేయము (విషయము) యొక్క సంబన్ధ రహితమై, న స్యాత్=ఉండదు, జ్ఞేయమ్=విషయము, జ్ఞాన బాహ్యమ్=జ్ఞానమునకు బహిర్భూతమై, సత్తామ్ అపి=సత్తనుకూడ, న లభతే=పొందదు, ఇతి=ఇట్లు, అన్యోన్య గ్రథితమ్=వానితో నొకటి చేర్చబడిన, ఉభయోః=రెంటి యొక్క, స్వరూపమ్=స్వరూపము, యత్=ఏదో, తత్=దానిని, ప్రకృతి పురుషస్య=ప్రకృతి పురుషుడవైన, తే=నీ యొక్క, అర్ధ నారీశ్వరత్వమ్=అర్ధనారీశ్వరత్వముగా, ప్రాహుః=చెప్పెదరు.

తాత్పర్యము:- విషయసంబంధము లేని జ్ఞానముగాని, జ్ఞాన సంబంధము లేని విషయముగాని ఉండవు. ఒక దానితో ఒకటి ముడిపడిన ఈ రెండు ప్రకృతి పురుషాత్మక శివుని యొక్క అర్ధనారీశ్వరత్వమని పెద్దలు చెప్పెదరు.

వివరణము:- జ్ఞానము పురుష స్వరూపము. జ్ఞేయ(విషయ)ము ప్రకృతి స్వరూపము. ఈ రెంటి కలయిక పిండ బ్రహ్మాండ దేహములలో కనుపించును. జీవుని శరీరము పిండమని శివుని శరీరము బ్రహ్మాండమని చెప్పబడును. బ్రహ్మాండ శరీరాభిమాని యైన శివునిలోని తెలిసికొను జ్ఞానము పురుషుడు. తెలియబడు బ్రహ్మాండ శరీరము ప్రకృతి. కావున బ్రహ్మాండ శరీరాభిమానియైన శివుడు ప్రకృతి పురుషుడని శ్లోకమున చెప్పబడినది. ఆ శివునిలోని ప్రకృతి స్త్రీమూర్తియని పురుష శబ్దముచే ఆక్షిప్త మగుచున్నది. ఈ విషయమును సూచించుటయే శివుని అర్ధనారీశ్వర మూర్తి రహస్యము. అర్ధనారీశ్వర శివునిలోని స్త్రీ పురుషులు వేఱగుట అసమ్భవము. వేఱయినచో అర్ధనారీశ్వర మూర్తియే ఉండదు. అట్లే జ్ఞేయ(విషయ)ము లేనిచో జ్ఞానమున్నట్లు కాదు. విషయము యొక్క జ్ఞానము లేనిచో విషయమున్నదని ఎట్లు చెప్పుటకు వీలగును? జ్ఞాన విషయమైనప్పుడే పదార్థమునకు సత్త ఉన్నదనవలెను. తెలిసిన పిమ్మటనే ఉన్నదను వ్యవహారము పుట్టును. వస్తువున్నప్పుడే ఇంద్రియము దానిపై ప్రసరించి దానిని తెలిసికొనును. అట్లు తెలిసికొని నప్పుడే తెలివి ఉన్నదని గ్రహింపగలము. కావున జ్ఞానజ్ఞేయములు అవినాభావములు. కాని జ్ఞానమునకు విషయ సమ్బన్ధము నియతము కాదు. విషయసమ్బన్ధ మున్నప్పుడు జ్ఞానము దానిపై ప్రసరించును.

లేనిచో ప్రసరింప కుండనుండును. అట్లు ప్రసరింపని స్థితి గల జ్ఞానము నిర్విషయ జ్ఞానము అనబడును. అదియే ఆత్మ. విషయ సంబన్ధ మేర్పడి అది జ్ఞాత అని వ్యవహరింపబడినను దాని జ్ఞానము రూపమునకు భంగము రాదు. విషయము నకు జ్ఞేయత గలుగుటయే విషయము యొక్క ఉత్పత్తి యని కొందఱు వేదాంతులు చెప్పిరి. జ్ఞేయత జ్ఞాత్రాధీనము. కావున విషయము జ్ఞాత సృష్టియని వారి అభిప్రాయము. విషయము లేనిదే దేనిని తెలిసికొనుట? విషయము లేక తెలసికొనుట లేదు అను మాట వాస్తవమే కాని ఈ జ్ఞాతృజ్ఞేయతలు రెండును జ్ఞానాధీనములు. అది నిర్విషయ జ్ఞానము. శుద్ధాత్మ స్వరూపము. ఆ జ్ఞాన స్వరూప శివున కర్ధనారీశ్వరత్వము లేదు. జ్ఞాతృజ్ఞేయములైన ప్రకృతి పురుషులు లేక పోవుటచే శివుడు ప్రకృతి పురుషుడనుట కుదరదు. విషయమును తెలిసికొనకయు నుండు నిర్విషయ జ్ఞానము విషయమును తెలిసికొనుటతో ఆతడు ప్రకృతి పురుషుడని అర్ధనారీశ్వరుడని చెప్పబడును. ఆ శుద్ధాత్మ రూప శివుడు సమాధి కాలమున మాత్రమే తనకు తానుగా గోచరించుచు సమస్త జ్ఞాతృజ్ఞేయముల ముంగి యుండును. ఒక్కడుగానే ఉండును. ఆ శుద్ధస్వరూప ప్రకృతి పురుషత్వ అర్ధనారీశ్వరత్వముల కన్న భిన్నము సమాధిగతము.

అవతారిక:- పై శ్లోకమున బ్రహ్మాండము నందంతట ప్రత్యక్షముగానున్న ప్రకృతి పురుషత్వము (అర్ధనారీశ్వరత్వము) అను శివుని రూపము చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రత్యక్షముకాని శివుని అపరోక్ష రూపము చెప్పబడు చున్నది.

శ్లో॥ యత్ప్రత్యక్షం న భవతి నృణా మిన్ద్రియాణా మశక్తే
ర్య త్సమ్బన్ధ గ్రహణ విరహా న్నానుమేయం కదాచిత్।
శబ్దాదీనామపి న విషయః స్వాపరోక్ష స్వరూపం
జ్ఞానం జ్యోతి ర్యదిహ పరమం తత్త్వ మధ్యాత్మమూర్తే॥ 51

ప్రతిపదార్థము:- అధ్యాత్మమూర్తే=శరీరమున నుండువాడా!, యత్=ఏది, నృణామ్=మనుష్యుల యొక్క, ఇంద్రియాణామ్=ఇంద్రియముల యొక్క, అశక్తేః= (తెలిసికొనుటలో) శక్తి హీనత వలన, ప్రత్యక్షమ్=ఇంద్రియగోచరము, న భవతి=కాదో, కదాచిత్=ఒకప్పుడైనను, యత్=ఏది, సమ్బన్ధగ్రహణ విరహాత్= సంబన్ధగ్రహణము యొక్క అభావము వలన, న అనుమేయమ్= అనుమేయము కాదో, (యత్=ఏది), శబ్దాదీనామ్ అపి=శబ్దాదుల (ప్రమాణముల)కు, విషయః=

ప్రమేయము, న=కాదో, (యత్=ఏది), ఇహ=ఇచ్చట, స్వాపరోక్ష స్వరూపమ్=తనకు తానే సాక్షాత్కరించునట్టి స్వరూపము కలదో, జ్ఞానమ్=జ్ఞానము అను, పరమమ్=శ్రేష్ఠమైన, జ్యోతిః=వెలుగో, తత్=అది, త్వమ్=నీవు.

తాత్పర్యము:-ఓ అధ్యాత్మమూర్తీ! శివా! ఏది మనుష్యుల ఇంద్రియముల శక్తిహీనత వలన ప్రత్యక్షము కాదో, ఏది ఇంద్రియ సమ్బన్ధమును స్వీకరించక పోవుట వలన ఎల్లప్పుడును అనుమేయము కూడ కాదో, ఏది తనకు తానే సాక్షాత్కరించునో, ఏది శ్రేష్ఠమైన జ్ఞానజ్యోతియో, అది నీవే అయియున్నావు.

వివరణము:- అధ్యాత్మము అనగా శరీరము. దానికి (శరీరమునకు) ఆత్మ అధికరణము కావున దాని కాపేరు. అందుండు మూర్తి కావున శివుడు అధ్యాత్మ మూర్తి అని సంబోధింపబడినాడు. ఆత్మ అనగా శరీరము. శరీరమున నుండునది అధ్యాత్మము.శరీరము నందు ఆత్మరూపమున నుండువాడు కావున శివుడాధ్యాత్మ మూర్తే అని సంబోధింపబడినాడు. అన్ని జంతువులలో మనుష్యుడు (అను జంతువు) శ్రేష్ఠుడు. ఏ జంతువులలోనను మనుష్యుని ఇంద్రియములంత శక్తి మంతములైన ఇంద్రియములు లేవు. కావున జంతునాం నరజన్మ దుర్లభ మిదమ్ (జంతువులలో ఈ నరజన్మ దుర్లభము) అని చెప్పబడినది. ఏదేని ఒక జంతువు యొక్క ఒక ఇంద్రియము, మనుష్యుని ఆ ఇంద్రియముకన్న (డేగకు దృష్టి శక్తి వలె) అధిక శక్తియుతమగుగాక. అన్ని ఇంద్రియములలో మనష్యునకున్న అధికశక్తి లేదు. కావున మనుష్యుడు జంతు ప్రపంచమును శాసించ గలుగు చున్నాడు. కాని ఆ ఇంద్రియములు గ్రహించుశక్తి లేకపోవుట వలన సాధారణ మనుష్యులెవరును తమ ఆత్మను గ్రహించ లేకున్నారు. ఇంద్రియములతో మనుష్యుడెన్ని వస్తువుల గ్రహించ గలుగుచున్నాడు. ఏ జంతువును అన్ని వస్తువుల గ్రహించ లేకున్నది. ఈ విధముగ అధిక శక్తి గల మనుష్యుని ఇంద్రియములకు ఆత్మను దర్శించు శక్తి లేదు. కావున శ్లోకమున "నృణామింద్రియాణా మశక్తేః' అని చెప్పబడినది. మనుష్యేంద్రియములకే ఆత్మను గ్రహించు శక్తి లేదనిన జంతువుల ఇంద్రియములకు శక్తిలేదని 'నృణామ్' అను పదము వ్యంజింపజేయు చున్నది. దీనికి కారణ మింద్రియములు కొన్ని విషయములనే గ్రహింప గలుగుట. శ్రోత్రము శబ్దమును, త్వక్కు స్పర్శమును, చక్షువు రూపమును, రసన రసమును, ఘ్రాణము గంధమును గ్రహించ గలవు. శబ్దాదు లాత్మకు లేవు కావున అవి

లేని ఆత్మను గ్రహించ లేవు. అనగా ఇంద్రియముల అశక్తి వలన ఆత్మ ప్రత్యక్ష మగుట లేదు. పై శబ్దాదులున్న వస్తువు లింద్రియములచే గ్రహింపబడునప్పుడు అవి ప్రత్యక్షము లగును అనుట శాస్త్రవ్యవహారము. శబ్దాదులు లేని వస్తువు అప్రత్యక్షము అనబడును. ప్రత్యక్ష శబ్దము ఇంద్రియగోచరముల బోధించును. ఇంద్రియము లప్రత్యక్షములు. అనగా శబ్దాదులున్న వస్తువులను గ్రహించు సాధనము లింద్రియములు. కావున ఇంద్రియములును ప్రత్యక్ష ప్రమాణములు అనబడును. మనస్సుతో కలిపి ఇవి ఆఱు. శబ్దాదులు ప్రత్యక్ష ప్రమేయములు అనబడును. ప్రత్యక్షమగునది ఆత్మ కాదనగా ఏ ఇంద్రియమునకును ఆత్మను గ్రహించు శక్తిలేదు. కావున నీ శ్లోకమున ప్రత్యక్షం న భవతి అని చెప్పబడినది. ప్రత్యక్ష ప్రమాణము తరువాత జ్ఞానసాధనమైన ప్రమాణము అనుమానము. ప్రత్యక్షము అగు వస్తువు కారణము (హేతువు)గా ప్రత్యక్షము కాని వస్తువును గ్రహించుటకు సాధనమైన ప్రమాణము అనుమానము. ఎక్కడైన పొగ కనబడినచో ప్రత్యక్షమైన ఆ పొగకారణముగా ప్రత్యక్షముకాని నిప్పు ఉన్నదని గ్రహింపగలము. ప్రత్యక్షమైనపొగ గ్రహించిన తరువాత నిప్పును గ్రహించెదము గావున నిప్పును గ్రహించు ప్రమాణము అనుమానమే. ఎక్కడెక్కడ పొగ ఉండునో అక్కడ నిప్పు ఉండును. పొగకు నిప్పున్ననే వచ్చుట, నిప్పు లేనిచో రాకపోవుట అను అవినాభావ సంబంధమును గ్రహించి యుండుట అనుమాన ప్రమాణము అనబడును. ఇదే శాస్త్రమున వ్యాప్తి గ్రహణము అనుమానము అని చెప్పబడును. వ్యాప్తి అనగా పై సంబంధమే. ఈ అనుమానము (ప్రమాణము) వలన గ్రహింపబడు నిప్పు అనుమేయము అని చెప్పబడును. ఆత్మయందు ప్రత్యక్ష ప్రమాణమే వర్తించనప్పుడు ప్రత్యక్ష వస్తు సంబంధమున (వ్యాప్తిచే) గ్రహింపబడు వస్తువు (అనుమేయమైన నిప్పు) వలె ఆత్మ అనుమేయ మెప్పుడును కాజాలదు. ఇది రెండవ పాదము యొక్క భావము. (వివరణములో పేర్కొనబడిన శబ్దాదులు శబ్ద స్పర్శ రూప రసగంధములు). సుఖదుఃఖాదులు మనస్సు అను అంత రింద్రియముచే గ్రహించబడును. అవియు ప్రత్యక్షములే. మనస్సును ప్రత్యక్ష ప్రమాణమే. శ్లోకమున శబ్దాదీనామ్ అను పదమున్నది. శబ్దాదీనామ్ అను పదము శబ్దము ఉపమానము అనుపలబ్ధి అర్థాపత్తి మొదలగు ప్రమాణముల యొక్క అను అర్థమిచ్చును. ఈ శబ్దాది ప్రమాణములకు ఆత్మ విషయము కాదు. అనగా ప్రమేయము కాదు అని అర్థము. కావున ఆ ప్రమాణములును ఆత్మను

గ్రహింప లేవు. చివరి కే ప్రమాణము కూడ ఆత్మను గ్రహింప లేదు అని తేలినది. అట్లగుచో ఆత్మకు సత్త ఉండదు. సత్తా హీనమైనచో శూన్యమగును గదా అను ప్రశ్నము కలుగును. నాలుగవ పాదమున ఆత్మ స్వాపరోక్ష స్వరూపమ్ అని చెప్పబడినది. ఏ ప్రమాణము లేకపోయినను తనకు తానే అది దీపము వలె స్వయంప్రకాశము అగును అని ఆ శబ్దమునకు అర్థము. అది జ్ఞానజ్యోతి. జ్యోతివలె జ్ఞానము స్వయం ప్రకాశము అని చెప్పబడినను కన్నులేనిదే అది తెలియబడదు. కావున ఆత్మవలె స్వయం ప్రకాశము కాదు. నేనున్నాను అనుటకు నీకేమైన ప్రమాణము కావలెనా? నీకు ఏ ఇంద్రియము లేకున్నను నేనున్నాను అని నీ వనుచునే యున్నావు. ప్రత్యక్ష ప్రమాణముకాని దాని ననుసరించి పని చేయు అనుమాన శబ్దాది ప్రమాణము లేవియు లేకున్నను నీ ఆత్మ నీకు స్వయముగా గోచరించు చునే యున్నది. కావున నేనున్నానా, లేనా, అని నీకు సంశయము కలుగుట లేదు. ఉన్నానను నిశ్చయమే నీకున్నది. జ్ఞాన స్వరూపమైనది ఆత్మ. అన్ని వస్తువుల గ్రహించుట కాత్మయొక్క జ్ఞాన స్వరూపమే కారణము. జ్ఞాతృజ్ఞేయములు లేని సమాధి యందును అది ప్రకాశించును. ఇతర దశలలోను అది జ్ఞాతృజ్ఞ జ్ఞేయాకారమై త్రిపుటిగా భాసించును. కాని ఆత్మ తప్ప మరొక పదార్థమే లేదు. ఒక వేళ అన్య పదార్థము భాసించినను అది మిథ్యయే కాని సత్యము కాదు. తత్త్వమనగా సత్యము. కావున ఆత్మ యొక్కటే పరమతత్త్వము. మనకు ఆత్మయే స్వయం ప్రకాశమై యున్నది గదా. ఆత్మ ఆనంద స్వరూపము కదా. అయినచో మనకు ఆనందమేల కలుగుట లేదు. శివుడు ఆనంద స్వరూపు డని శాస్త్రములు చెప్పుచున్నవి. జీవుడు శివునకన్న వేఱు కాదు. కావున ఆతడును ఆనంద స్వరూపుడే గదా! జీవున కీ దుఃఖానుభవమేల? అను ప్రశ్నము కలుగును. జీవుడు తాను శివునకన్న వేఱని భావించుటయే దానికి కారణము. నిద్రయందా శివునకన్న నేను వేరు అను మిథ్యాజ్ఞానము లేదు కనుక దుఃఖము యొక్క అనుభవము లేదు. జీవుడును (నేనును) శివుడనే శుద్ధాత్మ రూపుడైన శివుడు తప్ప వేరేదియు లేదు. వేఱుగా నేదైన భాసించినదా?అది మిథ్యయే. అది మిథ్యా జ్ఞానమే. ఈ అధ్యాత్మ విషయ నిరూపణముగల ఈ శ్లోకమున శివుని అధ్యాత్మ మూర్తే అని సంబోధించుట ఉచితముగా నున్నది.

అవతారిక:- పై శ్లోకమున ఆత్మ ప్రమాణగమ్యము కానిదని స్వాపరోక్షమని చెప్పబడినది. ఈ శ్లోకమున అట్టి ఆత్మను సాక్షాత్కరించుకొన్నవారు జీవన్ముక్తు లగుదురని చెప్పబడు చున్నది.

శ్లో॥ త్వామాత్మానం వరద పరమానన్ద బోధ స్వరూపం
యే బుధ్యన్తే విగళిత జగద్భేద మాయా ప్రపఞ్చమ్।
రాగత్యాగాత్ స్తిమిత మనసో దేవ జీవన్త ఏవ
భ్రశ్య న్మాయా నిగళ నిబిడ గ్రన్థయ స్తే విముక్తాః॥ 52

ప్రతిపదార్థము:- దేవ=ఓ దేవా!, ఆత్మానమ్=ఆత్మవైన, పరమానన్ద బోధ స్వరూపమ్=పరమ (సత్) చిదానంద స్వరూపుడవైన, విగళిత జగద్భేద మాయా ప్రపంచమ్=జారిపోయిన జగద్భేద మాయాప్రపంచము గల, త్వామ్=నిన్ను, యే=ఎవరు, బుధ్యన్తే=ఎఱుగుదురో, రాగత్యాగాత్=రాగమును వదులుట వలన, స్తిమిత మనసః=నిశ్చల మనస్సుగల, తే=వారు, జీవన్తఏవ= బ్రతికియున్నవారు గానే, భ్రశ్యన్మాయానిగళ నిబిడ గ్రన్థయః=జారుచున్న మాయ అను సంకెల గట్టి ముడులు గలవారై, విముక్తాః=విముక్తులు.

తాత్పర్యము:- ఓ దేవా! నీవు పరమజ్ఞానానంద రూపుడవు. జగద్భేద మాయా ప్రపంచము లేని వాడవు. అట్టి నిన్ను స్వాత్మగా నెఱుగువారు రాగము తొలగుట వలన నిశ్చలమైన మనస్సుగలవారై మాయాశృంఖలాగ్రన్థులు వీడినవారై బ్రతికి యుండగానే ముక్తిని పొందిన వారగుదురు.

వివరణము:- శివుడు పరమానంద జ్ఞాన స్వరూపుడు. స్వరూప శబ్దము చేత ఆతని పార మార్థిక సత్త వ్యంగ్యమగు చున్నది. దేనికన్న ఉత్తమమైన ఆనందము లేదో అది పరమానందము. దేనికన్న ఉత్తమమైన జ్ఞానము లేదో అది పరమ బోధము (జ్ఞానము). దేనికన్న ఉత్తమ సత్తలేదో అది పరమసత్త. పరమసత్త అనగా పారమార్థిక సత్త. ఇది గాక వ్యావహారిక ప్రాతిభాసిక సత్తలున్నవి. ఈ వ్యావహారిక ప్రాతిభాసిక పారమార్థిక సత్తా త్రయమున పారమార్థిక సత్త ఒక్కటే పరమసత్త. మిగిలిన రెండు మిథ్యా జాగ్రత్స్వప్న గతములు. వ్యావహారిక సత్త జాగ్రద్గతము, ప్రాతిభాసిక సత్త స్వప్నగతము. జాగ్రత్స్వప్నములు రెండును త్రికాలాబాధ్యములు కావు. కావున వాని సత్తలు నేతి బీరకాయలే. అట్లే విషయానందములు కూడ పరమానందములు కావు. అట్లే విషయజ్ఞానములు పరమ జ్ఞానములు కావు. కావున శివుడొక్కడే పరమసత్య జ్ఞానానన్ద రూపుడు పరమ సచ్చిదానన్దమూర్తి. పరమానన్దబోధ స్వరూపుడవైన శివుని స్వాత్మగా నెఱుగుట శివజీవైక్య జ్ఞానము, జీవ బ్రహ్మైక్య జ్ఞానము, ప్రత్యగ్బ్రహ్మైక్య జ్ఞానము,

అని పేర్కొనబడు చుండును. ఆ జ్ఞానము కలిగినచో మాయా శృంఖలల ముడులు వీడిపోవును. మాయయే తొలుగగా స్వభిన్నముగా జగమే తోచదు. ఇక దానిలోని పదార్థములపై రాగ మెట్లుండును. వాని పట్ల ఆతనికి వైరాగ్యమే ఉండును. తన చంచల స్వభావము కోల్పోవుటచే ఆ మనస్సు అమనస్సు అనియే చెప్పబడును. బ్రతికి యుండగనే జీవ బ్రహ్మైక్యజ్ఞానము గలవారు ముక్తులు. వారికి సంసార బన్ధము లేదు. ఆ ముడి వీడిపోయినది గదా! మాయయు లేదు. మాయిక ప్రపంచమును లేదు. మాయా విస్మృతి చేత వారు మోహపడుటయు లేదు. ఈ జీవన్ముక్తులకు (న తస్యప్రాణా ఉత్క్రామన్తి అత్రైవ సమవలీయన్తే) మరణ సమయమున ప్రాణము లూర్ధ్వలోకములకు పోవు. ఇక్కడనే వాయువులో లీనములగును. మరణానంతరము వారు పొందునది కైవల్యమే ఏకత్వమే. శివజీవైక్యమే.

అవతారిక:- పై శ్లోకమున శివుని స్వాత్మగా నెఱుగువారు రాగ హీనులు, జీవన్ముక్తు లగుదురని చెప్పబడినది. ఈ శ్లోకమున రాగము తొలగిన ఆ జీవన్ముక్తులకు సర్వలోకాధి పత్యముగాని అణిమాది సిద్ధులు గాని అంతరాయము లే అని చెప్పబడు చున్నది.

శ్లో॥ శ్లాఘ్యం యత్తత్కృపణ మనసాం సర్వలోకాధిపత్యం
యా మృగ్యన్తే తరల మతిభిః సిద్ధయ శ్చాణిమాద్యాః।
ఏతత్సర్వం మదనదహన త్వత్పదప్రాప్తి భాజాం
తత్త్వజ్ఞానామృతరసజుషాం యోగినా మన్తరాయః॥ 53

ప్రతిపదార్థము:- మదనదహన=ఓ మన్మథుని కాల్చిన వాడా!, కృపణ మనసామ్=పేదమనసులు గల వారికి, యత్=ఏది, శ్లాఘ్యమ్=మెచ్చుకొనదగినదో, తత్=ఆ, సర్వలోకాధిపత్యమ్=సర్వలోకాధి నాయకత్వము, తరల మతిభిః=చంచల బుద్ధి గల వారి చేత, యాః=ఏవి, మృగ్యన్తే=వెదుకబడునో, (తాః=అ), అణిమాద్యాః =అణిమ మొదలైన, సిద్ధయఃచ=సిద్ధులును, ఏతత్=ఇది, సర్వమ్=అంత, (ఇవి అన్ని), త్వత్పదప్రాప్తి భాజామ్=నీ పదము నందుకొన్న, తత్త్వ జ్ఞానామృత రసజుషామ్=తత్త్వజ్ఞానమను అమృత రసమును పొందిన, యోగినామ్= యోగులకు, అంతరాయః=విఘ్నము.

తాత్పర్యము:- సర్వలోకాధిపత్యమును పేదమనసు గలవారు మాత్రమే

మెచ్చుకొందురు. చంచల బుద్ధులే అణిమాది సిద్ధులకై ఆరాటపడుదురు. ఓ మదనదహనా! ఇది యంతయు నీ పదము నందుకొన్న తత్త్వజ్ఞానామృత రసమును పొందిన యోగులకు విస్ఫురూపమే.

వివరణము:- కృపణ శబ్దమునకు పేద, లుబ్ధ, అనుకంపనీయ మొదలగు అర్థము లున్నవి. మనసులోనికి పేద తనమనగా ఎప్పుడు ఏదియో కోరుచుండుట, అవి తీరినను మరల నేదియో కోరుట, ఇట్లు వారి మనసులో నేదో కొఱత యుండును. వారికింట సకలైశ్వర్యము లున్నను వారి మనసులో నేదో కొఱత యుండును. కావున వారి మనసు పేద అనియే చెప్పవలెను. లుబ్ధ శబ్దమునకు దాదాపు ఇదియే అర్థము. అది ఆశగల వారిని బోధించును. కొఱత ఉన్నవారే ఆశించెదరు గదా! జ్ఞానులిట్టి నశ్వరములను కోరుకొను అజ్ఞానులను చూచి జాలిపడుదురు. కావున వారు అనుకంపనీయులైనారు. ఇట్టి కృపణ మనసులు ఏవేవో కోరి అవి తీరినను తృప్తినందక చివఱకు సర్వలోకాధిపత్యమును కోరుదురు. వారికది చివరి కోరిక. అంతకన్న మించిన గొప్ప పదవి లేదు గదా!. చంచల మనస్కులు అష్టసిద్ధులకై ఆరాటపడు చుందురు. అణిమ (చిన్నగా అగుశక్తి), మహిమ (పెద్దగా అగుశక్తి), లఘిమ (బరువును తగ్గించుకొను శక్తి), గరిమ (బరువును పెంచుకొను శక్తి), ప్రాప్తి (కోరినచోటికి పోగల శక్తి), ప్రాకామ్యము (కోరిన వస్తువును పొందు శక్తి), ఈశత్వము (అందఱపై అధికారము చేయుశక్తి), వశిత్వము (తన మనసుపై అధికారము చేయు శక్తి), ఇవి అష్టసిద్ధులు. అష్టైశ్వర్యములు కూడ ఇవియే అని కొందఱు చెప్పెదరు. ఇవియేవియు ఉత్తమ యోగులు పొందవలెనని కోరరు. సాధారణ యోగులీ శక్తుల చూపి గౌరవాదులు పొంద గోరుదురు. వారు చంచల మనస్కులే. ఇవి ఉన్నచో వీనిని ప్రయోగించు ప్రలోభమునకు గురియగుదురేమో. అప్పుడు మోక్ష సాధనమునకు అంతరాయములే యగునని ఉత్తమ యోగులు తత్త్వమెఱిగిన జ్ఞానులును ఐనవారు భావించెదరు. సర్వలోకాధిపత్య సౌఖ్యమును స్వాత్మ కైవల్యానందము నకు సరికాదు అని దాని యందును వైరాగ్యము కలిగి యుందురు. శివ పదమును, భక్తిని పొందిన వారును ఇట్టి వైరాగ్యమునే కలిగి యుందురు.

అవతారిక:- పై శ్లోకమున అణిమాది సిద్ధులు సర్వలోకాధిపత్యాంతమైన అధికారమును మోక్ష మార్గమున అంతరాయమే అని చెప్పబడినది. ఈ శ్లోకమున

ఆత్మజ్ఞానము లేనివారి సకల సన్న్యాసనియమములు వ్యర్థములని చెప్పబడు చున్నవి.

శ్లో॥ ఆశావాసః శయన మవని ర్బ్రహ్మచర్యం చ దీర్ఘమ్
మౌనం దణ్డ గ్రహణ మశనమ్ భిక్షయా భస్మశౌచమ్।
వైరాగ్యం చ త్రినయన! భవత్తత్త్వబోధా ద్విహీనం
తూలాదేవ హ్యుపల లవనమ్ సర్వమేత ద్విభాతి॥ 54

ప్రతిపదార్థము:- త్రినయన=ఓ ముక్కంటీ, వాసః=వస్త్రము, ఆశాః=దిక్కులు, శయనమ్=శయ్య, అవనిః= భూమి, దీర్ఘమ్=దీర్ఘమైన, బ్రహ్మ చర్యమ్ చ=బ్రహ్మ చర్యమును, మౌనమ్=మౌనము, దండగ్రహణమ్=దండమును ధరించుట, భిక్షయా=భిక్షతో, అశనమ్=తిండి, భస్మశౌచమ్=భస్మముతో (శరీరమును) శుభ్రము చేసికొనుట, వైరాగ్యమ్ చ=వైరాగ్యమును, భవత్తత్త్వబోధాత్=నీ తత్త్వము యొక్క బోధ నుండి, విహీనమ్=దూరమైనచో, ఏతత్=ఇది, సర్వమ్=అంత, తూలాద్ ఏవ హి=దూదితోనే, ఉపల లవనమ్=ఱాతిని బద్దలు చేయుటగా, విభాతి=తోచును.

తాత్పర్యము:- బట్టలు విడిచి యుండుట, భూమిపై పడుకొనుట, చాల కాలము బ్రహ్మ చర్యము పాటించుట, మాట్లాడకుండుట, దండము ధరించుట, భిక్షాన్నము భుజించుట, ఒడలంతటిని బూడిదతో రుద్దుకొనుట, వైరాగ్యము ఈ నియమముల పాలనము ఆత్మజ్ఞానము కలుగనిచో దూదితో బండను బద్దలు చేయుటకు యత్నించుటవలె వ్యర్థమే అగును.

వివరణము:- ఆత్మజ్ఞానము కొఱకు స్వీకరింపబడు సన్యాసము వివిదిషా సంన్యాసము. ఆత్మ జ్ఞానము కలిగిన పిమ్మట స్వీకరింపబడిన సంన్యాసము విద్వత్సంన్యాసము. ఈ రెండు సంన్యాసములలో నియమములు సాధారణములు గానే ఉండును. 1) అల్పవస్త్రధారణము- కౌపీన మాత్రధారియై ఇతర వస్త్రములను ధరింపకుండుట, కౌపీనముతో పాటు ఉత్తరీయాన్తరీయములుగా నొకే వస్త్రమును ధరించుట. కంచుక (చొక్కాకోటు) మొదలగువానిని ధరింపకుండుట. ఆ కొద్ది వస్త్రములును కాషాయ వర్ణముకల వానినే ధరించుట సంన్యాసనియమము. అసలు వస్త్రములనే ధరింపకుండుట (దిగంబరత్వము) వీనిలో చివరది ఆశావాసః అని శ్లోకమున పేర్కొనబడినది. 2) భూమిపై పడుకొనుట - భూమిపై దర్భ

తృణాదుల పఱచుకొని పడుకొనుట మరొక నియమము. 3) దీర్ఘ బ్రహ్మచర్యము - పరబ్రహ్మము నందు మనస్సును చరింపజేయుట. ఇతర సంసార విషయము లందు చరింపనీయ కుండుట, స్త్రీ సంగ పరిత్యాగము. వేదోపనిషదాది సద్గ్రంథ పఠనము. 4) మౌనము (మాట్లాడకుండుట)-మనస్సును కూడ చలింపనీయ కుండుట. 5) దండగ్రహణము - త్రిదండముల నొకచో కట్టి ధరించుట (వైష్ణవ సన్న్యాస నియమము) దండమును చివఱకు గుడ్డ(జెండావలె) కట్టియున్న దానిని ధరించుట. 6) భిక్షాన్న భోజనము. 7) ముఖబాహూరూరోముఖాద్యవయవము లందు భస్మ త్రిపుండ్రములధరించుట భస్మశౌచము. 8) వైరాగ్యము - ఇది అన్ని నియమముల కన్న మిన్నయైనది. జీవబ్రహ్మైక్యము తప్ప ఎట్టి కోరిక లేకుండుట. శ్లోకమున చెప్పబడిన ఈ ఎనిమిది నియమములు సంన్యాస నియమములని సాధారణముగా పేర్కొనబడినను నిస్త్రైగుణ్యమార్గమున విహరించు సన్న్యాసులకే నియమముల నెవరును కల్పించజాలరు. ఇన్ని నియమముల పాటించుట జీవబ్రహ్మైక్య ధ్యాన జ్ఞానములకు సహకరించు నుద్దేశము తోడనే. వీనిలో నేవేని నియమములు వాని కుపయోగించవేని వాని వదలివేయుటలో సన్న్యాసి సంకోచింప నక్కఱలేదు. ముఖ్యమైన దాత్మ జ్ఞానమే, అదియే కావలెను. నియమములు కావు. ఇతరులా ఉత్తమాశ్రమమును గుర్తించి వారిని గౌరవించుటకే ముఖ్యముగా ఇవి ఉపయోగించును. వారికి కూడ కొంత ఉపయోగించ వచ్చును. ఈ నియమముల లోక గౌరవము కొఱకే పాటించు తత్త్వజ్ఞానవిహీనులు పరోక్షాపరోక్ష బ్రహ్మజ్ఞానము లేని వారైనచో ఆ నియమములు బ్రహ్మ జ్ఞానము సాధనములుగా మలచు కొనలేని వారు నియమముల తోడనే ఆత్మ తత్త్వ జ్ఞానము సంపాదించుకొనగలమని అహంకరించు వారు దూదితో ఱాతిని పగుల గొట్ట యత్నించువారివలె వ్యర్థ ప్రయత్నులై బ్రహ్మజ్ఞానమునకు దూరులయియే యుందురు. అన్ని నియమముల కన్న తత్త్వ బోధన కొఱకై ఈశ్వరానుగ్రహమును గురూప పద్యాదుల నొనరించుట కై నిరంతరము యత్నించుటయే వివిదిషా సన్న్యాసులకు ముఖ్యమైన నియమము. విద్వ త్సన్న్యాసుల నియమములు ఇతర సన్న్యాసులకు ఆదర్శముగా వారికి అలంకారములుగా నుండును.

అవతారిక:- పై శ్లోకమున బ్రహ్మ జ్ఞానాభిముఖ్యములుకాని నియమముల వైయర్థ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున కర్మ లభ్యములైన ఇంద్రాదిలోకముల

అశాశ్వతత్వమును పురస్కరించుకొని కర్మయోగనింద నిత్య (సుఖద)మైన శివపదప్రాప్తికి ఇతర యోగములకన్న సులభ హేతువైన జ్ఞానయోగము యొక్క ప్రశంస వ్యంజింజేయబడు చున్నది.

శ్లో॥ స్థిత్వా కాలం చిరతరమపి బ్రహ్మ శక్రాది లోకే
కర్మచ్ఛేదాత్ పునరపి తతః స్యాదవశ్యం నిపాతః।
ఏకం నిత్యమ్ పద ముపనతం క్లేశ కర్మోర్మి దూరం
శైవం యోగా త్పరమ సులభ జ్ఞాన యోగేన పుంసామ్॥ 55

ప్రతిపదార్థము:- చిరతరమ్=ఎక్కువయైన, కాలమ్=కాలము, బ్రహ్మశక్రాది లోకే=బ్రహ్మేంద్రాది లోకమున, స్థిత్వా అపి=ఉండికూడ, కర్మచ్ఛేదాత్=కర్మ యొక్క నాశము వలన, పునఃఅపి=మరలకూడ, తతః=దాని (ఆ లోకము) నుండి, అవశ్యమ్=తప్పక, నిపాతః=పడిపోవుట, స్యాత్=సంభవించును, క్లేశకర్మోర్మి దూరమ్=క్లేశములకు, కర్మలకు ఊర్ములకు దూరమైన, ఏకమ్=ఒకటైన, నిత్యమ్= నిత్యమైన, పదమ్=పదము, శైవమ్=శివునకు సంబంధించిన మతము, యోగాత్= యోగముకన్న, పరమ సులభ జ్ఞాన యోగేన=మిక్కిలి సులభమైన జ్ఞాన యోగము తో, పుంసామ్= పురుషులకు, ఉపనతమ్=ప్రాప్తము (భవతి=అగుచున్నది).

తాత్పర్యము:- ఎంత ఎక్కువ కాలము బ్రహ్మేంద్రాది లోకములలో నున్నను కర్మ యొక్క (కర్మాపూర్వము యొక్క) నాశము వలన ఆ లోకముల నుండి మరల మర్త్యలోకమునకు రాక తప్పదు. తిరిగి రానవసరము లేనిది శివపదము ఒక్కటే. అది నిత్యము. దానిని పొందుటకు కర్మ యోగాదీతర సాధనములకన్న మిక్కిలి సులభమైన జ్ఞాన యోగమున పురుషులకు లభించును. ఆ శివపదమున క్లేశము కర్మలు ఊర్ములు యేవియు నుండవు. (ఆనన్దము మాత్రమే ఉండును).

వివరణము:- అశ్వమేధ పౌండరీకాది కర్మలకు బ్రహ్మలోక ప్రాప్తి ఫలము చెప్పబడినది. జ్యోతిష్టోమాది కర్మలకు ఇంద్రలోకము (స్వర్గము) ఫలముగా చెప్ప బడినది. ఈ లోకమున చేసిన సత్కర్మ పరలోకమున సుఖమెట్లు కలిగించును. అట్లే ఈ లోకపు పాపకర్మ నరకాది పరలోక క్లేశము నెట్లు కలిగించును? కర్మచేయబడిన వెంటనే కర్మ నశించును అయినను సత్కర్మ నుండి పుణ్యా పూర్వము దుష్కర్మ నుండి పాపాపూర్వము జనించును. ఈ అపూర్వము

(పుణ్యము లేక పాపము)ను పుట్టించిన వెంటనే పుట్టించిన కర్మ నశించును. సత్కర్మవలన కలిగిన పుణ్యాపూర్వము (పుణ్యము) కాలాంతరమున లేక లోకాంతరమున సుఖము నెంత కాలము వఱకు కలిగించవలెనో అంతకాలము కలిగించి నశించును. అట్లే దుష్కర్మాపూర్వము (పాపము) కూడ కాలాంతరమున లేక లోకాంతరమున ఎంతకాలము దుఃఖము కలిగించ వలెనో అంతకాలము కలిగించి నశించును. కర్మ ఈ లోకమున్ననే నశించును. అది క్షణికము. దాని వలన పుట్టిన అపూర్వ మట్లు క్షణికము కాదు. భిన్న భిన్న కర్మల వలన కలిగిన అపూర్వములు భిన్నభిన్నకాల లోకములలో భిన్నభిన్న పరిమితి గల కాలము పూర్తిఅగు వరకు ఉండును. ఆ పరిమితి గల కాలము పూర్తికాగానే ఆ అపూర్వము నశించును. ఇది క్షణికము కాదు. కాని అనిత్యము. కర్మ అనగా చేయబడినది. అనగా పుట్టినది. కావున నశింపక తప్పదు. నశించు కర్మవలన కలిగిన అపూర్వముకాని దాని వలన కలిగిన స్వర్గనరకములు కూడ నశించునవే అగును. బ్రహేంద్ర లోకములు అశ్వమేధ పౌండరీక జ్యోతిష్టోమాది కర్మా పూర్వజన్యములు. కావున నశించునట్టివే అగును. బ్రహ్మేంద్రాది లోకములు కూడ కాల పరిమితి గలవే. పుణ్యాపూర్వము యొక్క కాలపరిమితి ముగియగానే బ్రహ్మేంద్రాది లోకములును నశింప వలసినవే. భోగకాల పరిమితి ముగిసిన తరువాత మరల వెనుకకు అధోలోకమునకు అనగా మనుష్యలోకమునకు ఊర్ధ్వలోకముల నుండి అనగా బ్రహ్మేంద్రాది లోకముల నుండి పడుట తప్పదు. ఏ కర్మయైనను పరిమిత భోగ కాలానుభవనీయమైన సుఖమునో దుఃఖమునో ఇచ్చును. కాని అనంత కాలానుభవనీయ సుఖమునో దుఃఖమునో ఈయ జాలదు. శివపదము నిత్యము. అది ఆత్మ జ్ఞానము వలన కలుగును. ఆత్మ జ్ఞానమనగా అంతయు ఆత్మయని తెలియుట లేక తానే బ్రహ్మమని తెలియుట. కావున దానిని పొందుట సులభము. మిగిలిన యమనియమాష్టాంగ యోగము దీనికన్న కష్టతరము. శివపదము నొందిన వారికి క్లేశము లుండవు. క్లేశము లైదు. అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము. కర్మలుండవు అనగా పుణ్యాపాప కర్మలు రెండును ఉండవు. శరీరము మనస్సు ఉండనప్పుడు అవి ఉండుటకు అవకాశము లేదు. ఊర్ములు అనగా క్షుత్పిపాసలు, శోక మోహములు, జన్మబన్ధములు, మొత్తము ఆఱు, ఇవి యేవియు శివపదమును పొందిన వారి కుండవు. కావున శ్లోకమున శివపదము క్లేశకర్మోర్మి దూరము అని చెప్పబడినది. బ్రహ్మలోకము నుండి

పునరావృత్తి లేదు అని ఒక సిద్ధాంత మున్నది. ఆ బ్రహ్మ లోకము ఈ శ్లోకమున ఉద్దేశింపబడిన బ్రహ్మ లోకము (చతుర్ముఖ బ్రహ్మ లోకము) నకు భిన్నము. ఈ బ్రహ్మలోకము చతుర్ముఖ బ్రహ్మలోకము కావున ఇది పునరావృత్తి గలదియే.

అవతారిక:- పై శ్లోకమున బ్రహ్మేంద్రాది లోకముల అనిత్యత చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ లోకములలోని సుఖము నరకదుఃఖ తుల్యమని చెప్పబడు చున్నది.

శ్లో॥ శక్రాదీనాం క్రతుఫల జుషాం యత్సుఖం నాకలోకే
తత్కీటాదే ర్నరక నిలయస్యాపి తుల్యం విభాతి।
యేనైకాన్తం న భవతి సుఖం కస్యచి న్నాస్తి దుఃఖం
ద్వన్ద్వగ్రస్తం త్రిభువన మిదం త్వం తు తస్మా ద్విముక్తః॥

ప్రతిపదార్థము:- క్రతు ఫలజుషామ్=యజ్ఞఫలమును పొందు, శక్రాదీనామ్= ఇంద్రాదులకు, నాకలోకే=స్వర్గలోకమున, యత్= ఏ, సుఖమ్, (అస్తి=ఉన్నదో), తత్= అది, నరకనిలయస్య=నరకము నందు నివసించుదానికి, కీటాదేః= కీటము మొదలగు ప్రాణివిశేషమునకును, తుల్యమ్=సమానమే, యేన=దేనితో, కస్యచిత్= ఎవనికిని, ఏకాంతమ్=చివఱకు ఏకమైన నియతమైన, సుఖమ్=సుఖము, న భవతి=లేదో, దుఃఖమ్=దుఃఖము, న+అస్తి= లేదో, ఇదమ్= ఈ, త్రిభువనమ్= ముజ్జగము, ద్వంద్వగ్రస్తమ్=ద్వంద్వములతో మ్రింగబడినదో, త్వం తు=నీవు మాత్రమే, తస్మాద్=దాని నుండి, విముక్తః=విడవడిన వాడవు.

తాత్పర్యము:- యజ్ఞఫలము ననుభవించు ఇంద్రాదులకు కలుగు సుఖముగాని నరకము నందున్న లేక కీటము మొదలైన ప్రాణికి కలదు. దేని (అజ్ఞానము)తో ఎడతెగని సుఖము దుఃఖమును కలుగదో, ఈ త్రిభువనమంతయు ద్వంద్వ గ్రస్తమైనదో, నీవు దాని (అజ్ఞానము) నుండి ముక్తుడవు.

వివరణము:- యజ్ఞ కర్మ జన్యమైన అపూర్వము యొక్క తారతమ్యము ననుసరించి స్వర్గము నందే ఇంద్రాదులున్నను వారి సుఖమేక రూపము కాదు. సమానమును కాదు. స్వర్గలోకమునందలి సుఖము సాతిశయమే కాని నిరతి శయము కాదు. సాతిశయమైన సుఖము నరకలోకము నందున్న ప్రాణికిని కలుగును. కీటాది క్షుద్రజంతువునకును కలుగును. సాతిశయ దుఃఖముచే వ్యవహితము కానిచో సుఖము సుఖముగానే తోచదు. సాతిశయ సుఖముచే

వ్యవహితము కానిచో దుఃఖము దుఃఖముగానే తోచదు. అనగా అల్పకాలాను భావ్య సుఖము దుఃఖముచే గాని అల్పకాలానుభావ్య దుఃఖము సుఖముచే గాని వ్యవహితమగు చుండునపుడు ఆ అనుభవ విషయ భేదము దాని వలన నేర్పడు అనుకూల ప్రతికూల వేదనీయుతలోని భేదము అనుభవించు వారికి తెలియును. లేనిచో తెలియదు. అట్టి వ్యవధానము కొంత కాలముండునది నిద్రా సుఖమొక్కటి అది సాతిశయము కాదు. నిత్యసుఖమైన మోక్షము నందు సాతిశయత ఉండదు. అది నిరతిశయమే అయి యుండును. దాని అనుభవము రవంత కాలమను భవించిన మరల మరల నదియే కావలె ననుపించును. నిద్రలో నిరతిశయ సుఖమున్నను అది అజ్ఞానముతో కూడి యుండును. సమాధిలోని సుఖము అజ్ఞాన రహితమై యుండును. కావున ఇదియే మోక్ష సుఖముతో దాదాపు తుల్యమని చెప్పవచ్చును. దాదాపు అనుటేల అనగా సమాధి కూడ కొంత కాలము పిమ్మట తొలగి పోవును. నిద్ర నుండి లేచినట్లుగా సమాధి నుండి వ్యుత్థానము కలుగును. త్రిభువనమనగా నిట సమస్త భువనములనియే అర్థము. ఏ లోకము నందైనను సుఖము సాతిశయముగనే ఉండును. స్వర్గలోకమున నున్నను ఇంద్రునకు దగ్గఱగా లేకపోయితిననే అని కించి ద్దుఃఖ ముండును. మరొకడు ఆతనికి దగ్గఱగా నున్నాడే అని ఆతని పట్ల ఈర్ష్యయు కలుగుచుండుటచే రాగ ద్వేషములు కలుగు చుండును. రాగ ద్వేషములు సుఖదుఃఖములు మొదలగు నవి ద్వంద్వములు. ఇవి పుణ్యలోకములైన ఇంద్రాది లోకములందును, పాపలోకము లైన నరకాది లోకములందును ఉండును. పుణ్యలోకములనగా పుణ్యకర్మ చేసిన వారికి లభించు లోకములు, పాపలోకములనగా పాపకర్మ చేసిన వారికి లభించు లోకములు, ద్వంద్వములకు నిలయములే అవి ద్వంద్వ గ్రస్తములే. అజ్ఞానము దాని వలన పుణ్యాపాపకర్మలు వాని వలన వివిధ దేహములు వివిధ సుఖ దుఃఖములు కలుగు చుండును. ఈ సుఖమున సుఖాధిక్యమేగాని సంపూర్ణత లేదు. కావున ఇట్టి సుఖమును వివేకముగల వారపేక్షింపరు. భగవత్ప్రేమ తీవ్రముగా నున్నవారు భగవద్విరహ సమయమున లభించు ఎట్టి సుఖము నందాదరము చూపరు. భగవత్ప్రాప్తి కలుగుననినచో దానికై ఎంతటి నరక తుల్యాధిక దుఃఖముల ననుభవించుటకు సిద్ధముగా నుందురు. ఆత్మ జ్ఞానము లభించిన జీవన్ముక్తుడు. ఆ జీవన్ముక్తుడు మరణించి కైవల్యముక్తుడైన, వాడుగాని పరమేశ్వరుడుగాని ఏకాంత సుఖము ననుభవించు చుందురు. వీరు తప్ప పుణ్యా

బలమున లభించిన స్వర్గాదులలో కించి ద్దుఃఖములను అనుభవింపక తప్పదు. స్వర్గాదులలోని వారు గాని అచ్ఛమైన అనగా పూర్ణమైన సుఖము ననుభవించరు. మహాపాపలభ్యములైన నరకాదులలోను సంపూర్ణ దుఃఖమనునది ఉండదు. కించిత్సుఖ మచ్చట కూడ నుండును. సుఖానుభవానంతరము తద్భిన్నముగా ప్రాప్తము. కావుననే నరక భోగము దుఃఖముగా భాసించును. సుఖములలో సుఖ, సుఖతరము లుండును. దుఃఖములలో కూడ దుఃఖ దుఃఖతరము లుండును. ఒకప్పుడు సుఖతర సుఖానుభవానంతర లభ్యమైన సుఖము దుఃఖ సదృశముగా తోచును. అట్లే దుఃఖతరానుభవానంతర ప్రాప్తమైన దుఃఖము సుఖ సదృశముగా తోచును. వేప చేదు. తినగా తినగా చేదుగా తోచుట మానునట్లు దీర్ఘ దుఃఖానుభవము కాలానంతరమున దుఃఖము దుఃఖముగా తోచకుండును. దీర్ఘకాల సుఖానుభవానంతర మా సుఖము సుఖముగా తోచకుండును. ఈ వివరణమంతయు సాతిశయ సుఖము పూర్ణసుఖము కాదని తెలుపుటకే. కావుననే వివేకులు నిరతిశయ సుఖరూప మోక్షమునే కోరుచుందురు. దాని దృష్టితో సాతిశయ సుఖమును నరక తుల్యముగానే భావించెదరు. ఇది గాక పరిమిత కాల స్వర్గ సౌఖ్యానుభవానంతరము మనుష్యలోకమున వచ్చి పడిన వానికీ భూతల సుఖము సుఖముగానే తోచదు. దుఃఖముగానే తోచును. అట్లే జాతిస్మర జీవన్ముక్తుల పూర్ణానుభవము కన్న వారి పూర్వ స్వర్గ సౌఖ్యము చాలా అల్పమని విన్న సామాన్యులకు స్వర్గముపై నంతగా ఆదర మేర్పడదు.

అవతారిక:- పై శ్లోకమున నిరతిశయ సుఖ దృష్టితో సాతిశయ సుఖపుణ్యాలోక వాసము కూడ నరక దుఃఖతుల్యమని చెప్పబడినది. ఈ శ్లోకమున నిరతిశయ సుఖము కన్న భగవద్దాస్య (భక్తి) మే గొప్ప అని చెప్పబడు చున్నది.

శ్లో॥ బన్ధచ్ఛేదా దిహ తనుభృతాం యత్త్వయాసాక మైక్యం
సా చేన్ముక్తి శ్శివ కిమనయా యాతు యద్వాన్ధకూపమ్।
త్వ మ్మే స్వామీ భవ దనుచరః శర్వ యత్సర్వదాహం
తద్ధి శ్లాఘ్యమ్ స్వమతి పదమేం కామయన్తే న భృత్యాః॥ 57

ప్రతిపదార్థము:- ఇహ=ఈ లోకమున, బన్ధచ్ఛేదాత్=బంధము నశించుట వలన, తనుభృతామ్=శరీరధారులకు (మనుష్యులకు), త్వయా సాకమ్=నీ తోడి, ఐక్యమ్=ఏకత్వము, యత్=ఏదో, సా=అది, ముక్తిఃచేత్=ముక్తి అయిన యెడల,

అనయా=దీనితో, కిమ్=ఏమి, అన్ధకూపమ్=చీకటి బావిని గూర్చి, యాతు=పోవు గాక, వా=మరియు, త్వమ్=నీవు, మే=నాకు, స్వామీ=ప్రభుడవు, అహమ్=నేను, సర్వదా= ఎల్లప్పుడు, భవదనుచరః యత్=నీ సేవకుడనగుట యేదో, తద్=అది, శ్లాఘ్యమ్ హి=మెచ్చుకొన దగినది గదా, భృత్యాః=సేవకులు, స్వమతి పదవీమ్= తమ బుద్ధికి దోచిన పదవిని, న కామయన్తే=కోరుకొనరు.

తాత్పర్యము:- ఈ లోకమున బన్ధము నశించినందువలన కలుగు ముక్తి నీ తోడి ఐక్యమే. అయినచో నాకు దానితో నేమి? అది చీకటి బావిలో పడనీ, నీవు నా స్వామివి. నేను నీ సేవకుడ నగుటయే మెచ్చుకొన దగినది. సేవకులు తమ బుద్ధికి తోచిన పదవిని కోరుకొనరు.

వివరణము:- ఈ లోకమున బన్ధము అనగా అజ్ఞానము. అది నశించుట జ్ఞానము వలన జరుగును, జ్ఞానమనగానేమి? జీవ బ్రహ్మైక్య జ్ఞానము. జీవుడు బ్రహ్మము (శివుడు) ఒకటే అను జ్ఞానము. దీనిని ముక్తి అని కొందఱు (అద్వైతులు) అందురు. ఇదే ముక్తి అగుచో నాకా ముక్తితో పని లేదు. ఆ ముక్తి చీకటి బావిలో పడి నశించిపోనీ. నాకు పోవున దేమియు లేదు. నీవు నాకు ప్రభుడవు. నేను సేవకుడను. నీకిష్టమైనది. ఈ లోకమున నీకు (కైలాసవాసికి) దూరముగా ఉండుమని శాసించినావు. ఇక్కడ నేను వసించు చున్నాను. రేపు కైలాసమునకు రమ్మనినచో వచ్చెదను. లేక చీకటి బావిలో నుండుమందువేని అక్కడ హాయిగా నివసించెదను. సేవకుని ధర్మము ప్రభువు యొక్క ఆజ్ఞ పాటించుటయే. నీవు ఆజ్ఞ ఇచ్చుటేమి. నేను పాటించుటేమి. నీవే ఇచట ఉంచినావు. ఉన్నాను ఉండక ఏమి చేయుదును. ఉరివేసి కొందునా? రేపు చీకటి బావిలో ఉండు మందువు. నీ దేమి పోయినది? ఉందును. నాదిమాత్రమేమి పోవును. పోవుటకు నాదనునది నాకడ నేమి యున్నది. సేవ చేయించుకొన్నచో చేయుదును. లేదా నీవే వృషభ మూర్తివై మీద ఎక్కించుకొనిన ఎక్కుదును. ఇది చేయకూడదు. ఇది చేయవలెనను స్వబుద్ధి భృత్యున కుండవచ్చునా? భూరూపివై నీవే యీ లోకమున నున్నావు. నేనా భూమిపై ఏవేఱు అపవిత్ర కార్యముల చేయుటలేదు. నేను పట్టించుకొన గలనా. పట్టించుకొనినను భూమిని విడచి ఆకాశమున కెగుర గలనా? ఉట్టికే ఎగురలేనే. సేవకులు తమబుద్ధికి తోచిన పదవిని కోరుకొని తమ కోరిక ఫలించినదని ఆనందించ వచ్చునా?

ప్రభువునిచ్ఛ ఫలింపవలెనని కోరు కొనుటయే వారికుచితము. ఏమైనను నాకీ దాస్యమే బాగున్నది. ఈ సేవయే బాగున్నది. బన్ధమైన నేమి, దుఃఖమైననేమి స్వర్గమైన నేమి నరకమైన నేమి? ఏదనుభవించినను నీ సేవగా నేను నీ ఆజ్ఞను పాటించుటగానే భావించెదను. భావించుట మాత్రమేల? ఏమియు చేయను. ఏమి చేయగలనో చేయవలెనో ఎఱుగను. నీ ఇచ్ఛ నెఱవేఱుగాక. నాకిచ్ఛ యనునదే నశించుగాక. అప్పుడే మంచి సేవకుడను గదా! అసలు నీకు సేవకు లెందుకు? సేవకులు లేకపోయిన వారి సేవలేకపోయిన నీ కున్న ప్రభుత్వమునకు విలువ ఏమి? అనియా నీకు చింత? పుష్కల సంఖ్యలో సేవకులున్నప్పుడే నీ దర్జా గొప్పది. అనుకొను చున్నావేమి? సేవకులు సేవ చేయు చున్నప్పుడే నీకు ఆనందము పెఱుగునా? వారు లేనిచో తరుగునా? నీ ఆనందము పూర్ణమైనది గదా! సేవకుల ద్వారా దానికి పూర్ణత కలుగుటేమి? ఏమైన నేమి? నాకు నీ మీద ఉన్న ప్రేమ గుడ్డిది. నీకును నా మీద ప్రేమ ఉన్నచో గుడ్డిదే అగును. ఎవరికి ఎవరి మీద ప్రేమ ఉన్నను అది గుడ్డిదే నేమో! నాకు నీవు ప్రభుడవు అగుదువు గాక! నేను నీకు సేవ చేయుచుందును గాక ఇంతవఱకు నీవు నాకేమి ప్రతిఫలమిచ్చితివి. జన్మ మరణ పరంపరనా? సంసార చక్ర భ్రమణమునా? ప్రతిఫలము తీసికొను సేవ సేవయే గాదు. అది వ్యాపారము మాత్రమే అందువా? నేను నీకు వెట్టి చాకిరీ చేయు సేవకుడనే అగుటకు సిద్ధుడనై బ్రహ్మాది సార్వభౌమానందము లన్ని తిరస్కరించెదను. సేవ మాత్రమే చేయుదు నన్నచో లోకులు నా ప్రేమ గుడ్డి ప్రేమ అనరా? అననీ అనుకోనీ నాకేమి? నీకు నేను సేవ చేసిన చేయుదును గాక. నా మీద నీ ప్రేమ నేనేల ఆశించవలె. నీవు నన్ను ప్రేమించకున్నను సేవించెదను. నీవు ప్రేమించ వలసినంత గొప్ప పని నేమి చేసితిని? చేయుటకు కరణముగా నాదనున దేమి యున్నది. ఈ అవయవములు నీ వొసగినవే. వానితోనే దేని సేవ చేసినను అది నాదెట్లగును. అన్నియు నీవు ప్రసాదించినవే. ఆ సేవ కూడా నీవు చేయించుకొనినదే. నీ యిచ్ఛ ఇట్లున్నది. అసలు నీకు ఇచ్ఛ యేల ఉండవలె? నిన్ను ఆప్తకాముడవని అందురు కదా! ఆప్తకామునికి నీకు ఇచ్ఛ అనగానేమి? అసలు నీవీ జగము నేల సృష్టింపవలె? సృజించి పాలించుట వరకు పరవాలేదు. మంచిదే. కాని దీనినంతను ఏల చంపెదవు. అంత నిర్దయ కఠోరత నీకేల? ఇదంతయు ఆలోచించిన కొలది ఏ ప్రశ్నకు సమాధానము లభించదు. నీవు చెప్పుదువా అనినచో చెప్పవు. నేననుకొనున

దంతయు మిథ్యయే. నేను సత్యమునా? నేను సత్యము నెట్లగుదును? జీవుడీశ్వర భిన్నముగా శాశ్వతుడని కొందరందురు (విశిష్టాద్వైతులు). నేనణువుననియే వీరందురు అణువునైన నేను నీపై వ్రాలుదునేమో. నేను నీ కేమి సేవ చేయుదును. అందుకే శరీర మిచ్చెదవు. ఇట్లే సేవించు చుందును, వెట్టి చాకిరి చేయు చుందును, కులుకు చుందును. సరేనా!

అవతారిక:- పై శ్లోకమున శివైక్యమునకన్న శివసేవయే తనకు తృప్తి హేతువు అని కవిచే చెప్పబడినది. ఈ శ్లోకమున తన చిత్తము నిద్రించ కుండునట్లను గ్రహింపుమని యాతడు శివుని కోరుట చెప్పబడు చున్నది.

శ్లో॥ వాతోద్ధూత స్ఫుట కమలినీ పత్రతోయోపమానే
కో విశ్వాసం వ్రజతి చపలే జన్మనో జీవితే2స్మిన్।
శాన్తస్త్రీణామ్ ప్రియ సహచరై ర్నిర్భరాలిఙ్గిత మ్మే
చేతః శమ్భో స్వపితి న యథా తత్ప్రసాదం కురుష్వ॥ 58

ప్రతిపదార్థము:-శమ్భో=ఓ శివా!, వాతోద్ధూతస్ఫుట కమలినీ పత్రతోయోప మానే=గాలిచే కొట్టబడిన వికసించిన కమలపుతీగ యొక్క ఆకు ఉపమానము గా గల, జన్మనః=జన్మించిన వాని యొక్క, చపలే=చంచలమైన, అస్మిన్=ఈ, జీవితే=జీవితము నందు, కః=ఎవడు, విశ్వాసమ్= నమ్మకమును, వ్రజతి= పొందును, శాంతస్త్రీణామ్=శాంతస్త్రీల యొక్క, ప్రియసహచరైః=ఇష్టమైన సహచరులతో, నిర్భరాలింగితమ్=గాఢముగా కౌగలించుకొనబడినదై, మే=నా యొక్క, చేతః=చిత్తము, యథా న స్వపితి=నిద్రించకుండునట్లు, తత్=ఆ, ప్రసాదమ్=అనుగ్రహమును, కురుష్వ=చేయుము.

తాత్పర్యము:- గాలిచే కొట్టబడిన తామరాకు ఉపమానముగాగల పుట్టినవాని ఈ చంచల జీవితమును ఎవడు విశ్వసించును. శాంత స్త్రీల యొక్క ప్రియ సహచరులచే గాఢముగా కౌగిలించుకొనబడి నా చిత్తము నిద్రించ కుండునట్లు అనుగ్రహించుము.

వివరణము:- పూర్వార్ధమున గాలిచే కొట్టబడిన తామరాకు ఉపమానముగా, జీవిత ముపమేయముగా ఉపమాలంకార ముపమానశబ్దముచే నేర్పడి యున్నది. చంచలత్వము సమాన ధర్మము. ఇట్లు చంచలమైన జీవితము యొక్క

కాలమల్పము కదా. అది పోయిన మరల రాదు గదా. ప్రియ సహచరులు కౌగిలించుకొన్న స్త్రీలు శాంతముగా నుందురు. నాకు వారేమనసున నెప్పుడు కనబడు చుందురు. శివధ్యానము చేయవలె నన్నప్పుడును వారట్లే తోచుచుండగా నా మనస్సు నిద్రించియే యుండును. ప్రియుల కౌగిలింతలోనున్న స్త్రీలు గాఢముగా సర్వమును మఱచి నిద్రించెదరు. ఇట్టి దృశ్యమును చూచుచున్న మనసును దాదాపు నిద్రించుచునే యుండును. సర్వేతర విషయములను, జీవితము యొక్క క్షణభంగురత పాపకర్మల వలన పాపాలోచనల వలన కలుగుబోవు నరకమును తాత్కాలిక సుఖము నాశించి అశాస్త్రీయ మార్గమున దాని ననుభవించిన వారికి చిరకాలము లభించబోవు దుఃఖమును సర్వమును మఱచి యుండును. అట్లు వివేకమును కోల్పోయి అజ్ఞాన నిద్రలో మునుగకుండ నా చిత్తమును మేలు కొలుపు, అనుగ్రహమును ప్రసాదింపుము.

అవతారిక:- పై శ్లోకమున అవివేక నిద్రలో తన చిత్తము మునగకుండ కాపాడుమని కవి భగవంతుని కోరుట చెప్పబడినది. ఈ శ్లోకమున తన చిత్తమును కామము నుండి రక్షింపుమని వేడుకొనుట చెప్పబడు చున్నది.

శ్లో॥ త్వన్నేత్రాగ్ని వ్యతికర మయమ్ ప్రాక్తనమ్ పుష్పచాపం
స్మృత్వా నూనం వ్యవసితమతి ర్వైర నిర్యాతనాయ।
య త్సంసక్తం తవ చరణయో ర్దేవ సేవానురాగాత్
తన్మే చేతన ప్రహరతి శరై స్త్ర్యక్ష తద్రక్ష యత్నాత్॥ 59

ప్రతిపదార్థము:-త్ర్యక్ష=ఓ మూడుకన్నులు గల, దేవ=ప్రభూ!త్వన్నేత్రాగ్ని వ్యతికరమయమ్=నీ నేత్రము నందలి అగ్ని పంచయముతో నిండిన, ప్రాక్తనమ్= ప్రాతదైన, పుష్పచాపమ్=పూవిల్లును, స్మృత్వా=స్మరించి, యత్= ఏ, మే= నాయొక్క, చేతన=మనస్సు, తవ=నీ యొక్క, చరణయోః= పాదములందు, సేవానురాగాత్=సేవపైని ప్రేమవలన, సంసక్తమ్= ఆసక్తమైనదో, తత్=దానిని, వ్యవసితమతిః=నిశ్చితబుద్ధి గలవాడు (మన్మథుడు), వైరనిర్యాతనాయ= పగతీర్చు కొనుటకు, శరైః=బాణముతో, నూనమ్=నిశ్చయముగా, ప్రహరతి=కొట్టు చున్నాడు, తద్=దానిని, యత్నాత్=యత్నము వలన, రక్ష=రక్షించుము.

తాత్పర్యము:- ఓ ముక్కంటీ ప్రభూ! ఎప్పుడో నీ కంటి మంటతో స్పృశింప బడిన తన పూవిల్లును తలచుకొని పగతీర్చుకొనుటకు నిశ్చయించుకొని, (వైరివైన)

నీ చరణములందు సేవను చేయు రాగమువలన ఆసక్తమైన నా మనస్సును బాణముతో కొట్టుచున్నాడు. ప్రయత్నంచి దానిని రక్షింపుము సుమా!

వివరణము:- శివుడు మన్మథుని కాల్చినపుడు మన్మథుని శరీరముతోపాటు దాని నంటి యున్న పూవిల్లునకూ మంట లంటుకొనినవే. కాలిబూడిదైనను మన్మథుడు మరల బ్రతికి నట్లే. పూవిల్లును మరల వికసించినది. తనను కాల్చినందుకు మన్మథుడు శివునిపై ప్రతీకారము చేయవలెను. పగతీర్చు కొనవలెను. కాని మన్మథుడు శివునేమి చేయగలడు. శివుడనిన ఇప్పటికిని పాతబడిన ఆతని మంటస్మృతికి వచ్చి భయపడి పోవును. కవి యొక్క మనస్సు శివచరణారవిందములం దాసక్తమై యున్నది. ఆ విషయమును మన్మథుడు పసిగట్టినాడు. శివునేమి చేయలేక ఆతని చరణములం దాసక్తమైన కవి మనస్సును మరల వికసించిన పుష్పచాపముల పూలబాణముల నెక్కుపెట్టి కొట్ట దొడగినాడు. ఇట్లు శత్రువును జయింపలేక శత్రుపక్షమునకు చెందిన వారిపై పగతీర్చుకొనుటచే, ప్రత్యనీకాలంకార మేర్పడియున్నది. ఉత్ప్రేక్షాలంకారము కూడ నున్నది. సేవాను రాగముచే నీచరణముల నే ఫలము నాశింపకయే సక్తమైన నా మనస్సును పూవిలుకాని బాణముల నుండి ప్రయత్నించి రక్షింపుము. అపుడు కన్ను మాత్రము తెఱచి వాని శిక్షించినానని మరల కన్ను తెరచెదవేమో. ఇప్పుడాతను మనసులో దాగియున్నాడు. అప్పుడును నీ మనసులోననే దూరినాడు గదా. ఏమి చేయవలెనో ఆలోచించి యత్నించి రక్షింపుము.

అవతారిక:- పై శ్లోకమున శివుని యందలి ద్వేషముతో శివుని చరణములం దాసక్తమైన మనస్సును మన్మథుడు కొట్టుచున్నాడు. కావున రక్షించు బాధ్యత శివునిదే అని కవిచే చెప్పబడినది. ఈ శ్లోకమున శివుడీయ గలిగిన భక్తి యొక్కటే చాలునని చెప్పబడు చున్నది.

శ్లో॥ భిక్షాపాత్ర మ్మృగజ మజినం జీర్ణ కౌపీన మేకం
కన్థా రథ్యాని పతిత జరత్కార్ణ లేశైశ్చ లక్ష్మీః।
ఏతావాం స్తే హర పరికర స్త్వత్ప్రసాదేన నిత్యమ్
భూయా ద్భూయ స్తవ చరణయో ర్భూయసీ భక్తి రేకా॥ 60

ప్రతిపదార్థము:- భిక్షాపాత్రమ్=భిక్షాపాత్రము, మృగజమ్=జింకవలన

నేర్పడిన, అజినమ్=చర్మము, ఏకమ్=ఒక, జీర్ణకౌపీనమ్=చిరిగినగోచి, రథ్యాని పతిత జరత్తార్ణలేశైః=రథము (బండ్లు) నడచుదారిలో పడిన ఎండిన గడ్డి పఱకలచే, లఘ్వీ=తేలికైన, కంథా=జోలె, హర= ఓ శివుడా, ఏతావాన్=ఇంతే, తే=నీ యొక్క, పరికరః=సాధన సామగ్రి, త్వత్ప్రసాదేన=నీ అనుగ్రహము చేత, తవ=నీ యొక్క, చరణయోః=పాదములందు, భూయసీ=అధిక తరమైన, ఏకా=ఒక, భక్తిః=భక్తి, భూయః=మాటిమాటికి, భూయాత్=కలుగుగాక!

తాత్పర్యము:- ఒక భిక్ష పాత్ర, ఒక జింక చర్మము, దారిలో రాలిన గడ్డి పరకల జోలె, ఒక చిన్నగోచి ఇంతే నీ సాధన సామగ్రి. నీ అనుగ్రహముచేత నీ చరణములందు మాటిమాటికి ఒక భక్తియే నాకు ఎల్లప్పుడు కలుగుగాక!.

వివరణము:- ఓ హరా! ఒక భిక్షాపాత్రము, ఏ బ్రహ్మతలను కొట్టగా నంటుకొన్నదే కాని అది నీవు కొన్నదిగాదు. చేయించుకొన్నదియు కాదు. దాని నెవరును అడగరు. జింక చర్మమొకటి కప్పుకొనుట కున్నది. ఇతరులు కిచ్చుటకు ఇంకొకటి నీకు లేదు కదా. ఉండి యుండిన పాపమిచ్చి యుండెడి వాడవేమో. ఒకటే నీకడనున్నదని తెలిసిన వారు ఇమ్మని అడుగుటకు అడుగువారికి నోరెట్లు వచ్చును. ఒక చిఱిగిన గోచి యున్నది. అడిగిన తీసి యిచ్చెదవేమో. అడుగువారికి సిగ్గున్నది. కావున ఎవడును అడుగడు. దారిలో బండ్లపై నుండి, రథములపై నుండి జారిపడిన ఎండుగడ్డి పరకలచే నిర్మితమై ఏ మాత్రము బరువులేని ఒక జోలె వున్నది. దానిని ధరించి తిరుగుట నీకొకనికే సాధ్యమైనది. మరెవనికైనను నీవు దానిని ఇచ్చినచో ఒకరి యింట భిక్షను సైతమది మోయజాలక చిఱిగిపోవును. దాని నెవరు కోరుదురు. నీ కడ అడుగుట కింకేమి యున్నది. ఇదే కద నీ ఆస్తి (సర్వస్వము). అయినను నేను మాత్రము అడిగెదను. ఇతరులెవరైన అడిగినారో లేదో నేను పట్టించుకొనను. నీ మీద నాకు ప్రేమ యున్నది. అది నా కిమ్ము. నేను నిన్ను ప్రేమించెదను. ఇంతటి విరాగివి. ఇట్టి వస్తువుల శరీరములపై వేసికొనిన నీకు దాని యందెంత ప్రేమ యున్నదో తెలియుచునే యున్నది. శరీరముపై ప్రేమ నాకేమి అక్కఱ లేదు. నా ఆత్మ పైననే తప్ప శరీరముపై లేకుండ జేయుము. ప్రేమయే భక్తి కదా. ఆ గొప్ప భక్తి నొక్క దానినే యిమ్ము.

అవతారిక:- పై శ్లోకమున భక్తి యొకటి ఈయుమని కవిచే ప్రార్థింపబడినది. ఈ శ్లోకమున భక్తికి కేంద్రమైన భర్గుడు అను దేవుడు సృష్టియొక్క సారమని

ఆ దేవుడు మహా దేవుడని ప్రసిద్ధి యేర్పడినది. కావున ఇక చేయదగిన స్తోత్రమే మున్నదని స్తోత్రోపసంహార మారంభింపబడు చున్నది.

శ్లో॥ దేవ స్త్వద్వ ద్భవసి భగవన్ భర్గ సర్గస్య సారం
తస్మాత్పూర్వ మ్మహదితి పదమ్ ప్రోక్త ముత్కర్ష మాహ।
మాహాత్మ్యం తే స్మరహర మహాదేవ నామ్నైవ లోకే
దూరారూఢం వరద కిమహం స్తోత్ర మన్యత్కరోమి॥ 61

ప్రతిపదార్థము:-భగవన్=భగవానుడా!, వరద=వరముల నొసగువాడా!, స్మర హర=మన్మథుని చంపిన వాడా!, సర్గస్యసారమ్=సృష్టి యొక్క సారము, దేవః= దేవుడవైన నీవు, తద్వత్=అట్లే, భవసి=అగుచున్నావు, తస్మాత్=ఆ దేవ శబ్దము నకు, పూర్వమ్=ముందు, మహత్ ఇతి పదమ్=మహత్ అను పదము, ప్రోక్తమ్= చెప్పబడినదై, తే=నీ యొక్క, ఉత్కర్షమ్=ఆధిక్యమును, ఆహ=చెప్పు చున్నది, మహాదేవ నామ్న ఏవ=మహాదేవఅను పేరుతోడనే, తే=నీ యొక్క, మాహాత్మ్యమ్ =గొప్పదనము, దూరారూఢమ్=దూర తీరములకు చేరినది, అహమ్ =నేను, అన్యత్=మరొక, స్తోత్రమ్=స్తోత్రమును, కిమ్=ఏమని, కరోమి= చేయుదును.

తాత్పర్యము:- ఓ భగవానుడా! నీవు సృష్టి యొక్క సారమని దేవశబ్దము చెప్పును. దానికి పూర్వము చేర్చబడిన మహత్ అను శబ్దము సర్వాధిక్యమును తెలుపు చున్నది. ఇట్లు మహాదేవ శబ్దము చేతనే నీ గొప్పతనము లోక ప్రసిద్ధము కాగా నీ స్తోత్ర మింక నేమని చేయుదును.

వివరణము:- భగమనగా సమగ్ర ఐశ్వర్య వీర్య యశః శ్రీ జ్ఞాన వైరాగ్యములను ఆఱు గుణములు. ఇట్టివే కళ్యాణ గుణము లన్నియు భగ శబ్ద వాచ్యములు. అట్టి భగము కలవాడు భగవానుడు. భూతముల ఉత్పత్తి వినాశములు, గత్యా గతులు, విద్యావిద్యల నెఱిగినవాడు భగవానుడు. అతడే క్రీడించువాడు. వ్యవహరించు వాడు. ప్రకాశించువాడు. ఎఱుగువాడు. కావున దేవుడని చెప్ప బడును. సంసారమును, అజ్ఞానమును కాల్చువాడు కావున భర్గుడు, అని చెప్ప బడును. ఆయన సృష్టి మూలము అగుటయేగాక సృష్టిలోని సారము కూడ ఆయనయే అయి యున్నాడు. దేవశబ్దము వ్యవహరించువాడు అను నర్థమున జీవుని యెడల కూడ వర్తించును. స్వయమ్ ప్రకాశ స్వరూపుడైన ఈశ్వరుని

యందు ప్రకాశించువాడు అను అర్థమున సరిపోవు చున్నది. కావున దేవ శబ్దము జీవునందును దేవునందును వర్తించును. ఆయనయే మహత్ అను శబ్దమును దేవ శబ్దమునకు చేర్చి మహాదేవుడు అనియు చెప్పబడు చున్నాడు. ఆ పేరే దేవునకును లేదు. కావున ఆయన గొప్ప తనమును చెప్పును. ఆ పేరు తోడనే లోక ప్రసిద్ధుడైన మహా దేవుని గొప్పతనము కూడ లోక ప్రసిద్ధమే. కావున ఇక పొగడవలసిన స్తుతించవలసిన అవసరమే లేదని స్తోత్రమును ఉపసంహరించుచు కవి చెప్పు చున్నాడు.

అవతారిక:- ఇంతవఱకు ఆరంభము నుండి మందాక్రాంత వృత్తములలో స్తోత్రమును రచించి కవి వివిధ వృత్తములలో స్తోత్రము నుపసంహరించుచు వసంత తిలకావృత్తమున నీ క్రింది శ్లోకమును రచించినాడు.

శ్లో॥ యత్ర క్వచి ద్భవతు దేవ మనుష్య తిర్యగ్
యోనౌ స్వకర్మ పరిపాకవశా త్ప్రసూతిః।
తత్ర స్థితస్య మమ బాల మృగాఙ్క మౌళే
త్వత్పాదభక్తి రచలాస్తు భవత్ప్రసాదాత్॥ 62

ప్రతిపదార్థము:- స్వకర్మ పరిపాక వశాత్=స్వకర్మ పరిపాక వశమున, దేవ మనుష్య తిర్యగ్యోనౌ=దేవమనుష్య పశు పక్ష్యాది యోని యందు, యత్ర క్వచిత్= ఎక్కడనో ఒక చోట, ప్రసూతిః=జన్మము, భవతు=కలుగుగాక, తత్ర=అచట, స్థితస్య=ఉన్న, మమ=నాకు, బాలమృగాంక మౌళే=బాలచంద్రుని శిరమున ధరించిన వాడా, అచలా=చలించని, త్వత్పాదభక్తి=నీపాదభక్తి, భవత్ప్రసాదాత్=నీ అనుగ్రహమున, అస్తు=కలుగుగాక.

తాత్పర్యము:- బాలచంద్రుని శిరమున దాల్చిన వాడా! పూర్వకర్మ పరిపాక వశమున దేవ మనుష్య పశు పక్ష్యాది జన్మమేది కలిగినను నీ పాదభక్తి మాత్రము అచంచలమై ఉండుగాక! నాకీ అనుగ్రహ మొకటి చాలును.

వివరణము:-స్వకర్మ అనగా తాను చేసిన కర్మ. గడిచిన కాలమున చేయబడిన కర్మ మనచే సంపాదితము. అది ఎన్నియో జన్మల నుండి పేరుకొని పేరుకొని సంచిత మనబడును. దానిలో నుండి పరిపక్వమైన అనగా ఫలము నిచ్చుటకు సిద్ధమైన కర్మ ప్రారబ్ధము అనుబడును. ఇది మాత్ర మనుభవించక తీరదు.

మిగిలిన సంచిత కర్మమును, పుణ్యకర్మ చేసి నశింప జేయవచ్చును. ధర్మేణపాప మపనుదతి అను వాక్యమే పుణ్యకర్మ పాపకర్మ ఫలము ననుభవించ కుండ తప్పించు కొనునట్లొనర్చును అని చెప్పుచున్నది. పరిపక్వమైన కర్మయైన ఫలముల నిచ్చుట కారంభించిన దగుటచే ప్రారబ్దము అని చెప్పబడినది. అది మాత్రము అనుభవించక తీరదు. అనుభవించక తప్పదు. ఆ ప్రారబ్ధము ననుసరించి దేవ మనుష్యపశుపక్ష్యాదులకు సంబంధించిన ఏ జన్మ వచ్చినను నీ అచంచల పాదభక్తి యుండునట్లు అనుగ్రహించుము. బాల మృగాంకుని కళంకి యైనను శిరమున ధరించిన నీకు నాకు అనుగ్రహము నొనరించుటలో అత్యాశ యేమియు కాదను కొందునని బాలమృగాంక మౌళే అను సంబోధనము వ్యంజించు చున్నది.

అవతారిక:- బాలచంద్రుని పూవుగా ధరించిన వాడు అను అర్థము నిచ్చు బాలమృగాంక మౌలే అని పై శ్లోకమున సంబోధింపబడినది. ఈ శ్లోకమున పూవును సమర్పించుట యొక్క ఫలము చెప్పబడు చున్నది.

శ్లో॥ తవ చరణ సరోజే దత్తమేకమ్ ప్రసూనమ్
ఫలతి జలధి వేలా వేష్టితామ్ భూతధాత్రీమ్।
ప్రతి దివస సపర్యాభక్తి కౌతుహలానామ్
ఫలమిదమితి శమ్భో శక్యతే కేన వక్తుమ్॥ 63

ప్రతిపదార్థము:-తవ=నీ యొక్క, చరణసరోజే=పాదకములమున, దత్తమ్= ఈయబడిన, ఏకమ్=ఒక, ప్రసూనమ్=పుష్పము, జలధివేలావేష్టితామ్= సముద్రపు ఒడ్డుతో చుట్టబడిన, భూతధాత్రీమ్=భూమిని, ఫలతి=ఫలించును, ప్రతిదివససపర్యాభక్తి కౌతుహలానామ్=ప్రతిదినము సేవయందు భక్తి కౌతూ హలము కలవారి యొక్క, ఫలమ్=ఫలము, ఇదమ్=ఇది, ఇతి=అని, కేన= ఎవనిచే, వక్తుమ్=చెప్పుటకు, శక్యతే=శక్యమగును.

తాత్పర్యము:- నీ పాద కమలమున నొక పుష్పము సమర్పించిన సమస్త భూమండలాధిపత్యము ఫలముగా లభించును. ప్రతి దివసము నిన్ను సేవించు భక్తి కౌతూహలము గల వారి ఫలమేమని చెప్పుటకు సాధ్యమగును?

వివరణము:- శివుని పాదము కమలము. దానికి మరొక పుష్పము, కమలము గాని, మరే పుష్పమైనను సమర్పించినప్పుడు ఆ రెండు పుష్పముల కలయికలో సర్వభూమండలాధిపత్యము అను ఫలము జనించును. ఆ రెండు పుష్పములు

భార్యాభర్తలు. శివుని పాదకమలము భర్త. భక్తుడు సమర్పించినది భార్య. భార్యలేనిదే భర్త ఫలింపడు. భర్త లేనిదే భార్య ఫలించదు. ఈ వస్తువు సరోజ శబ్దముచే వ్యంగ్యము అగుచున్నది. చిన్నపుష్పమును స్వీకరించి పెద్ద ఫలమును అనగా భూమండలాధిపత్యమును ఫలించు శక్తి నీ పాద కమలమున కున్నది అని మరొక వస్తువు కూడ వ్యంగ్యమగు చున్నది. ప్రతి దివస సపర్యలో నొక పుష్ప సమర్పణమే కాదు. మరెన్నో ఉపచారములు సమర్పింపబడు చుండును. ఒకసారి ఒక పుష్పము సమర్పింపబడిన భూమండలాధిపత్యము ఫలముగా లభించినచో సహస్రాధిక పుష్పములు సమర్పించిన వాని కెన్ని ఫలములు లభింపవలెను. ఇక పంచామృతాభిషేకాదులకు గంధబిల్వధూప దీపనైవేద్యాద్యుప చారముల ప్రతిదినము సమర్పణమున ఈశ్వరుని కడ ఈయదగిన దేముండును. చివఱ కాయన తనకు తానే సమర్పించుకొని నీలో ఐక్యమగుట తప్ప ఆయనకు గత్యంతరము లేదు. ఇది మాలినీ వృత్తము.

అవతారిక:- పూర్వ శ్లోకమున మహాదేవ నామమాహాత్మ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున మహాకాల నామమాహాత్మ్యము చెప్పబడుచున్నది.

**శ్లో॥ కాలేన నీత: సర్వో2పి పునరావర్తతే జన:।**
**మహాకాలేన నీతస్య నావృత్తి ర్విద్యతే పున:॥ 64**

ప్రతిపదార్థము:- కాలేన=కాలునిచే, నీత:=తీసుకొని పోబడిన, సర్వ:=ప్రతి, జన:అపి=ప్రాణియు, పున:=మరల, ఆవర్తతే=మరలి వచ్చును, మహాకాలేన =మహాకాలునిచే, నీతస్య=కొనిపోబడిన వానికి, పున:=మరల, ఆవృత్తి:= మరలి వచ్చుట, న విద్యతే=లేదు.

తాత్పర్యము:- కాలునిచేత కొనిపోబడిన ప్రతి ప్రాణియు ఈ మర్త్యలోకము నకు తిరిగి వచ్చును. మహాకాలుడు అను పేరుగల శివునిచే తీసికొనబడిన వానికి మరల మరలి వచ్చుట లేదు.

వివరణము:- చచ్చినవానికి పుట్టుక తప్పదు, (ధ్రువం జన్మ మృతస్యచ= చచ్చినవానికిని మరల పుట్టుక నిశ్చితము) అని భగవద్గీత చెప్పుచున్నది. చచ్చుట అనగా కాలనాముడైన యమునిచే స్థూల శరీరము నుండి ప్రాణేంద్రియాది మత్సూక్ష్మ శరీరము తీసికొని పోబడుట. మహాకాలునిచే తీసికొని పోబడుట అనగా శివైక్యము నొందుట. అట్టి వానికి కాలునిచే సూక్ష్మ శరీరము తీసికొని

పోబడుట అనునది ఉండదు. న తస్య ప్రాణా ఉత్క్రమన్తి అత్రైవ సమవలీయన్తే వాని ప్రాణములు పైకి (ఊర్ధ్వలోకములకు) పోవు. ఇక్కడనే మర్త్యలోకగత భూతములందే లీనము లగును) అని ఉపనిషత్తు చెప్పుచున్నది. కాలుడనగా మ్రింగువాడు. మహాకాలుడనగా కాలునే మ్రింగువాడు. కాలకాల శబ్దము కూడ శివవాచకముగా నున్నది. కాలగతి కొంతవఱ కూహించు కొనవచ్చును. ముదుసలివాడు కొంతకాలమునకు మరణించునని చెప్పవచ్చును. చచ్చిన పిమ్మట కాలుసేతులు ఊపిరి ఆడకపోవుట వలన చచ్చినాడని ఊహింప వచ్చును. కాని ఒకవ్యక్తి శివాత్మైక్యజ్ఞానము కలిగి శివైక్యము నందినా డనుట ఊహకును అందనట్టిది. జీవించి యున్నాడని ఒకనిని గూర్చి చెప్పగలమేకాని ఆతడు జీవన్ముక్తుడనుట యెట్లు? ఇది అనుష్టుప్ ఛందమున రచింపబడిన శ్లోకము.

అవతారిక:- పై శ్లోకమున శివానుగ్రహము పునరావృత్తి రహిత ముక్తికి హేతువని చెప్పబడినది. ఈ శ్లోకమున దోషభూయిష్ఠమైనను తన గుణకీర్తనము తనకు జన్మాంతరముననుభక్తిని కలిగించునని కవిచే చెప్పబడు చున్నది.

శ్లో॥ అప్యేకాక్షరజల్పితైరపి శిశోః ప్రీతి ర్గురూణామ్ భవేత్
తస్మా న్మద్వచనమ్ మలీమసమపి స్యాత్తుష్టి హేతు స్తవ।
శ్రాన్త స్త్వద్గుణ కీర్తనాత్ కిమపి యత్పుణ్యమ్ మయోపార్జితం
తేన స్యా జ్జననాన్తరేపి గిరిశ! త్వయ్యేవ భక్తి ర్మమ॥ 65

ప్రతిపదార్థము:- శిశోః=శిశువు యొక్క, ఏకాక్షర జల్పితైఃఅపి=ఒక అక్షరము వాగుటలో కూడ, గురూణామ్=పెద్దలకు, ప్రీతిః= సంతోషము, భవేత్=కలుగును, తస్మాత్=అందువలన, మద్వచనమ్=నా మాట, మలీమసమ్ అపి=మలినమైనను, తవ=నీకు, తుష్టిహేతుః=సంతోషమును కలిగించునది (భవేత్=అగును), త్వద్గుణ కీర్తనాత్=నీగుణముల కీర్తించుట వలన, శ్రాన్తః=అలసినవాడను, (తస్మాత్= దానివలన), యత్=ఏ, పుణ్యమ్=పుణ్యము, మయా=నాచేత, ఉపార్జితమ్= సంపాదింపబడినదో, తేన=దానిచేత, గిరిశ=ఓ శివా, జననాన్తరే అపి=జన్మాంతరము నందును, త్వయి ఏవ=నీ యందే, మమ=నాకు, భక్తిః=భక్తి, స్యాత్= కలుగుగాక!

తాత్పర్యము:- పిల్లలు ఒక్కొక్క పదములోని ఒక అక్షరమును అస్పష్టముగా

పలికినను పెద్దలకు సంతోషము కలుగును. అట్లే నా మాటలో నైదైన దోషమున్నను నీకు సంతోషమునే కలిగించును. నీ గుణకీర్తనమున నేను అలసి యున్నాను. దాని వలన నాకు గలిగిన పుణ్యము రాబోవు జన్మమునను నీ యందే నాకు భక్తి కలుగునట్లు చేయును.

వివరణము:- శిశువులు అమ్మా మామా అనుటకు మా అందురు. నాన్న అనుటకు నా అందురు. అయినను పెద్దలైన తల్లిదండ్రులు మొదలగువారు ఆ అసంపూర్ణోచ్చరణము తోడనే ఎంతో సంతోషించెదరు. అట్లే నాయీ మాటలలో కూడ దోషముండ వచ్చును. ఆయినను నీకు సంతోషమే కలిగించును. నీ గుణ కీర్తనము చేసి నేను అలసిపోయినాను. ఇంకను స్తుతించ వలెనన్న నాకు భావములు వచ్చుట లేదు. పదములు దొరలుట లేదు. ఏమి చేయుదును. ఇప్పటికి చేసిన గుణకీర్తనమున నాకేమైన పుణ్యము రాకుండునా? రాబోవు జన్మమున అది నాకు శివభక్తి కలిగించుటకు చాలదా! ఈ జన్మ భక్తికి నిన్ను నాకు రాబోవు జన్మను నిషేధించు మనుటలేదు. అందు కలుగబోవు దుఃఖములను తగ్గించు మనుట లేదు. నీ మీద ప్రేమను ఈ జన్మమున నీ వేల ఇచ్చితివో నాకు తెలియదు. అది నా పూర్వజన్మ పుణ్య ఫలముగా భావించు అహంకారము నాకు లేదు. రాబోవు జన్మమున ఆ భక్తినే కలిగించుము. నీకు పోవున దేమి లేదు. నాకు సంతోషము కలుగును.

అవతారిక:- పై శ్లోకమున తనకు రాబోవు జన్మమున శివభక్తి కలుగునని కవిచే చెప్పబడినది. ఈ శ్లోకమున ఒక వేళ కైలాసప్రాప్తియే కలిగినచో తాను చూడబోవు దృశ్యము వర్ణింపబడు చున్నది.

శ్లో॥ వాగ్దేవీ ధృతవల్లకీ శతమఖో వేణుం దధ త్పద్మజ
స్తాలోన్నిద్రకరో రమా భగవతీ గేయ ప్రయోగాన్వితా।
విష్ణు స్సాన్ద్ర మృదంగ మర్దన పటు ర్దేవా: సమన్తాత్ స్థితాః
సేవంతే తమనుప్రదోష సమయం దేవమ్ మృడానీపతిమ్॥66

ప్రతిపదార్థము:- వాగ్దేవీ=సరస్వతి, ధృతవల్లకీ=ధరించిన వీణ కలది, శతమఖః =ఇంద్రుడు, వేణుమ్=వేణువును, దధత్=ధరించు చున్నాడు, పద్మజః=బ్రహ్మ, తాలోన్నిద్రకరః=తాలమును మేలుకొలుపు చున్నాడు, భగవతీ=పూజ్యురాలైన,

రమా=లక్ష్మి, గేయప్రయోగాన్వితా=పాటలకు సంగీతమును సమకూర్చుచున్నది, విష్ణుః=విష్ణువు, సాన్ద్రమృదంగమర్దనపటుః=దట్టమైన మద్దెలను వాయించుటలో సమర్థుడై యున్నాడు, సమంతాత్=అంతట, స్థితాః=నిలచియున్న, దేవాః= దేవతలు, అనుప్రదోష సమయమ్=ప్రతి ప్రదోషకాలమున, తమ్= ఆ, దేవమ్= దేవుడైన (ప్రభువైన), మృడానీపతిమ్=పార్వతీశ్వరుని, సేవంతే=సేవించు చుందురు.

తాత్పర్యము:- సరస్వతి వీణను, ఇంద్రుడు వేణువును, విష్ణువు మృదంగమును వాయించు చున్నారు. పాటలకు లక్ష్మీదేవి సంగీతమును సమకూర్చు చున్నది. బ్రహ్మ తాలమును వేయుచున్నాడు. చుట్టు చేరిన దేవతలు నాట్యము చేయుచున్న పార్వతీశ్వరుని ప్రతి ప్రదోషకాలము సేవించు చుందురు.

వివరణము:- ప్రదోషకాలము అనగా బాగుగా చీకటి పడిన కాలము. అహస్సు యొక్క ఎక్కువ తక్కువల బట్టి ఒకప్పుడిది ఆఱింటికే ప్రారంభము కావచ్చును. మరొకప్పుడిది ఏడింటికి ప్రారంభము కావచ్చును. సూర్యోదయముతో ఆరంభింప బడు ప్రాతఃకాలము వలె ఇది సూర్యాస్తమయముతో ఆరంభింప బడును. ఈ కాలమున శివుడు తాండవ నృత్య మొనర్చును. శివుని స్తుతులలోగల సాయంతాండవమను ప్రయోగము ననుసరించి సూర్యాస్తమయమునకు ఆఱు గడియలు ముందే అనగా సుమారు నాలుగుగంటలకే శివుడు నాట్యమారంభించు నని తెలియు చున్నది. సంధ్యా తాండవ శబ్దము కూడ ప్రసిద్ధముగనే ఉన్నది. పగలు పూర్తి అగుటకు ముందే రాబోవు చీకటిని సూచించుచు సూర్యుని కాంతి తగ్గిపోవు చుండును. భగవంతునికి ఆతని సృష్టి కాలము ప్రాతఃకాలము, రాత్రి ప్రలయకాలము. ఆ రెంటి మధ్య స్థితికాలము. ప్రలయము యొక్క రాకకు ముందే యుగాంతక్షణములు ప్రలయ లక్షణములు రానున్నవని తెలియుట ఆరంభ మగును. అట్టి ప్రలయతాండవ కాలము నందలి శివతాండవ మీ శ్లోకమున వర్ణింపబడినది. ఈ శ్లోకము నందలి వృత్తము శార్దూల విక్రీడితము.

అవతారిక:- పైశ్లోకమున శివతాండవము వర్ణింప బడినది. ఈ శ్లోకము జన్మ జన్మమున శివభక్తి వాంఛ ఆమ్రేడింపబడు చున్నది.

**శ్లో॥ శివేభక్తిః శివేభక్తిః శివేభక్తి ర్భవే భవే**
**సదాభూయాత్ సదాభూయాత్ సదాభూయాత్ సదా మమ 67**

ప్రతిపదార్థము:- భవే భవే=జన్మజన్మమున, మమ=నాకు, శివే=శివునందు, భక్తిః=భక్తి, సదా=ఎల్లప్పుడు, భూయాత్=కలుగుగాక

తాత్పర్యము:- నాకు జన్మజన్మమున ఎల్లప్పుడు శివభక్తి కలుగుగాక.

వివరణము:- శివభక్తి నిరంతరము ముమ్మాటికి ఏతత్ స్తోత్ర పాఠకుల కందఱకు కలుగుగాక!

శ్రీ హలాయుధ శివస్తోత్రమ్, దానికి శ్రీ దోర్బల విశ్వనాథ శర్మ గారిచే రచింపబడిన డమరుక వ్యాఖ్యానమును సర్వము సంపూర్ణము.

శ్రీః





గరళకూట వినీలకణ్ఠాయ శమ్భవే
మదనాన్తకా యోం నమశ్శివాయ
కాద్రవేయాధిప గ్రైవేయ భూషాయ
మధుభి స్సఖా యోం నమశ్శివాయ
కుమ్భినీధరసుతా కుచకుమ్భ పరిరమ్భ
మహాలోలుపా యోం నమశ్శివాయ
వేదాది నిశ్శేష విద్యావధూమౌళి
మణికలాపా యోం నమశ్శివాయ

గన్ధదన్తావళ జలన్ధరాన్తకాది
విబన్ధ పరిపన్థి వాహినీ నిబిడవర్గ
బన్ధ ఘోరాన్ధకార సమ్భార కిరణ
మాలినే శాశ్వతా యోం నమశ్శివాయ

\- భీమఖండం

అలికాంబకమువాఁడు నెలవంక తలవంక
విరిపొంక మిడ బింక మొరయువాఁడు
గిత్త తత్తడివాఁడు గిరినోముఁఫలమోము
మిసిమోము తగుసాము మేనివాఁడు
మినువాఁకతలవాఁడు ననవింటి దొరమంటిఁ
గొనుకంటి పెనుమంట మినుకువాఁడు
చిలువసొమ్ములవాఁడు తొలిపల్కు గమి చిల్కు
పసదల్కుమను కుల్కు గొసరువాఁడు

చాన కనుగల్వ నునుచల్వ లీనువాఁడు
కడఁగి తమమేర్చు తాఁబేర్చు కన్నువాఁడు
మునివరుల డెందములకందు మురవువాఁడు
నెనరుదొన జాలుకొన మ్రోల నిలచినాఁడు

- సుందరేశ్వర విలాస

(చెరువు సత్యనారాయణ శా

*Published with the Financial Assistance of*
Ms. **LAVANYA RAVI,**
Tiruchengodu, Nammakkal Dist., Tamil Nadu.